# భారతి

జనవరి 1968





వ్య వ స్థా ప కు లు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

వెల ఒకరూపాయి

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్

★



జనవరి 1968

★

సంపుటము : 45 : : సంచిక 1 :

విడిప్రతి వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జనవరి 1968

# స్వ వి ష య ము

"భారతి"కి 45 వ సంవత్సరము ఆరంభమైనది. నాలుగు దశాబ్దములు పైగా నిరాఘాటముగా సాహిత్యసేవ చేయగలిగినందుకు "భారతి" గర్విస్తున్నది. ఆనందిస్తున్నది. ఇక ముందుకూడా ఇతోధికముగా సాహిత్యసేవ చేయగలనను దృఢనిశ్చయముతోను, దృఢసంకల్పముతోను వున్నది. ఆ సంకల్ప సాధనకు రచయితల సహకారము పూర్తిగా లభించగలదని ఆశిస్తు న్నది. సహకరించిన వారందరికీ కృతజ్ఞత తెలుపుతున్నది.

# ఋతు చక్రం

## శ్రీ చందూ

మధురమైన యౌవనం లా
వసంతం కరిగిపోయాక—
తీక్ష్ణమైన ప్రౌఢవయఃప్రకోపంలా
గ్రీష్మం ఒక వెలుగు వెలిగాక—
కడగండ్లతో కౌగిలింతలతో హోరాహోరి పోరాటంలా
వడగండ్ల వానల జోరు తగ్గాక—
అనుభవాలతో ఆలోచనలతో నెరిసిన తలలా
శారదాభ్రం తెల్లమొహం వేశాక—
గత స్మృతులతో ఆనందోద్వేగాలతో
కన్నీరు జార్చే పొద్దువాలిన పెద్దాయనలా
హేమంతం మంచు ముత్యాలు రాల్చాక—
శిథిలాంగాలతో, చితికిపోయిన జవసత్వాలతో
రాలిపోతున్న కేశదంతాలతో,
అస్తమిస్తూన్న సూర్యుడిలా వంగి,
ఆరిపోతున్న దీపంలా వణికే
జరాగ్రస్తమైన అర్భకప్రాణిలా
శిశిరం పతజ్జీర్ణపర్ణపథం వెంట
పాపం చేసిన వాడిలా భయ విహ్వల వీక్షణాలతో
పడుతూ లేస్తూ వస్తుంది.

*    *    *

హేమంతంతోనే వేగలేకపోయిన జనం
పులిమీద పుట్రలా—శిశిరం వచ్చిందనగానే
శీతజ్వరం వచ్చినట్టుగా
హిమాలయంవచ్చి యింటిమీద వాలినట్టుగా
పండు ముదుసలిదనం ప్రాప్తించి నట్టుగా
గజగజలాడిపోతారు.

భా ర తి

అవకాశాల్లేని ఆశల్లా,
కాలం తీరిన కళేబరాల్లా,
దారం తెగిన గాలిపటాల్లా,
పండుటాకులు రాలిపోతాయి—

అప్పులపాలై అమ్ముకున్న అగ్రహారీకుల్లా,
నెలాఖరు రోజుల్లో గొర్రెతోక గుమాస్తాల్లా,
విరాగుల్లా, యోగుల్లా, జడుల్లా
తరువులు నిర్వికారంగా నిలుచున్నాయి—
సిగ్గు విడిచి నగ్నంగా నిలుచున్న స్త్రీలా
ప్రకృతి చూడటానికి జుగుప్స కల్గిస్తుంది—
వియోగంలో ప్రేయసీ ప్రియుల్లా
లేటయిన రైలుబండికోసం ప్రయాణీకుల్లా
ప్రజలు సూర్యోదయంకోసం
కాచుక్కూర్చుంటారు—

కసాయివాడు చర్మం వలిచి, విడచిపోయిన గొడ్డుచుట్టూ
సంతోషంతో రెక్కలాడించే రాబందుల్లా
చిన్నాపెద్దా మోహాలింతింత చేసుకుని
చలిమంటచుట్టూ మూగుతారు—

ఆరు నెలలుగా జీతాలురాని బడిపంతుల్లా
ప్రపంచం వసంతంకోసం ఆశతో ఎదురు చూస్తుంది!

---



# ఎడఋపల్లి పునర్దత్త తామ్రశాసనము

## శ్రీ మునునూరి సాంబశివరామమూర్తి

తూర్పు గోదావరిజిల్లా, కాకినాడ తాలూకా, పెను మళ్ల గ్రామమున చిరకాలముక్రిందట శ్రీ దంతు లూరి సూర్యనారాయణరాజాగారికి వారి పాటిపెరటి లోని యిటుక మాలిలో ఈ తామ్రశాసనము దొరికిన దనియు, ఆ కాలమున పెద్ద లొకరు దీనిని తీసికొని వెళ్లి, కొంతకాలమైన తరువాత తిరిగి యిచ్చివేసి రనియు, ఆ నాటినుండియు నిది వారింటనే భద్ర పఱుపబడియుండియు మధ్యకాలమున యొకసారి దొంగల జేజిక్కుటచే నీ శాసనపు రేకులు మెలికలు తిరిగిన స్థితిలో తిరిగిదొరికినవనియుజెప్పి ఈ శాస నము ప్రచురణార్థము నాకు గౌరవపురస్సరముగా నప్పగించియున్నారు. ఆ రేకుల తగువిధమున బాగుజేసి పునఃప్రతిబింబముల దీసికొని తిరిగి శాసనమంతయు రాజాగారికే అప్పగించియుంటిని. ఈ శాసన ప్రచురణావ కాశమును గల్పించిన శ్రీ దంతులూరి సూర్యనారా యణరాజాగారికి, వారి మిత్రులకును నా కృతజ్ఞతాభి వందనములు.

### శాసన స్థితి

శాసనమంతయు సంపూర్ణముగానే యున్నది. రాజముద్రికతో గూడిన కడియమును గలదు. రేకు లన్నియు ఎండుటాకులవలె మెలికలు తిరిగినవి. కొన్ని టిపై గునపపుపోట్లు గలవు. కొన్నిరేకులందు రెండు వైపులకును రంధ్రములున్నవి. మఱికొన్నిట చాల చోట్ల గోతులు పడుటచే అక్షరములు గుర్తింప రాకున్నవి. రాగి కడియము నఱుకబడలేదు కాని రాజ ముద్రిక కడుగుభాగమున గొంతయును, రెండవరేకు చివరను (కుడివైపున) ఆఱు అక్షరములుగల భాగ మును నఱుకబడినవి. ఆ నఱుకబడిన ముక్కలు రెండును పూర్వకాలమందే అవసరము వెంబడిని వేరు విధమున నుపయోగింపబడినవి.

### శాసన స్వరూపము

ఇది తొమ్మిది రేకులుగల సంపూర్ణ శాసనము. రేకులు $22\frac{1}{2} \times 11$ సెం. కొలత గలిగి, ఎడమ వైపునగల 2 సెం. మీ. దూరమందున 2 సెం. మీ. వ్యాసముగల రంధ్రములద్వారా 16 సెం. మీ. వ్యాసము $1\frac{1}{2}$ సెం. మీ. ఉబవగల రాగి కడియముచే జక్కగా బంధింపబడియున్నవి. అందుచే శాసనము దాటాకు పొత్తమువలె ముడిచి యుంచుటకును, అవసరము వెంబడిని రేకులవిప్పి త్రిప్పి జదువుటకును అనువుగా నున్నది. ప్రతి రేకునకును జుట్టును గోడగ జవ యున్నది.

### రాజముద్రిక

ఈ ముద్రిక శాసనపు రేకులను బంధించిన రాగికడియపు రెండుకొనలను అతికింపబడిన రాగి కడ్డిపైనున్న కర్ణికాగ్రమున ఉబ్బెత్తుగ పోతబోయ బడినది. ఆ కర్ణికవ్యాసము 8 సెం. మీ. దానికి చుట్టును జవ కలదు.

ఆ ముద్రిక మధ్యభాగమున కుడిమోమై నిలిచి యున్న వరాహలాంఛనమును, దానికి పైభాగమున సామ్రాజ్య చిహ్నములైన శ్వేతచ్ఛత్రము, దాని కిరు వైపుల రెండు చామరములు, వాటిపై ఎడమ వైపున చంద్రవంక. కుడివైపున చతుర్దళపుష్పము ఆ ప్రక్కను నెమిలి పింఛము. వరాహమునకు వెనుక వైపున శంఖము, మకరతోరణము, కనకదీపస్తంభము, ముఖమున కెదురుగ సామ్రాజ్య కనకదండము, కనక దీపస్తంభము, వరాహమునకు పై భాగమున అడ్డ ముగా బరుండబెట్టిన అంకుశము క్రింది భాగమున పీఠము (సింహాసనము), దానికి దిగువ 'శ్రీ త్రి.....' అను అక్షరశ్రేణి (మిగిలిన అక్షరములుగల భాగము

నశీశివేయబడినది) గలిగిన సంపూర్ణసామ్రాజ్య చిహ్నము లన్నియు ఉబ్బెత్తున పోతపోయబడినవి.

### శాసన భాష

శాసనభాషయంతయు సంస్కృతము. గద్య పద్యాత్మకము. అందు వివిధ ఛందములు, ఉపజాతులు గూడ వాడబడినవి. అయితే దానస్థలము, దాని ఎల్లలు సంపూర్ణముగా తెలుగునే వ్రాయబడినవి.

### శాసన లిపి

పదునొకండవ శతాబ్దపు సంధికాలపు లిపి. ఇది నాగను శాసనమని పంచాశద్వర్ణ నిర్ణయమునకు సరిపడునని తోచును. అంతకు ముందుగల చాళుక్య వేంగీ శాసన లిపికిని, ఆ తరువాతి 13-14 శతాబ్దముల కాకతీయ రెడ్డిరాజుల హళకన్నడ లిపికిని పూర్తిగా భేదించియున్నది. అక్షరములు గుండ్రకత్తున వరుస వ్రాయబడక ప్రతియక్షరమున్న వ్రటువగల ప్రతిచోటను త్రుంచి (ఆపి) తిరిగి మొదలుపెట్టుటచే సందులేర్పడి పుల్లల నతుకపెట్టినట్లున్నవి. దీనికితోడు చాలచోట్ల రంధ్రములు, గోతులు ఏర్పడి యుండుటచే చాలచోట్ల అక్షరములు గుర్తింప నలవిగాకున్నది. ఈ లిపియందు బాగుగా గమనింప దగిన యక్షరములు చాల గలవు. అ, ఇ, ఉ, త: థ, ద, ధ: చ, బ: వ: ఫ, ఘ: ట, డ, ద: య, మ: అక్షరములును: క్ష: ష: ౢ, ఙ, ౄ, ౄ, ఎ, ఏ, ద్విత్వ ములును వాటి సంయుక్తములును, వ్రటునుడియు మొదలగునవి.

ఇతర శాసనములందువలెనే దీనియందును పూర్ణబిందువుపైనను, 'ర'కార సంయుక్తమునకును, విసర్గసంధులందును తరువాతి యక్షరముల ద్విత్వము గావించుట గలదు. ఉ: అచ్చిక శబ్దములైన వేంగ్గి, మంగ్గి, చంద్దల మొదలైనవి: సాంస్కృతికములైన సంద్దన, మంద్దిర, కాంత్త: నిరంత్తరాదులు: నిర్వ్యా శేషభీమార్జ్జ్జా నాదులు: తతఃశ్శతాపీకః విష్ణ్యయ్యాన్య మొదలుగా గలవి.

ఈ శాసనపు మొదటి రేకు మొదటి పుట యందేఅక్షరములుగాని సాంకేతికములుగాని లేవు. మిగిలిన 17 లోను మొత్తము 200 పంక్తులు గలవు. ఆఖరున లేఖాచార్యుని పేరుమాత్రము గలదు.

### శాసన విషయములు

1. 1–23 పంక్తులు దాతవంశమునకు మూలపురుషులైన చంద్రవంశపు రాజులు (పురాణ పద్ధతి) 2. 24–31. కోసల విజయాదిత్యుని దక్షిణాపథ దండయాత్ర ఫలితము 3. 33–38 చాళుక్య విష్ణువర్ధనుని రాజ్యసంపాదన 4. 38–44 చాళుక్యవంశప్రశస్తి (మూర్తిక): 5. 45–88 చాళుక్య వంశ చరిత: 6. 89–107 జేత విజయాదిత్య వంశానుక్రమణిక. మూడవ విజయాదిత్యుని పట్టాభిషేక కాలము 7. 110–115 పట్టమహిషీ గుణ వర్ణన: 8. 115–134 విష్ణువర్ధనుని గుణ వర్ణన 9. 135–144 త్రిలోచన పల్లవుని దానము—శ్రీ విష్ణువర్ధనుని పునర్దత్త తామ్ర శాసనము. 10. 145–178 దాన ప్రతిగ్రహీతల నామధేయములు — గోత్రములు — భాగములు: 11. 178–193 దానస్థలము – దాని ఎల్లలు 12. దాన ఫలితములు 193–198. 13. పునర్దత్త కాలము 198–199: 14. లేఖాచార్యుని నామధేయము 200.

### శాసనానువాదము

1. 1-23 లక్ష్మీదేవికి భర్తయై సమస్త లోకములకు ప్రభువైన శ్రీ మహావిష్ణువు నాభి కమలమునుండి వేదనిధియైన బ్రహ్మయు, అతనికి మానస పుత్రుడైన అత్రియు, వానికి సకల జన నేత్రానందకరుడై, సముద్రునకు మిత్రుడై, వంశకరుడై, మహేశ్వరునకు శిరోభూషణుడైన చంద్రుడును: ఆ జగజ్జ్యోతికి బుద్ధిమంతుడైన బుధుడును, వానికి పురూరవ చక్రవర్తియు, (ఆ క్రమమున) ఆయువు, నహుషుడు, యయాతి, పూరుడు జన్మించిరి. ఆ పూరుడు తన తండ్రియైన యయాతికి సంభవించిన వార్ధక్యమును పితృభక్తితో స్వీకరించి, తన నిండు యౌవన మాతనికర్పించి యశోవిరాజితుడయ్యెను. అతనికి జనమేజయుడు, వానికి ప్రాచీశుడు (ఆ క్రమమున) సైన్యయాతి, దేశానకుడు, క్రోధానుడు, దేవకి, అజాకుడు, దృక్షకుడు, మతివరుడు, కాత్యాయనుడు,

నీలుడు, దుష్యంతుడు, భరతుడును జన్మించిరి. ఆ భరతుడు జాహ్నవీ యమునా సంగమమున నిరంతరము యూపస్తంభముల నిల్పి, మహాకర్మమగు భరతమను పేరుగల అశ్వమేధమును గావించెను. (ఆ తరువాత (క్రమముగ) భూమన్యుడు, సుహోత్రుడు, హస్తి, విరోచనుడు, అజామీఢుడు, సంవరణుడు, సుధన్వుడు, పరీక్షిత్, భీమసేనుడు, ప్రదీపనుడు, శంతనుడు, విచిత్రవీర్యుడు, పాండురాజు అనువారలు జన్మించిరి, ఆతనికి కుంతి, మాద్రియను వారలయందు సూర్య తేజస్సుగల యుధిష్ఠిర, భీమ, అర్జున, నకుల, సహదేవులను పుత్రులు కలిగిరి. అందు విష్ణువు (శ్రీకృష్ణుడు) ఎవ్వని ప్రాణమిత్రుడగుటకు అమరత్వమును వీడి సిగ్గు విడిచి మానవమాత్రుడై ప్రవర్తించెనో; పాశుపతాస్త్ర దాన సమయమున శివుడు ఎవ్వని ఆశ్లేషణమున మంగళప్రదుడయ్యెనో; ఎవ్వడు స్వర్గమున ఇంద్రునితో గూడ దివ్యసింహాసన మధిష్ఠించెనో, అతడే విశ్వవిఖ్యాతమైన చాపమును (గాండీవమును) ధరించి అర్జునుడను పేరున లోకైకవీరుడయ్యెను. అతనికి అభిమన్యుడు, వానికి పరీక్షిత్, వానికి జనమేజయుడు. (ఆ క్రమమున) క్షేమకుడు, నరవాహనుడు, శతానీకుడు, ఉదయనుడును జన్మించిరి.

2. 24-31 ఆ తరువాత ఆ వంశమున అయోధ్యా సింహాసనమున పరిపాలించిన రాజులు ఏబదితొమ్మండ్రు గతింపగా అఱువదవవాడైన (కోసం) విజయాదిత్యుడు దక్షిణాపథమును జయింపగోరి దాడివెడలి అందు త్రిలోచన పల్లవునిచే కీర్తిశేషుడయ్యెను. అప్పటికి ఆఱవమాసము గర్భవతియగు నాతని పట్టమహిషి ముదివేమ్రాగ్రహారముజేరగా ఆ గ్రామ నివాసియగు విష్ణుభట్ట సోమయాజి ఆమెను తన కూతువలె కాపాడెను. ఆమెకు విష్ణువర్ధనుడను కుమారుడు జన్మింప, తానే ఆతనికి మానవ్యసగోత్ర హారితిపుత్ర గోత్రక్రమోచితమైన కర్మల నిర్వర్తించెను.

3. 32-33 ఆతడు తన తల్లివలన సమస్త వృత్తాంతమును తెలిసికొని చలుక్య పర్వతముజేరి, (తన తపోబలమున) నందాదేవి, గౌరి, వినాయక, స్కంద, నారాయణ, మాతృగణముల సంతృప్తిబఱచి, (వారి ప్రసాదమున) శ్వేతాతపత్రము, శంఖము, పింఛము, కుంతము, సింహాసనము, మకరతోరణము, కనక దండము, గంగా యమునలు (శ్వేత, కృష్ణవర్ణ చామర ద్వయము), పాలికేతనము, పంచమహాశబ్దములు, వరాహ లాంఛనము మొదలగు కులక్రమాగతమైన సమస్త సామ్రాజ్య చిహ్నములబొంది; కదంబులు, గాంగులు మొదలగు (శత్రు)రాజుల గెల్చి; సేతునర్మదామధ్యస్థమైన ఏడులక్షల యేబదివేలు (గ్రామముల)గల రాజ్యమేలెను. ఆ విష్ణువర్ధనునకు పల్లవ వంశ సంజాతయగు పట్టపుదేవియందు విజయాదిత్యు డుద్భవించెను. అతనికి పులకేశియు, వానికి కీర్తివర్మయు జన్మించిరి.

4. 38-48 ఇతర చాళుక్య శాసనములం దుదాహృతమైన చాళుక్యవంశ సంకీర్తనాయుతమగు చూర్ణిక. ఆ వంశభూషణుడైన సత్యాశ్రయ వల్లభేంద్రునకు సోదరుడైన కుబ్జవిష్ణువర్ధనుడు పదునెనిమిదేండ్లు వేంగీదేశమును పరిపాలించెను.

5. 45 88. వాని కుమారుడు జయసింహుడు ముప్పదిమూడు సంవత్సరములు, వాని సోదరుడు ఇంద్రరాజు ఏడు దినములు, వాని కుమారుడు విష్ణువర్ధనుడు తొమ్మిది సంవత్సరములు, అతని పుత్రుడు జయసింహుడు పదమూడు వత్సరములు, అతని తనయుడు కొక్కిలి (విజయాదిత్యుడు) ఆఱు మాసములు రాజ్యమేలిరి. అతని పెద్దన్నగారైన విష్ణువరనుడు వానిని తఱుమగొట్టి ముప్పదేండ్లును, వాని కుమారుడు విజయాదిత్యుడు పదునెనిమిది సంవత్సరములు, అతని పుత్రుడు విష్ణువర్ధనుడు ముప్పదియాఱేండ్లును, వాని కుమారుడు నరేంద్రమృగరాట్ (విజయాదిత్యుడు) నూటయెనిమిది యుద్ధములుజేసి, వానికి సమాన సంఖ్యగల నూటయెనిమిది దేవాలయములను, శీరారామ (పాలకొలను) ఈశ్వరాలయముతోగూడ నిర్మించి నలుబదియెనిమిది యేండ్లు రాజ్యమేలెను. అతని కుమారుడు కలివిష్ణువర్ధనుడు సంవత్సరము ఆఱుమాసములు, అతని పుత్రుడు గుణగవిజయాదిత్యుడు త్రిభువనాంకుశుడను పేరుగలవాడై మార్గమధ్యమందు తన్నెదిర్చిన ధీరుడగు మంగిరాజు శిరమును ఖండించి కందుకక్రీడ గావించెను. చక్రకూట కిరణపురాదులగాల్చి కృష్ణునితో గూడిన సంకిలుని జయించి, భుజబలముచే (గాంగ

రాజగు) వల్లభుని అనుచరులతో గూడ సజీవగ్రాహము గావించి మహేంద్రునివలె నలుబదినాలుగు సంవత్సరములు రాజ్యమేలెను. (ఒడంబ రాష్ట్రాధిపతి మంగిరాజు. రాష్ట్రకూటాధిపతి ఇమ్మడి కృష్ణుడు. వానికి సహాయ మొనర్చినవాడు సంకిలుడు, (అహిల నిరుతాధిపతి). గాంగాధిపతి ధ్రువరాజు నిరుపమ కలివల్లభుడు. గుణగ విజయాదిత్యుడు పండురంగని సైన్యాధిపతిని గావించి వానిచే నెల్లూరు గాల్పించి, కందుకూరును బెజవాడ గావించి, చక్రకూటము, కిరణపురము, అచలపురము, అహాలనిర్భృతము దగ్ధముగావించుటచే అతనికి 'త్రిపుర మర్త్య మహేశ్వరుడు' అను బిరుదముకల్గెను.) అతని తమ్ముడైన యువరాజ విక్రమాదిత్యుని కుమారుడైన చాళుక్య భీముడు మున్నూట యఱువది (షష్ట్యుత్తరం త్రిశతం) యుద్ధముల శత్రువులను జయించి; తనపేర ప్రసిద్ధికెక్కిన చాళుక్య భీమేశ్వరదేవునకు దేవహర్మ్యమును నిర్మించెను. ఆ చాళుక్య భీముడు ముప్పది సంవత్సరములు రాజ్యమేలెను. అటుపిమ్మట కొల్లభిగండ నామాంకితుడైన విజయాదిత్యుడు హేమ తులాభారము గావించుకొని జయస్తంభము నెత్తించి ఆఱుమాసములు పరిపాలించెను. వారి పుత్రులు అమ్మరాజు, రాజభీములనువారలు. అందు పెద్దవాడైన అమ్మరాజు ఏడు సంవత్సరములు పాలించెను. అతని కుమారుడైన కంటి (కి)కబేత నామాంకితుడైన విజయాదిత్యుడను బాలుని తరిమివేసి, తాడపరాజు ఒక్క మాసమును, చాలుక్య భీముని తనయుడైన విక్రమాదిత్యుడు ఆ తాడపరాజును జయించి పదునొకండు మాసములును, ఆ తాడపరాజ కుమారుడైన యుద్ధమల్లుడు ఏడు సంవత్సరములును రాజ్యమేలిరి. అతనికి శత్రువును, అమ్మరాజునకు సోదరుడును, చంద్రునివంటి నిర్మలమైన కీర్తిగల రాజభీముడా యుద్ధమల్లుని పాఱద్రోలి వేంగిదేశమును పండ్రెండు సంవత్సరములు కాపాడెను. ఆ రాజభీమునకు దానార్ణవుడు, అమ్మరాజు, నృపకాముడు అను మువ్వురు పుత్రులు గలరు అందు దేవేంద్రునిమించిన వైభవము గలిగి, మానుషమాహేశ్వరుడను కీర్తిగాంచి సంజ్ఞాపూర్వకముగానే ఆజ్ఞల గావించు అమ్మరాజు ఇరువదియైదు సంవత్సరములును, అమ్మరాజునకు అన్నగారైన దానార్ణవుడు మూడేండ్లును రాజ్యమేలిరి. చతుష్షష్టి కళాసంపూర్ణుడును ప్రజ్ఞానిధియు, నిరుపమాన దానధురాయిష్ఠుడునగు దానార్ణవుని అనంతరము ఇరువది యేడేండ్లకాలము ఆంధ్రమండలమునేలగల రాజు లేడయ్యెను. ఆ తరువాత దానార్ణవునకు ఆర్యాదేవియందు జన్మించిన నిర్మలపూతుడగు శక్తివర్మ పండ్రెండు సంవత్సరములు రాజ్యమేలెను. వాని కుమారుడు విమలాదిత్యుడు మానవంతుడును, భూలోకమందారము, ద్రోహనాశకరుడు, బాహుబలుడునై యూ (వేంగి) మండలమును ఏడు సంవత్సరములు పాలించెను. వాని కుమారుడైన శ్రీరాజరాజ చంద్రవంశ శ్రేష్ఠుడును, సుప్రసిద్ధుడును, అర్థపాత్రప్రదాయ యుక్తుడును, యుద్ధమున శత్రునాశనమున స్థిరత్వముగలవాడునై నలువది సంవత్సరములు ఆంధ్రమండలమేలెను. వాని కుమారుడైన రాజేంద్రచోడుడు జయముచే సపూర్ణుడై పంచద్రావిడములతో గూడిన ఆంధ్రమండలమును ఏబది సంవత్సరములు పరిపాలించెను. అతని ప్రతాపాగ్నిచే దహింపబడిన అగ్నిజ్వాలలు హిమవత్పర్వతము నంటుటచే మానవులకు ఘోరశక్యముగాని ఆ హిమవంతము గూడ కరిగి నీరై ప్రవహించెను. అతనికి నృగ, భగీరథ, దుందుమార, రామ, అంబరీష, భరతుల కుద్దియగు పుత్రుడు, ఇంద్రునివంటివాడైన విక్రమ చోడుడు ప్రఖ్యాతికెక్కెను. అతడు త్యాగసముద్రుడను బిరుదుతో చోడమండల సంరక్షణమునకై (మాతామహార్జితము) వెళ్ళియుండుటచే వేంగిదేశమును పరిపాలించుటకు దగినరాజు లేడయ్యెను.

6. 89-110 అంతకుముందే (క్రీ. శ. 927 సం) తాడపరాజుచే తఱుమగొట్టబడిన అమ్మరాజ విష్ణువర్ధనుని కుమారుడగు కంటి (కి) కబేత విజయాదిత్యునకు ఇంద్రుని ఐరావతమును పరిహసించు కీర్తి వైభవము గలవాడును, దయాసముద్రుడును, 'ఉత్తమ చాలుక్యుడు' అను బిరుదుగలవాడును అగు సత్యాశ్రయుడుద్భవించెను. అతనికి గంగాన్వయ సంభూతయగు 'గౌరి' అను అగ్రమహిషియందు లావణ్యవంతులగు విజయాదిత్య, విమలాదిత్య, విక్రమాదిత్య, శ్రీవిష్ణువర్ధన, మల్లపదేవ, నృపకామ, రాజమార్తాండులను ఏడుగురు పుత్రులు గలిగిరి. అందు విజయాదిత్యునకు సూర్యాన్వయ సంజాతయగు విజయామహాదేవివలన విష్ణువర్ధన భూపతియు, సోమదేవుడును బుట్టిరి. వారిలో పండిత పోషకుడును,

కులశ్రేష్ఠులైన మనుజేంద్రులకు లక్ష్యభూతుడును, అన్యక పరాక్రమముచే భువిలోని రాజులకు మేటియును యుద్ధవీరుడును అగు మల్లపదేవుడు పేరుకెక్కెను. అతడు సాగరవిషయాధిపతియు, హైహయవంశతిలకుడు నగు బ్రహ్మమహారాజ కుమార్తెయైన చందలదేవిని పరిణయమయ్యెను. ఆమె లీలావతివంటి నేర్పరియు, కళావతివంటి శుభ్రవదురాలును, ఉత్తమ సంజాతయు, పతివ్రతయు, ధైర్యవంతురాలును, మిక్కిలి సచ్చరిత్రయు, లక్షణవంతురాలును అయి నిత్యనూతనత్వముల వెదజల్లుచు ప్రసిద్ధురాలయ్యెను. ఆ చందలదేవివలన మహేశ్వరుని వరప్రసాదముచే మల్లపదేవునకు విజయాదిత్యు డుద్భవించెను. అతడు దిలీపుడు, అనఘుడగు రఘుమహారాజువంటివాడును, భీమునివంటి సాహసవంతుడు, విజయాభివంద్యుడు, ధర్మప్రమాతిగల యన్య కులజుల సహితము ప్రేమతో గాపాడువాడును, వంశవర్ధనుడు, యుధిష్ఠిరునివంటివాడు, సత్యవాక్ప్రవీణుడును. ఆ రాజన్యుడు శా. శ. 1049 సం॥న (విధి జలధి వియచ్చంద్రగే) మాఘ శు 10 స్థిరవారము రోహిణీ నక్షత్రయుక్త మీనలగ్నమున పట్టాభిషిక్తుడై సమస్త గుణగణములచే నిండినవాడై, విశాలమైన రాజ్యమును జనాభీష్ట ప్రదముగ గీర్తివంతుడై పోషించెను.

7. 111–117 అతనికి అగమహిషి లక్ష్మీదేవి. ఆమె సాటిలేని మహిమలచే లక్ష్మీదేవియు, చదువుల సరస్వతియు, హైమవతివంటి ఐశ్వర్యవంతురాలు, సీతవంటి శీలవతి, రతిదేవివంటి సౌభాగ్యవంతురాలు, భోగ భాగ్య విలాసములచే శచీదేవి వంటిది. హిమవంతుడు గౌరీదేవిని తనయగా బడసినట్టులనే మార్జవాడి పులకేసి ఆ లక్ష్మీదేవిని ప్రియపుత్రికగా బడసెను. ఆ విజయాదిత్యు డా లక్ష్మీదేవియందు విష్ణ్వంశ సంభూతుడైన విష్ణువర్ధన భూపతిని బొందెను. అతని మనసును శంకరుడు అపరకైలాసమువలె భావించి అందే నివసించెను. (అతడు మహేశ్వర భక్తుడయ్యెను).

8. 117–134 ఎవ్వడు చంద్రహాసమును చేపట్టుటచే ప్రళయకాల భైరవుడుగను, విఖ్యాతిచే మేరుపర్వతముగను, కులమువారిలో ఐశ్వర్య సంపన్నుడుగను, ఓర్పునందు భూదేవిగాను, శోభావంతమైన మనస్సుగలవాడుగాను, మాటిమాటికి మిత్రవర్గమును పోషించువాడును, నానావిధ రత్నములచే నలంకరింపబడిన కటక కేయూరాది భూషణములు గలవాడును, దివ్యపూరుషుడును, సమస్త దేవతలు, దేవసంబంధులు, ఋషుల సహావేశములచే సంతోషము గల్గించువాడును, అభ్యుదయము కొఱకు అనుభవశీయులైన వారి దౌత్య కృత్యములవలన ఎల్లర సంతోషింపజేయువాడును, అధికమైన శస్త్రకుశలుడగుటచే దొలుదొలుతనే వ్యాపింపబడిన కీర్తిచంద్రికలు గలవాడును, అపర ఇంద్రునివంటివాడునై చాళుక్య వంశోత్తముడను ప్రసిద్ధికెక్కెను. సత్యవాక్కు, బుద్ధినైపుణ్యము, విద్యాగౌరవము, దానకీర్తి, గుణమయ స్వరూపము, కృపాకటాక్షవీక్షణము, శౌర్యవంతమైన శక్తి, పాలితసోత్రముల బడయువాడు, చాళుక్య వంశాభరణుడు, మనః కమలమునకు శ్రీహరియైనవాడును ఎవ్వడో ఆ విష్ణువర్ధనుడు: ఇంద్ర, అగ్ని, యమ, నిరృతి, వరుణ, వాయు, కుబేర, ఈశానుల దగు అష్టదిక్పాలమూర్తియో అట్టి ప్రత్యక్ష ప్రభువగు: సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజాధిరాజ, రాజరాజపరమేశ్వర, పరమభట్టారక, పరమబ్రహ్మణ్య, పరమమాహేశ్వర, శ్రీ విష్ణువర్ధన దేవుడు: గుద్దవాడి విషయనివాసులగు రాష్ట్రకూట కుటుంబశ్రేష్ఠులను బిలిపించి శ్రీమజ్జననాథపరమునందు మంత్రి, పురోహిత, సేనాపతి, యువరాజ, దౌవారిక సమక్షమున (నిండుకొల్వు కూటమున) ఇట్లు ఆజ్ఞాపించెను:

9. 135–144 శోభాయుక్తఫాల భాగమున, మూడవ కంటివి తిలకము శ్రేష్ఠముగా ధరించినవాడును (త్రిలోచనపల్లవుడు); భూమండలము నంతటను తన యశశ్చంద్రికల వెదజల్లువాడును, సమస్త భూపాలురయందును అతిశయించిన గాంభీర్యముగలవాడును, రాజలోకమున దానధర్మములచే కర్ణునివంటి విఖ్యాతిగలవాడును అయిన ముక్కంటి కాడ్వెట్టియను (పల్లవ)రాజుచే, గుద్దవాడి విషయమున భీమేశ్వర విమానమునకు (దేవాలయ గోపురము) తూర్పుదిక్కునందు 'ఎడఋవల్లి' అను పేరుగల పుణ్యక్షేత్రమగు గ్రామమును సూర్యగ్రహణ నిమిత్తము: సమస్త వేద వేదాంగ విద్వాంసులకును; సమస్త వ్యాకరణ, న్యాయ, వైశేషిక, వేదాంత,

మీమాంసేతిహాసముల బహార్థ ప్రజ్ఞగలవారికిని; సకల ఆగమ, ధర్మశాస్త్రపరిజ్ఞాన నిపుణులకును, గార్హస్థులైన ద్విజోత్తములకును సమస్తమైన పన్నులును తీసివేసి అగ్రహారముగా నీయబడినది. ఆ తామ్రశాసనము కాలవశమున నశించుటచే తిరిగి కోరిన ఆ బ్రాహ్మణులకు ధారాపూర్వకముగ తిరిగి యివ్వబడిన తామ్రశాసన మిది తెలియజేయబడినది. వారి గోత్రములు, నామధేయములును తెలియబడజేయుచున్నవి.

10. 145–174 దానప్రతిగ్రహీత పేర్లు, గోత్రములు వారివారికీయబడిన భాగములును; 174–178 దేవభాగమైన ఆరామక్షేత్రమునందు అర్థభాగము దుర్గాదేవికిని, ఏకఖండముగా కేదారక్షేత్రమును: ఇద్దరు వేశ్యలకును, రైతుకుటుంబములకును, తెలుకులి, సాక, తములపాకు తోటమాలులకు, కుమ్మరి, అగసాలి (కంసాలి) కమ్మరి, కంచరి, మంగలి, చాకలి, ఛండాల (చర్మకారకులు), మేదరులకును, ఆయాపనుల నేర్పులైనవారికి పన్నులు లేకుండ నివ్వబడినది.

11. 178–193 దానస్థలము—దాని ఎల్లలు తూర్పు—ఉండూరు; దక్షిణము—కిసప్రోలు; పడమర—ద్రాక్షారామము; ఉత్తరము—తాన్డిపల్లి మధ్యస్థమైన (ఎడఉపల్లి) అగ్రహారము ఎల్లలు: తూర్పు: 'ఉండూరి-ఎడఉపల్లి నడిమి తొండులావ (బాడవ). ఇందుండి దక్షిణదిశగాపోయి తూర్పున నదియొడ్డు అగి, సరిహద్దు గట్టుపైగా 'గొల్లగుంట'జేరి దక్షిణదిశగాబోయి ఆగ్నేయమున అంద్రంగి, ఎడఉపల్లి, పెనుమళ్ళ (ముయ్యారు కుర్చేన ఆవ) మూడూళ్ళకు సంబంధించిన బాడవ; ఇందుండి పడమరగా బోయి వట్రపూడి చెఱువునకు ఉత్తరమున అడ్డబడి దక్షిణదిశగా (కట్టుంబీదల గరువు) మిక్కిలి సారహీనమైన గరువుపీడుగాబోయిన దక్షిణమున కిసప్రోలుకు—ఎడఉపల్లికి నడుమ వస్తగోదావరినది. ఇందుండి పన్ననునాయకునితోట కుత్తరమున నది ప్రక్కగా బోయిన నైరృతిని పొట్టనహంగుతోట తూర్పున నది. ఇందుండిపోగా దండసాణితోట తూర్పున ఎగువగట్టునుండి ఉత్తరదిశగాబోగా పడమర దక్షారామమునకు—ఎడఉపల్లికి నడుమ హిమవంతేశ్వరుని ఆలయమునకు తూర్పుగట్టు. ఇందుండి ఉత్తరదిశగాబోయి చెఱువునడిమిగాబోయిన వాయవ్యమున వెల్ల, ఎడఉపల్లి, తాండిపల్లి (ముయ్యేవి కుట్రున ఆవ) మూడూళ్ళకు సంబంధించిన బాడవ. ఇందుండిపోగా ఉత్తరమున దూటూరిపొలమునందలి ఎడఉపల్లి ఆవ; ఈశాన్యమున ఎంకలపర్తి—ఎడఉపల్లి నడిమి ఆవ.

12. 193 – 198 దానపాలితఫలములు. వ్యాసకృత గద్య పద్యాత్మములు. శాసన సర్వసామాన్యములే.

13. పునర్దత్త తామ్రశాసనకాలము. 198–199 : శా. శ. 1101 (చంద్రవ్యోమరుద్రాఖ్యగోభువః) క్రీ. శ. 1179. తిరిగి నిమ్మవర్ధనభూపతిచే తిరిగి యివ్వబడిన తామ్రశాసనము:—

14. 200 లేఖకుడు ప్రోలాచార్యుడు.

## గమనింపదగిన శాసన విషయములు

(1) 1–24. చాలుక్య వంశస్థులకు పూర్వులైన పురాణవంశము విమలాదిత్యుని కాలమునుండియు చాళుక్య శాసనముల నుదాహరింపబడిన సర్వసామాన్యమే. అందు 12–13. భరతుడు : 'జాహ్నవీ యమునా తీరే। కృత్వా యూపాన్నిరంతరాన్। యో మహా కర్మాణా భరత। నామ్నాశ్వమేధ కృతే॥' జాహ్నవీ యమునా సంగమమున నిరంతరము యూపస్తంభముల నిలిపి మహాకర్మయగు భరతమను పేరుగల అశ్వమేధమును జేసెను. అని సార్థకత్వము నిరూపించుట. (ఈతని పేరునచే భరతఖండమని మనదేశమునకు బేరుగలిగినదని పౌరాణికులు బల్కెదరు.) ఇందుకు ప్రమాణముగ:— అథా నిది ష్వహస్తాన స్సురభి యఝ్యాన కర్మణి। బ్రహ్మౌదనాగ్ని 'భ్భరతో' యని ష స్సహనా హుతా' వైజయంతి నిఘంటువు 11. పే. 52 శ్లో. 'భరత' M. Fire in which the Brahmoudana is boiled. 665 పే.

(2) 23–27 'తతః క్షేమకః, తతో వర వాహనః, తతః శ్శతానీకః, తస్మా దుదయనః;

స్తద్వంశ్యే స్వయోధ్యా సింహాసనాసీనేష్వేకోన షష్టి భూపాలేషు గతేషు తదన్వయే విజయాదిత్యో నామ రాజా విజిగీషు తతః దక్షిణాపథం గత్వా త్రిలోచన పల్లవ మధిక్షిప్య కీర్తిశేష మగమత్॥' అని యుదాహరింపబడెను. అయితే యుధిష్ఠిరుని మొదలు యక్షపాలుని వరకునుగల 124 రాజులు (ఎడతెగిపిలేకుండ) 4044 సం. 7 మా 12 దీ. ఇంద్రప్రస్థమును పరిపాలించినటుల చారిత్రకుల బరిశోధనల వలన దెలియుచున్నది. అందు యుధిష్ఠిరుడు 30–8–25 రాజ్యమేలుటచే మిగిలిన 4013–10–27 యుధిష్ఠిరుని యనంతరము ఆ వంశము వారు పరిపాలించిరి. పాండవుల స్వర్గారోహణయే అనగా శ్రీకృష్ణ నిర్యాణమే కలి ప్రవేశమని వక్కాణించియున్నారు. అట్టి కలి నేడు 5068 వ సంవత్సరము. అందుండి యుధిష్ఠిరవంశపాలనము దీసివేయగా 1054 సం. క్రీతము వరకును అనగా క్రీ. శ. 1967–1054=913 వఱకును ఆ పాండవవంశజాలు ఇంద్రప్రస్థమును పరిపాలించినటుల : రూఢియగుచున్నది. అయోధ్య (కోసల) నేలినవారు సూర్యవంశజులు. కోసల విజయాదిత్యుని నిర్జించినవాడు త్రిలోచన పల్లవుడు. అతడు 4 వ శతాబ్దమువాడని చారిత్రకులు నిర్ణయించియున్నారు. అప్పటికే అయోధ్యా సింహాసనమున ఏబదితొమ్మండ్రుః రాజులు గతింపనీ కోసల విజయాదిత్యుడు అఱువదియవవాడని చాలుక్య శాసనములు చాటుచున్నవి. అనగా తరమునకు సర్వసామాన్య ప్రమాణమైన ముప్పది సంవత్సరములుగా నెంచిన 60 × 30=1800 సం॥ లాగలదు. కాగా అయోధ్యా పరిపాలన 1800 లోను, క్రీ. శ. 400 పోగా క్రీ. పూ. 1400 నాటికే ఈ చంద్రవంశపు రాజులు (పాండవ సంతతి) అయోధ్యాసింహాసనాధిష్ఠులు కావలెను. అందువలన క్రీ. పూ 1400 + క్రీ. శ 913=2313 సం॥ కాలము ఈ చంద్రవంశపురాజ శ్రీ చాళుక్యశాసనముల ననుసరించి అయోధ్యా సింహాసనాధిష్ఠులా లేక పూర్వ చారిత్రపరిశోధకుల ననుసరించి ఇంద్రప్రస్థమునే పరిపాలించిరా లేక ఆ సుదీర్ఘకాలమంతయు ఆ రెండు సింహాసనముల నీ యుధిష్ఠిరానువంశజులే పరిపాలించిరా? అట్లయిన ఏ సూర్యవంశపురాజును ఏ చంద్రవంశపురాజ ఎట్లు ఎందుచేత యోడించి అయోధ్యా సింహాసన మాక్రమించెనో చారిత్రకులు పరిశోధించిన గాని అయోధ్యాసింహాసనాధిపత్య మంగీకరింప వీలు గాకున్నది. అంతేగాక అయోధ్యగలది ఉత్తరకోసల. ఆంధ్రప్రదేశపు సరిహద్దునగలది మహాకోసల. పై విషయము నిర్ధారణగాకున్న యీ అయోధ్యాసింహాసనాధిపత్యము విమలాదిత్యునివఱకుగల పూర్వచాలుక్య శాసనముల గావ్పింపకుండుటచే నిది కల్పితమని సందేహము కలుగుచున్నది. అట్లయిన 'ఏకోనషష్ఠి భూపాలేషు గతేషు' ఏబదితొమ్మండ్రు రాజులు గతింపగా ఆ అఱువదవవా డీకోసలవిజయాదిత్యుడని చెప్పవలగును. కావున కేవలము బూటక మనరాదు. ఆ కోసలదేశ ముత్తరకోసలగాక మహాకోసలయను భ్రమ కలుగుచున్నది. అందుకు తోడు ఉత్తరకోసలనుండి ఆంధ్ర మండలమువఱకు దాడి వెడలుటన్న సర్వసామాన్య విషయము గాజాలదు. మధ్యమార్గమునగల జైత్రయాత్రలును వర్ణింపబడలేదు. కావున ఈ శాసనమందలి 'అయోధ్యా' సింహాసనేషు అను పదమును గుర్తింపకున్నచో నీ విజయాదిత్యుడును 'చలుక్య' పర్వతప్రాంత మందలి మహాకోసలరాజులై యుందురు. జాగత్తగా చారిత్రకులు మహాకోసలరాజుల చరిత్రల బరిశోధించిన (నామరూపములులేవి) ఆ యేబది తొమ్మండ్రు రాజులలో ఏ కొందరినైనను చరిత్రలు దొరికి సత్యము వెల్లడి కాగలదని విశ్వసించుచున్నాను:–

From the old collection of Mr. Anka-Raju SubbaRaya Sarma. 1930—1938.

List of the Aryan Kings of Arya-vartha which includes all the Rulers from the Emperor 'Yudistira' to the Emperor 'Yashapala.' The History of the Aryan Emperors of India from Swayambhuva 'To'yudhistira' is given in such books as 'Mahabharatha.' The readers will get an idea of the History of the Arya Rulers from 'Yudhistira' downwards. This is a tradition of what appeared in the fort-nightly, Called 'Harischandra' and 'Mohan.

chandrika' issued from Mathudwara at Chittore, the Capital of Udayapur State in Rajaputana. It will indeed greatly benifit the Country if the Aryan people (ie natives of India) will make a continued search for books on ancient History (of India) and other branches of Knowledge and publish them. The Editor of the said fortnightly got a book in manuscript written in 1782 Vikrama (1725 A. D.) from a friend of his and published a breif summary of the Aryan Emperors in issues of his Journals No. 19 & 20 in the year 1939 Vikrama (or 1882. A. D.) which is given bellow:—

Geneology of the Aryan Emperors of Aryavartha. The Aryas ruled in Indraprastha (Modern Delhi) from the time of the Emperor 'Yudhistira' down to that of the rulers is about 124. The period covered by their rule is 4044 years 7 months and 12 days. Its detil is as follows:—

About 30 Emperors belonging to the house of Yudhistira ruled in Indraprasta collectively for 1764 years 10 Months 10 days. Its detail is as follows:—

| | |
|---|---|
| 1. Yudhistira | 30- 8-25 |
| 2. Pareishit | 60- 0- 0 |
| 3. Janamelaya | 84- 7-23 |
| 4. Aswamedha | 82- 8-22 |
| 5. RamaRaja ii | 88- 8-22 |
| 6. Chatra Malla | 81-11-27 |
| 7. Chithraradha | 75- 3 18 |
| 8. Dustasalya | 75 10-24 |
| 9. Ugra Sena | 78- 7-21 |
| 10. Sura Sena | 78- 7-21 |
| 11. Bhuvana Pathi | 69- 5- 5 |
| 12. Ranajit | 65-10- 4 |
| 13. Rikshaka | 64- 7- 4 |
| 14. Sukhadeva | 62- 0-24 |
| 15. Narideva | 51-10- 2 |
| 16. Suchi Radha | 42-11- 2 |
| 17. Sura Sena ii | 58-10- 8 |
| 18. Parvatha Sena | 55- 8-10 |
| 19. Medhavi | 52-10-10 |
| 20. Sonocheera | 50- 8-21 |
| 21. Bheemadeva | 47- 9-20 |
| 22. Nruharideva | 45-11-23 |
| 23. Purnamala | 44- 8- 7 |
| 24. Karadani | 44-10- 8 |
| 25. Alammika | 50-11- 8 |
| 26. Udayapala | 38- 8- 0 |
| 27. Duvanamala | 40-10-26 |
| 28. Damatha | 32- 0- 0 |
| 29. Bheemapala | 58- 5- 8 |
| 30. Kshemaka | 48-11- 0 |

Total ruling of 30 rulers is as 1764 years 10 months and 10 days. The Prime minister 'Vishrava' killed his Emperor 'Kshemaka' and began to rule himself in his place. Fourteen Emperors belonged to his house who ruled collectively in Indraprastha for 500 years 3 months and 17 days thus:—

3. 52-55 'తత్తనయః నరేంద్రో యుద్ధోద్యం సమరశత మష్టోత్తర మతో రణస్యాన్తే తావత్పరిగణనయా దేవనిలయాన్ తదా క్షీరారామరా ట్పహినిధాయ క్షితి మహేద్భులా చ్చత్వారింశాబ్ధ్వర... రష్ట సహితాః' అని యున్నది. చారిత్రకులందరును నరేంద్ర మృగరాజు శత్రువులను 108 యుద్ధముల నిర్జించి తద్దోష పరిహారార్థమై 108 శివాలయముల (ఒక్కచోటనే అనికొందరు, ఆయా యుద్ధరంగములుగల తావులనవి మఱికొందరు) నిర్మించెనని యేకగ్రీవముగానే వెల్లడించియున్నారు. అయితే ఈ శాసనమున 'తదా క్షీరారామరాట్పహ నిధాయ' అని యుండుటచే క్షీరారామ (పాలకొలను) ఈశ్వరాలయమును కూడ యితడే నిర్మించి యున్నటుల జాటుచున్నది. ఈతడు క్రీ. శ. 799 మొదలు 847 వరకు రాజ్యమేలెను. ప్రారంభమున యుద్ధములతో సరిపోయెను కావున సుమారు క్రీ. శ. 810 ప్రాంతమున 108 శివాలయములను దానితో క్షీరారామ(పాలకొలను) ఈశ్వరాలయము నాతడు కట్టించి యుండవలెను. అదైనను ఆలయమును ప్రత్యేకించి యుదాహరించుటచే నంతకు పూర్వమే (పంచారామములలో నొకటై పేరు ప్రఖ్యాతుల గడించిన ఆలయము) పునరుద్ధరించి యుండనోపు.

4. (60–63) 'తద్భ్రాతుర్విక్రమాదిత్యస్య తనయ శ్చాలుక్యభీమః షష్ట్యుత్తరం యుప్తం శతం రణానాం జిత్వా స్వనామ్నా ప్రథితం విధాయ చాలుక్య భీమేశ్వర దేవహర్మ్యం త్రింశత్సమా ధరాతల మరక్షత్'. చాలుక్య భీముడు మున్నూట యఱువది యుద్ధముల శత్రువుల నిర్జించి తన పేరిట ప్రసిద్ధి కెక్కిన చాలుక్యభీమేశ్వరునకు దేవహర్మ్యమును ఏర్పఱించెను. అయితే చాలుక్య వంశమున భీములు ముగ్గురు గలరు. అం దిరువురు మాత్రమే చారిత్రక ప్రసిద్ధి గన్నవారు. మొదటి భీముడు క్రీ. శ. 888–918 వరకును, రెండవ (మూడవ) రాజభీముడు 934–935 వరకును రాజ్యమేలిరి. ఈ యిర్వురును రాజ్యారంభకాలమున దాయాదులతోను, శత్రురాజులతోను, రాజద్రోహులతోను పెక్కుయుద్ధము లజేసి శౌర్య, ధైర్య, సాహస వీరకృత్యములచే పైతృక రాజ్యమును నిలుపుకొన్న వారలే. అయితే చాలుక్య భీమవరమును (రెండవ) రాజభీముడు గట్టించినటుల ఆం. దే. క. సం. 284 పే. చాటుచున్నది. అయితే శ్రీ మారేమండ రామారావుగారును శ్రీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారలు తెలుగు విజ్ఞాన సర్వస్వము 3. భా. 155 పే. అందును మొదటి చాలుక్య భీముడు దక్షారామమున (విభవ) భీమేశ్వరాలయమును, సామర్లకోటయందు (కుమార) చాలుక్యభీమేశ్వరాలయమును గటించి యున్నటుల వెలువరించి యున్నారు. చామర్లకోటకైఫియత్ నందు 'చాలుక్య భీమరాజు (మొదటి, రెండవ వివరము లేదు) కుమారభీమేశ్వరునియందు మహాభక్తి తాత్పర్యముచేతను సమస్తభోగములు నడిపిస్తూ యుండెను. మఱిన్ని భీమేశ్వరస్థలమందున్ను ద్రాక్షారామస్థలమందున్ను యేనూరేసి శిలాస్తంభాలతో మండపములు కట్టించినాడు. కుమారస్థలమందు కట్టించిన పట్నము చాలుక్యభీమనగరమువే పేరు గలిగి యుండెను. (అదియే యిప్పటి చామర్లకోట భీమవరము) ఆ పట్నంలో భీమమహారాజు మహళ్లు కట్టించివుండిరి. (చామర్లకోటకైఫియత్. పే. 1, 2) అని యున్నది.

రెండవ చాలుక్య భీమవిష్ణువర్ధనుడు గోదావరి మండలములోని సామర్లకోటకు జేరియుండిన భీమవర విహాతని పేరటనే గట్టబడినందున జాళుక్య భీమవర మని శాసనములందు బేర్కొనబడినది. ఆ. దే. క. సం. 284. పే.

A. H. R. S. Vol. xxiv. (1956–58) P. 105–106. The Bhimeswara Temple of Draksharama, by Dr. M. RamaRao M. A. Ph. D.

2. An illustrious monarch, named Chalukya Bhima, of the Eastren Chalukyan dynasty, ruled over the 'Vengi' Kingdom for thirty years between 892-912 A. D. This King had an eventful and stormy career. He succeeded his uncle Gunaga–Vijayadithya, who died Childless. Those were stormy days. And the Eastern Chalukyas were involved in a deadly struggle with the Rastrakutas of the Deccan Plateau. As soon as Gunaga–Vijayadithya died, the Rastrakutas invaded Vengi. The Kinsmen of the dead King colluded with the enemy. The invaders occupied the ManciKondanadu, extending from Kondapalli near Bezwada to Korivi, in the warangal district. Chalukya Bhima, the heir to the throne of Vengi, opposed the enemy but was defeated and captured. Meanwhile Kusumayudha the local ruler, who was a Vassal of the Chalukyas, inflicted Crushing defeats on the Rastrakutas and drove them out of his fief. King chalukya Bhima escaped during this confusion and gathering forces suppressed all the treacherous Kinsman. He then cornated himself in 882 A. D. Very soon, however, he had to encounter fresh troubles. The Rastrakuta King, Krishna ii sent a strong army under an able general, named Gundaya, against Vengi. This army almost reached the Capital and threatened it. As usual, the traitors within joined them. Bhima offered stiff resistance. Two pitched battles were fought at Niravadyapura and Peruvanguru. Bhima's son, Irimartiganda, a young lad, attac–

ked the enemy and defeated them in the battle of Niravadyapura and killed their general gundaya in the battle of Peruvanguru. He too lost his life in this battle. There was peace in the Vengi Kingdom after these two battles. Bhima then turned his attention to peaceful pursuits. He patronised callava, a famous musician and Bhatta Vamana, a great scholar and author of the Kavyalamkara sutras. He was also a great builder. Following the tradition of his illustrious ancestors, Narendra – mrgaraja–Vijayadithya and Gunaga—Vijayadithya, he took to temple building. It is said that he built numerous shrines for Siva and named the deity set up in them after himself. The Bhimeswara temple of Draksharama, Chalukya Bhima-Varam and Chebroulu are three fine examples of temples built by this great monarch.

Sunday Standard. September 17: 1967. Page 11.

Four Eastren Chalukya shrines in Andhra.

By Agamapriya.

..........................

The Peak of architectural achivement in the structural stone medium was reached in Andhra Country in the early Eastern Chalukyan Period, approximately from. C. 800 A. D. to 950 A. D. The productions were marked by a lively integration of many trends, Visual and Conceptual We shall considear a compact group of almost similar temple forms, constituting an archetype, as it were, of their age and region, and introducing a well informed harmonisation of architecture and the Deity enshrined in the Sanctum. These are the Bhimeswara temple at Chebrolu the Amareswara temple at Amaravathi, and the Bhimeswara temples at Draksharama and Bhimavaram. Almost all these, together with a fifth at Palakollu, are the creations of Bhima Eastern Chalukya (897– 921 A. D.) the illstrious Gunaga Vijayadithya iii(854-897), the patron of the string of Shrines at Biccavolu, Sangameswaram etc.

The temples are selected for two reasons. Firstly, they introduce for the first time in this region, to be copied elsewhere in the Tamil Country later, the double-storeyed conception of the deity in the cella and secondly they represent the 'Sarvato-Bhadra' type of the four door cella, facing all the four cardinal directions through four door-frames and occupying the centre of the temple unit, in fact, this type has now longitudinal strike for the temple axis, but is a square block within the Shirne occupies the very Centre or heart of the Structure.

The Linga shaft, thus, is two storeys high, and worship is generally conducted at the first floor level as a routine, while the ground floor root of Linga receives only a periodical visit and offerings of flowers etc.

The idea in making the linga so tall and slender, piercing, as it were, the twin storeys of the temple unit proper would seem to be an essentially symbolic phenomenon, representing the pristine pillar form of Siva in the 'LINGODpHAVA' myth, whithout root and without end, and thus the very 'Vimana' carries the divine immanence of this Sthanu or Skambha element of Siva and serves also as the veritable 'Mana-danda' or measuring rod alike of the superiority of the conception of this kind of Linga form, as for the excellent sqare 'Sarvathobhadra' and tall stature of the entire temple up to its 'Sikhara' as built by Chalukya-Bhima.

The invation, thus is fully in keeping with the extant puranic lore, but has introduced a spectacular, visual effect and the centralisation of the cella linga shaft of more than 20 feet hight would have been and would even now continue to be, a challenging assignment and had been executed with professional perfection by Bhima's artisans at Draksharama, Bhimavaram and Amaravathi.

ఈ పై విషయముల గమనింపగా (పామర్లకోట) భీమేశ్వర దేవునకును, దక్షారామ (విభవ) భీమేశ్వర దేవునకును గూడ మొదటి చాళుక్య భీముడే క్రీ. శ. 900 ప్రాంతమున దేవహర్మ్యములను (అంతిస్థలను) కట్టించినట్లును అతడే పామర్లకోట భీమవరనగరమును కోటతో సహితము కట్టించినట్లు స్పష్టము.

(5) 88–89. 'తస్మిం త్యాగశ్రీ సముద్రావర నామ్నాని చోడమండలం త్రాతుం గతవతా వేంగీ భూమిన్నాయక–రహితే తదంతరే' అనుటచే త్యాగ సముద్రుడను బిరుదుగల విక్రమచోడుడు చోడమండలము పరిపాలించుటకై పోగా వేంగీ మండలమును పరిపాలించు రాజు లేడయ్యెను అని విశదము.

6. 108–111 'శాకాబ్దే విధి జలధి వియచ్చంద్రగే మాఘమాసే శుక్లపక్షే దశమ్యామి నతనయదినే రోహిణీ తారకాయాం। సింహే లగ్నేభిషిక్తో నిఖిల గుణ గణ వ్యాపితాలో విశాలో రక్షావల్లీం జనానా మభిమత ఫలదాం కీర్తిగా పుష్య మపుష్యత్' అనుటచే శా. శ. 1049 (క్రీ. శ. 1128) మాఘ శు 10 స్థిరవారము రోహిణీ నక్షత్రయుక్త సింహలగ్నమున మూడవ విజయాదిత్యుడు (వేంగీ రాజ్యమునకు) పట్టాభిషిక్తుడైనట్లు తెల్లమగుచున్నది.

(7) 132–134. 'శ్రీ విష్ణువర్ధనాదేవో గుడ్డవాడి విషయ నివాసినో రాష్ట్రకూట ప్రముఖ కుటుంబినస్సమాహూయ శ్రీ మజ్జననాథవరో మంత్రి పురోహిత సేనాపతి యువరాజ దౌవారిక సమక్షమిద్ధ మాజ్ఞాపయతి' అనుటచే శ్రీ విష్ణువర్ధన మహారాజా గుడ్డవాడి విషయమందలి రాష్ట్రకూట ప్రముఖ కుటుంబినులను (స్థానికోద్యోగులు) రావించి మంత్రి, పురోహిత, సేనాపతి, దౌవారిక, యువరాజ సమక్షమున (నిండు కొల్వుకూటమున) ఈ విధముగ ఆజ్ఞాపింపడమైనది. అని తెలియుచున్నది.

ఇందు ప్రస్తుతము 5 విషయముల వెనుక బెట్టి ముందుగా 6, 7 విషయముల చర్చింపవలసి యున్నది. 5 వ విషయమున శ్రీ మూడవ విజయాదిత్యుని పట్టాభిషేక కాలమును శా. శ. 1049 కాగా పూర్వ చారిత్రకులు శా. శ. 1079 అని పొఱబడినట్లు గాన్పించుచున్నది. అందువలన పూర్తిగా 30 సం. (1 తరము) కాలము దాటిపోయినది. ఇందు జలధి అనగా సంఖ్యా నిరూపణమునందు (పరకంకీరవము) నాలుగుకు:— 'చతుర్ణాంవేద బంధ్వంబు కృతాబ్ధి గతవేదా యుగాః' అనియు, ఏడునకు:— 'సప్తసంజ్ఞా తురంగాద్రి ముని స్వర భయాస్మృతాః' అనియు నిర్వచించియుండుటచే అబ్ధి, అంబుధి, జలధి సమానము లగుటచేతను సప్తమసంఖ్యానిర్వచనమందు అంబుధి పర్యాయపదము లేకుండుటచేతను ఈ శాసనమున 'విధి జలధి వియచ్చంద్రగే' అన 1049 యే గాని 1079 కాదు. అట్లు ఈ సంఖ్యా నిరూపణమున (30 సం. కాలము) పొరబాటు సంభవించుటచేతనే ఈ వంశమువారి పాలనా విషయ పరిశోధనయందు చారిత్రకులకు పెక్కుసందేహములు వాటిల్లి విడరాని చిక్కులు దెచ్చిపెట్టినది. అందుకు తార్కాణముగ ఆం. దే. క. సం. 339 పే. '........ ఈ శాసనమునందు బేట విజయాదిత్యుని కుమారుడు మల్ల విష్ణువర్ధనుడు శా. శ. 1124 వ సంవత్సరము జ్యేష్ఠ బహుళ 10 భానువార మశ్వనీ నక్షత్ర సింహ లగ్నమందు శ్రీ పిఠాపురములోని కుంతీ మాధవస్వామి దేవాలయములో పట్టాభిషిక్తుడయ్యెనని దెలియుచున్నది. ఈ తెలుగు తిథికి సరియైన యింగ్లీషు తేదీ (కీల్‌హారన్ పండితుని గణన ప్రకారము) క్రీ. శ. 1202 వ సంవత్సరము జూను నెల 20 వ తేదీ యగుచున్నది. ఈ శాసనమందే మల్లవిష్ణువర్ధనుని తండ్రియగు మూడవ విజయాదిత్యుడు శా. శ. 1079 సం॥రమునకు సరియైన క్రీ. శ. 1158 వ సంవత్సరము జనవరి పదునొకండవ తేదిని సింహాసనమెక్కినట్లుగగూడ దెలుపబడినది. క్రీ. శ. 1228 వ

సంవత్సరమున వేంగిదేశమంతయు గణపతిరాజుల యధీనమైనది. గనుక మల్లవిష్ణువర్ధనునితో నీ వంశము వారి పరిపాలనము తుదముట్టినది.'

(340 పే) ఈ వంశములోని కడపటి వాడైన మూడవ మల్లపదేవునకు విష్ణువర్ధన మహారాజనియు, మల్లపదేవచక్రవర్తియనియు బిరుదు నామములు గలవు............శకటమంతవివాదులోని చాళుక్య భీమవరములోనున్న రాజనారాయణస్వామి దేవాలయములో మల్లపదేవుని శాసనములు రెండు గలవు. ఆ రెండు శాసనములలోను మల్లవిష్ణువర్ధనుడు శా. శ. 1069 వ సంవత్సరమునగా క్రీ. శ. 1147 వ సంవత్సరముననే సింహాసన మెక్కినట్లు దెలుపబడినది. ఈ భీమవరముశాసనములను పిఠాపురము శాసనములతో సమన్వయించుట కష్టసాధ్యముగ నున్నది. పై రాజనారాయణస్వామి దేవాలయములోనే శా. శ. 1098 వ సంవత్సరములో మల్లపదేవుని సవతి తమ్ముడయిన నరేంద్రుడు చేసిన దాన మొకటి గూడ గానవచ్చుచున్నది. ఈ నరేంద్రుడు విజయాదిత్యునకు లక్ష్మీదేవివలన జనించిన పుత్రుడని మఱియొక శాసనమునబట్టి కూడ దెలియుచున్నది.

తెలుగు విజ్ఞాన సర్వస్వము - మూడవభాగము - చాళుక్య చోళులు. 211. పే...'పూర్వచాలుక్య కుంతిక బేత విజయాదిత్యుని సంతతివారు ఈ ప్రాంతమున పర్వతారణ్యప్రదేశమునకు సమీపమున స్థిర నివాసము ఏర్పఱచుకొని సమయము చిక్కినప్పుడు తిరుగుబాటులలో బాల్గొని విప్లవధ్వజమెత్తుచు; పూర్వచాలుక్య రాజ్యమును స్థాపించుటకు ప్రయత్నించుచు వచ్చిరి. వీలు చిక్కినప్పుడు స్థానిక ప్రభువులను సేవించుచు వచ్చిరి. వీరిలో కుంతికబేతవిజయాదిత్యుని పౌత్రుడైన రెండవ విజయాదిత్యుని కుమారుడు రెండవ మల్లపదేవుని కాలమునుండియు ప్రత్యేక రాజ్యస్థాపనకు కృషి జరిగినది. (మధ్యప్రదేశ్ లోని) సాగర విషయాధీశ్వరుడగు హైహయతిలకుడు బ్రహ్మమహారాజ తన కుమార్తె చందలదేవిని రెండవ మల్లప దేవునకు ఇచ్చి అతని ఉద్యమునకు తోడ్పడెను. కాని రెండవ మల్లపదేవుని కుమారుడైన మూడవ విజయాదిత్య నృపుని కాలముననుగాని అది ఫలింపలేదు. రెండవ మల్లపదేవరాజ తన తనయుడు మూడవ విజయాదిత్యునకు పూర్జవాడి అధిపతియైన పులకేశి భూవిభుని కూతురు గంగాదేవిని పెండ్లిచేసి అతని సహాయమును గూడ బడసెను. పొరుగునమున్న హైహయ నరపతుల యొక్కయు, దూరముననున్న పులకేశి రాజేంద్రుని యొక్కయు తోడ్పాటుతో మూడవ విజయాదిత్య భూపతి పూర్వచాళుక్య రాజ్యమును పునరుద్ధరించి శకవర్షము 1079. (క్రీ. శ. 1158 జనవరి 11) లో పట్టాభిషిక్తుడయ్యెను. ఇతనికిని ఇతని సంతతి వారికిని పిఠాపురము రాజధాని. అందువలన వీరిని పిఠాపురము చాలుక్యులు అందురు. మూడవ విజయాదిత్యుని శాసన మొక్కటియు ఇంతవరకు కానరాలేదు. విజయాదిత్యుడు పట్టాభిషిక్తుడైన మరుచటి సంవత్సరమే అనగా శకవర్షము 1080 లో రాజరాజదేవుని 13 వ విజయరాజ్య వర్షమున కాకతీయ రుద్రదేవుని ప్రెగ్గడ ఇనంగల బ్రహ్మరెడ్డి శాసనమొకటి ద్రాక్షారామమున కనబడుచున్నది.........

ఇతడు ఏ కారణమున ద్రాక్షారామమునకు వచ్చెనో తెలియదు. ఒకవేళ ఇతడు విజయాదిత్యునకు తోడ్పడుటకు వచ్చెనేమో! కాని వెలనాటి ఇమ్మడి గొంకరాజ శాసనములు శా. శ. 1079 తరువాత చాళుక్య చోళరాజ ప్రతినిధుల రాజధానియైన జననాథపురము (ద్రాక్షారామము)న ఇక కానరావు. దీని వలన ఈ ప్రాంతమంతయు పూర్వ చాళుక్య (మూడవ) విజయాదిత్యుని యధికారము క్రిందకు వచ్చియుండునని తోచుచున్నది.

(220 పే.)......కృష్ణానదికి తూర్పు దేశమున వేంగీ విషయములో చాళుక్యులు మొదలైనవారు సిరపద్యప్రోలు (సిడుదవోలు), ఉండి మొదలైన చోట్ల చిన్నచిన్న రాజ్యములు నిర్మించుకొని వానిని పాలించుచుండిరి. కొంవి ప్రాంతము ఈ కాలమున ఎవరి క్రింద ఉండెనో తెలియదు. గోదావరినదికి తూర్పున కోనరాష్ట్రము హైహయుల స్వతంత్ర పరిపాలన క్రింద ఉండెను. పిఠాపురము రాజధానిగా...... మూడవ విజయాదిత్యుని కుమారులు పాలించుచుండిరి. ఈ విజయాదిత్యుని సంతతిని గురించి తెలుపు శాసనములు రెండు గలవు. 1. ఎరరుపల్లి

తామ్రశాసనము. 2. పిఠాపుర స్తంభశాసనము. వీనిని అనుసరించి విజయాదిత్యునకు లక్ష్మీదేవి-గంగాదేవి అను ఇరువురు భార్యలు. వీరు ఉభయులును మార్జవాడి దేశాధిపతులైన పులకేశి కూతుండ్రే. విజయాదిత్యునికి అగ్రమహిషి లక్ష్మీదేవి అనియు, ఈమె యందు కరవాలభైరవ, రాజనారాయణ బిరుదాంకితుడైన విష్ణువర్ధనుడు జనించెననియు ఎరరుపల్లి తామ్రశాసనమువలన తెలియుచున్నది. ఈ శాసనము శకవర్షము 1101 లో ఈ విష్ణువర్ధనుడిచ్చెను. పిఠాపురము స్తంభశాసనము ప్రకారము విజయాదిత్యునికి గంగాదేవియందు మల్లదేవ భూపతి జనించెను. ఈతనికి పూర్వులలో మల్లపనామధారులు ఇద్దరుండుటచేత ఇతనికి మూడవ మల్లపదేవరాజని పేరు కలిగినది. ఇతడు ఎరరుపల్లి శాసనకాలమునకు ఇరువది మూడు సంవత్సరములకు తరువాతకాని రాజ్యమునకు రాలేదు. వెలనాటి రెండవ కులోత్తుంగ రాజేంద్రుని కడపటి పరిపాలన సంవత్సరములో పిఠాపురమున పట్టాభిషిక్తుడై పూర్వ చాలుక్య రాజ్యమును ఉద్ధరించినవాడు మూడవ విజయాదిత్యుని కుమారుడు విష్ణువర్ధనుడన్నది నిశ్చయము. అందుకు క్రీ. శ. 1102 నాటి ఎరరుపల్లి శాసనమే ప్రమాణము. ఈతని శాసనములు కాకివాడ తాలూకా సర్పవరము, చాలుక్య భీమవరములోను, రాజోలు తాలూకా పలివెలలోను కానిపించుచున్నవి. శకవర్షము 1098 నాటి చాలుక్య భీమవర శాసనమువలన ఇతనికి వీరనరేంద్రుడనికూడ వ్యవహారము కలదు. అక్కడనే శ్రీ సర్వలోకాశ్రయ విష్ణువర్ధనుని మూడవ విజయరాజ్య సంవత్సరము నాటి శాసనమును (మల్లపదేవ చక్రవర్తి మూడవరాజ్య సంవత్సరము నాటి శాసనమును) కలదు. దానిలో ఇచ్చిన శకవర్షము 1098. రెండవ దానిలో నిది 1099. ఇవికాక శకవర్షము 1099 నాటిదే మల్లభూపతి శాసనము ఇంకొకటి యున్నది. పలివెలలో సర్వలోకాశ్రయ విష్ణువర్ధన బల్లహదేవ చక్రవర్తి కొడుకు భీమదేవ చక్రవర్తిది శకవర్షము 1099 నాటి శాసనము కలదు. ఎరరుపల్లి శాసనపు విష్ణువర్ధనునికి వీరనరేంద్రుడనియేగాక, మల్లపదేవచక్రవర్తి అని పేరుగూడ కలదో లేక మల్లపదేవ చక్రవర్తి (బల్లహదేవ చక్రవర్తి) వేరో తెలియదు. చాళుక్య భీమవరము శాసనమువలన మల్లపదేవ చక్రవర్తి ఒకడు శకవర్షము 1095—96 లో పట్టాభిషిక్తుడై రాజ్యమేలినట్లు తెలియును. ఇతడు తొమ్మిదేండ్లకుపైగా రాజ్యము చేసెను. వీరనరేంద్ర నామాంతరముగల విష్ణువర్ధనుడును శకవర్షము 1095—96 లలో రాజ్యమునకు వచ్చిన సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మల్లపదేవుడును వేరని ఎంచినచో, వీరు ఒకటే కాలమున వేరు వేరు ప్రాంతములను ఏలుచుండిరని భావించవలయును. వీరు వేరుకాదు; ఒక్కరే అనుకొన్నచో విజయాదిత్యునికి లక్ష్మీ—గంగా దేవులకు జనించిన తనయులు ఉభయులకును మల్లపదేవనామము ఉండెనని అయినను చెప్పవలెను. ఈ విషయము భావి పరిశోధనవలన తేలవలెను. కాని దగ్గర దగ్గరఉన్న పిఠాపురము, చాళుక్య భీమవరము ప్రాంతములు వేరు వేరు నృపాలుర ఏలుబడిక్రింద ఉండినటు ఊహించుటయు అసమంజసమేమో. ఎట్లయిననేమి గోదావరికి తూర్పున ఉండిన పిఠాపురప్రాంతము పూర్వ చాళుక్య వంశజుల పాలనక్రింద ఉండెను. శకవర్షము 1103 నుండి 1108 వరకు ద్రాక్షారామమున వెలనాటి దుర్జయుల శాసనములు ఏమియు కానరావు. ఈ దేశమును మరల స్వాధీనము చేసికొనుటకై వెలనాటి కులోత్తుంగ రాజేంద్రచోడ పృథ్వీశ్వరుడు పిఠాపుర చాలుక్య రాజ్యముపై దండెత్తివచ్చి అక్కడి చాలుక్య నరేంద్రుల జయించి తద్దేశమును మరల శకవర్షము 1108 నాటికి తన అధికారము క్రిందికి తెచ్చుకొనెను. కోనహైహయులు అదివరకే వెలనాటి రాజన్యులకు విధేయసామంతులైరి. ఒకవేళ పృథ్వీశ్వరునికి శత్రులైన పూర్వ చాళుక్యులకు తోడ్పడుటకై వచ్చెనేమో? శకవర్షము 1108 లో కాకతి రుద్రదేవ మహారాజు శాసన మొకటి ద్రాక్షారామలో ఉన్నది. కాని అతడు ఆలస్యముగ వచ్చుటచేతనో మరి ఏ కారణముననో అతని రాక ప్రయోజనము లేక పోయినది.'

పై విషయముల బాగుగా గమనించిన ఎరరుపల్లి తామ్రశాసనకర్తయగు శ్రీ విష్ణువర్ధనుడును: (కరవాలభైరవ, రాజనారాయణ బిరుదాంకితుడు) శ. 1101 (క్రీ. శ. 1179 సం.) చాళుక్య భీమవరమునందలి శాసనముల ననుసరించి శా. శ.

1067 (క్రీ. శ. 1147 పట్టాభిషేకమందిన మల్ల విష్ణువర్ధనుడును; వీరవరేంద్ర' బిరుదాంకితుడు, పిఠాపుర స్తంభశాసన కర్తయగు మల్లభూపతియు (శా. శ. 1124 క్రీ. శ. 1202 పిఠాపురమున పట్టాభిషిక్తుడైనవాడు); ఒకరికొకరు ఏమగుదురు (ఒక్కరా లేక వేర్వేరా) అను సందేహము (ఆ 1047–1078 గల ముప్పదేండ్ల ఎడము వలన సందేహము) లేర్పడినవి. అంతేగాక ఇంకొక క్రొత్త చిక్కును ఏర్పడినది. వీరిని పిఠాపుర చాళుక్య రాజులని వాకొనిరి. అందుకు నిదర్శనముగా ఈ వంశపు ఆఖరు రాజగు సర్వలోకాశ్రయ మల్లపదేవ చక్రవర్తి యొక్కడే శా. శ. 1124 క్రీ. శ. 1202 పిఠాపురమున కుంతిమాధవుని ఆలయమున పట్టాభిషేకమందినట్లు గానవచ్చుచున్నది. అంతేగాని తక్కిన యిర్వురును పిఠాపురమున పట్టాభిషేకమందినట్లు గానరాదు. అంతేగాక శా. శ. 1101 క్రీ. శ. 1079 సం. ఎరరుపల్లి తామ్రశాసనకర్త తన నివాసమగు జననాథపురమునందు నిండుకొలువుకూట మున ఆ శాసనము గావించినటుల స్పష్టము. దీనికి తోడు అంతకు పూర్వము వేంగిరాజ్యమున యువరాజు లకును, రాజప్రతినిధులకును ఆ జననాథనగరమే రాజధానియైనటుల చారిత్రకులు వక్కాణించి యున్నారు. అందుకు తోడగ.

Sunday Standard, 1967. July.

A New epigraph of Paranthaka Chola By N. Ramesan:-3. 'The grant was made in the year 1116 A. D. The year of the grant is mentioned in the epigraph itself as saka 1038.' Sastha Thrimsat Dasa Satamite yatamatre Sakabde'. The grant registers the gift of the Village Alavalli Nilaya to 260 South Indian Brahmins, when Veera Choda had formally setteled in the village. The grant was made by king Paranthaka Son of Kulottunga I, while he was ruling Vengi as Viceroy with his Capital at Gananatha Pura, which Corresponds to the modern Draksharama of the East Godavari District in Andhra Pradesh.

కావ్యమాల – ప్రాచీన లేఖమాల – తృతీయ భాగము 106 పే. 164 శా.

'శత్రుధ్వాన్త మపాస్య రాజనికరా
నాచ్ఛాద్య ధామ్నా పరాన్।
దుర్వృత్తాన్వినివర్త్య భూకమలినీం
కృత్వా తథా నన్ది నీన్।
ప్రాయాత్ జననాథనామనగరీ
హార్మ్యోదయాద్రి ద్విభుః।
ర్వేంగీ భూతల భూషణం నృపసుతో
బాలార్క బిమ్బద్యుతిః॥

శాకాబ్దే శశిఖామ్బరేమ్దు గణితే
సింహాధి రూఢే రవౌ।
చన్ద్రే వృద్ధిమతి త్రయోదశి తిథౌ
వారే గురో వృశ్చికే।
లగ్నేధి శ్రవణే సమస్త జగతీ
రాజ్యాభిషిక్తో ముదే।
లోకస్యా ద్విదలిన్మవట్ట మనఘః
శ్రీ వీర చోడే నృపః॥

అని యుండుటచే శా. శ. 1001 క్రీ శ. 1079 మొదలు శా. శ. 1124 క్రీ. శ. 1202 వఱకును (మల్లవిష్ణువర్ధనుని పట్టాభిషేకమువరకును) అయిన 123 సం॥ వేంగిని పరిపాలించిన రాజప్రతినిధులు (యువరాజులతోను); బేతకంతికవిజయాదిత్య వంశ చాలుక్య రాజులకు జననాథనగరమే రాజధాని యయినటుల స్పష్టమగుచున్నది. కావున ఒకేవంశము వారైన ఉభయ (బేత విజయాదిత్య) చాలుక్యవంశపు రాజులు ఒకే రాజధానీనగరము కలవారై కడకు జననాథ నగరమునుండి పిఠాపురమునకు మార్చుకొనిరే గాని పిఠాపురము వేరుగాను జననాథనగరము వేరు గాను రాజధానులై వేర్వేరురాజులొకేసారి పరిపాలించి యుండలేదు. ఈ విషయమున నీ సందేహమంతయు మూడవ విజయాదిత్యుని పట్టాభిషేకకాలము శా. శ. 1047 క్రీ. శ. 1128 కి మాఱుగా 1079 క్రీ. శ. 1158 అని ముప్పది సంవత్సరములు పొఱ బాటున హెచ్చుగా లెక్కించి యుండుటచేత నీ చిక్కులు హెచ్చినవి. అది అంతతో పోక

రాజనారాయణస్వామి దేవాలయములోని శాసనకర్తయై శా. శ. 1069 క్రీ. శ. 1147 వ సం. సింహాసన మెక్కిన (మల్ల) విష్ణువర్ధనుడును (రాజనారాయణ బిరుదాంకితుడు), శా. శ. 1095–96 (క్రీ. శ. 1173–1174 సం. లో పట్టాభిషిక్తుడైన మల్లపదేవచక్రవర్తియు, శా. శ. 1124 (క్రీ శ. 1202 పిఠాపురమున పట్టాభిషిక్తుడైన మల్ల విష్ణువర్ధనుడును వేర్వేరువారేగాని యొక్కరుకారు. అందువలన పిఠాపురము, సామర్లకోటల యందొకే కాలమున ఇర్వురురాజులు పరిపాలించుటగాని, శ్రీ విష్ణు వర్ధన, మల్లపదేవ చక్రవర్తి, విష్ణువర్ధన మల్లదేవులు ఒక్కరే అయియుండుటకుగాని సావకాశములేదు. ఆ ముప్పదిసంవత్సరముల లెక్కింపు సారబాటే యిన్ని చిక్కులు దెచ్చిపెట్టినది. (౪) కు సమాధానము: (88–89) క్రీ. శ. 1947 భారతి సర్వజిత్తు విజ్ఞ శ్రావణము 267 - 270 పే. శ్రీ యం. వెంకటే శ్వర్లుగారి విష్ణువర్ధన మల్లదేవుని పిఠాపుర శాసనము అను వ్యాసమును పరికింపవలసివచ్చినది. అందు వారు, క్రీ. శ. 1202 నాటి విష్ణువర్ధన మల్లపదేవుని పిఠాపురశాసనము విమర్శించుచు... E. I. IV. No. 33.2: Ibid. L. 61. ...... విక్రమ చోడనామా చాళుక్యవంశ జలధేః పరిపూర్ణ చంద్రః తస్మి స్త్యాగ సము. L. 62. ద్రావిడనామవి చోడమండలం త్రాతుం గతవతి వేంగీభూమీర్ నాయక రహితా etc. అని యుండినను 'క్రీ. శ. 1118 నాటి ఆంధ్రదేశ పరిస్థితులను గూర్చి ఈ శాసనమున తెలుపబడిన విషయములు మన మంగీకరింపజాలము. ఈ శాసనము క్రీ. 1118 నాటికి చాలదూరముగ నున్నది. పైగా రమారమి ఆదేకాలమునాటి శాసన ములు అట్టి అరాజకమునుగాని, తూర్పు చాళుక్య పిఠాపురరాజులను గూర్చిగాని తెల్పలేదు' అని తెల్పి వారు. శాసనము ఎంతకాలమైనను సత్యమును బయలు పఱచుట కాటంకము కాజాలదు. అంతియేగాక ఆ విషయమునే వారన్న 1118–1202 కు మధ్య కాలమైన 1179 లోని ఎడఉుపల్లి పునర్దత్త తామ్రశాసనమునందు 88-89 పంక్తులలో నొక్క యక్షరమైనను పొల్లుపోకుండ వ్రాసి యదార్థ మైనట్లు రుజువుగావించుచున్నది. ఆ వ్యాసముననే 238 పే. 2 కా. 'విక్రమచోళుని యనంతరము అనగా క్రీ. శ. 1118 నాటినుండి చాళుక్య చోళ రాజులు ఆంధ్రదేశమునకు తమ వంశములోనివారిని ప్రతినిధులుగ బంపు నలవాటును మానుకొనిరి. దీనికి కారణము వెలనాటి నాయకుల యధికారము (పశ్చిమ గృద్రాహారమున) విజృంభించుట. రెండవది వారు చాళుక్య–చోళరాజుల కనుకూలముగనుండి వారికి సామంతులుగనుండుట. పైగా విక్రమచోళుడు ఆంధ్ర దేశమును వదలినకాలమునకే వెలనాటిచోడుడు తన యధికారమును స్థాపించుకొనియే యుండెను. తన యధికారమును ధిక్కరింప సామర్థ్యముగల ఆంధ్ర నాయకులు వేరెవ్వరు క్రీ. శ. 1118 లో లేరు. తరువాత కొద్ది సంవత్సరములకు అరాజకము సంభ వించెను. దానికి కారణము పశ్చిమ చాళుక్యరాజులు (విక్రమాదిత్యుడు) ఆంధ్రదేశముపై గావించిన దండ యాత్రయే కాని దానికిని, విక్రమచోళుడు చాళుక్య చోళసామ్రాజ్యమున కేగుటకును ఎట్టి సంబంధము లేదు' అని తామే యుదాహరించుటవలన కారణ మేమైనను పశ్చిమ చాళుక్య దండయాత్రవలన, విక్రమచోడుడు 1118 లో ద్రవిడదేశమునకు వెడలిన తరువాత వేంగీదేశము అల్లోకల్లోలితమై (ఏకైక) నాయకరహితమయ్యెనని చెప్పక చెప్పుచున్నది. అట్టి తఱిలోనె 1120–1124 మధ్య వేంగీదేశమున పశ్చిమ చాళుక్యుల శాసనములును వెలసియున్నవి. ఆ సిమ్మటనే అదనుజూచుకొని రక్తస్పర్శచే తూర్పు చాళుక్య వంశజులై నిజమైన వారసత్వమున కర్హులైన 927 సం. బేత కంఠికవిజయాదిత్య వంశజులైన వారిలోని మూడవ విజయాదిత్యుడు సాగరవిషయాధి పతులైన హైహయబ్రహ్మమహారాజుయొక్కయు, మార్జవాడి దేశాధిపతియైన పులకేసి మహారాజు యొక్కయు తదితరుల సహాయముతోను వేంగీదేశ మును ఆక్రమించి అప్పటి రాజధానియైన జననాథ పురమున పట్టాభిషిక్తుడగుటకుగాని నాటినుండియు తద్వంశజుల పూర్వ గృద్రాహారమును (Costal Districts) పరిపాలించుటకును ఎట్టి ఆటంకమును గలిగింపజాలవు. కావున ఈ వంశజులు ఈ రాజ్యమునే ఏలియుండుట కల్ల యనువాదము విరర్థకము ఆధార రహితము అని తోచును. ఆ వ్యాసముననే 267 పు. 2 వ కాలములో '...తూర్పు చాళుక్య పిఠాపుర రాజు లను గూర్చిగాని తెలుపుటలేదు. ముఖ్యముగ పైలక్క-

శాసనముతప్ప పిఠాపుర రాజుల శాసనములు గూడ ఈ విషయములను పేర్కొనుటలేదు.' 268 పే 1, 2 కా. 'వెలనాటి రాజులు అనేకులు ఈ విధముగ మొదటి గొంకరాజు (క్రీ. శ. 1076-1108) మొదలుకొని పృథ్వీశ్వరుని వఱకు (1186-1210) ఆంధ్రదేశమున చాల భాగమును పరిపాలించిరి. తదితర ఆంధ్రనాయకులు వారికి సామంతులై చిన్న చిన్న రాజ్యముల నేలుకొనుచుండిరి. అట్టివారే కోటరాజులు పాకనాడును, కమ్మనాడును ఏలిన తెలుగు చోడ రాజులును, తదితరు లనేకులు. వెలనాటిరాజులు పేరునకు మాత్రమే చాళుక్య చోళరాజుల సామంతులుగ నుండిరి. దీనికి నిదర్శనము, తమ శాసనములందు వారు చాళుక్య-చోళరాజుల రాజ్యపాలన వర్షములను పేర్కొనుటయే. వెలనాటిరాజు లేలిన కాలమున ఆంధ్రదేశమున తదితర వంశమువారి శాసనములు విస్తారముగా గానరావు. అసలు తూర్పు చాళుక్య పిఠాపుర రాజులను గూర్చి, హెచ్చుగ తెలుపు శాసనములు గూడా లేవు. దీనినిబట్టి తూర్పు చాళుక్య పిఠాపురపు రాజులు, విక్రమచోడుని యనంతరము ఆంధ్ర రాజ్యమును పాలించునట్లు ఎట్లు ఊహింపగలము?'

అనగా ఆ కాలమున ఆంధ్రదేశమున అనేక రాజులు చిన్నచిన్నరాజ్యము లేర్పఱచుకొని ఏలిరనియు, వారందరు చాళుక్య—చోడరాజుల సామంతులనియు అందువలననే తమ శాసనములం దాచాళుక్య—చోడ రాజుల రాజ్యపాలన వర్షములనే పేర్కొనుట, ఆయా రాజుల పేర్లను తమ సంతతికి వెలయించుట మొదలగునవి జరిగినవి. ఈ బేతకంఠికవిజయాదిత్య తూర్పు — చాళుక్యసంతతి స్వతంత్రమైనది. వీరి కితరులతో సంబంధములేదు. కావున వీరి వంశము ఇతరుల శాసనములందుగాని ఇతరుల వంశములు వీరి శాసనములందుగాని వర్ణింప నవసరము గాదు. అట్లు గావించుట సమంజసమును కాదు. కావున ఆ కారణము వారి రాజ్యపాలన లేదనుటకు ఆధారభూతము గాజాలదు.

270 పే. 1. కా. 'ఇంకొక విషయము విష్ణువర్ధన మల్లపదేవుని తామ్రశాసన మొకటి మనకు దొరికినది. (C. P. 10—1916—17. A. R. E.). అది క్రీ. శ. 1195 నాటిది. తర్వాత కాలమునాటి పిఠాపుర శాసనమువలెనే, ఇదికూడ చాళుక్య—చోళ రాజుల వంశావళులను, విక్రమచోళునివరకు, బేట విజయాదిత్యునినుండి విష్ణువర్ధన మల్లపదేవునివరకును గల తూర్పు చాళుక్య పిఠాపురరాజుల వంశావళిని పేర్కొన్నదేగాని, విక్రమచోళునితరువాత, వేంగీమండలము నాయకరహితమైనటులగాని అరాజకమునకు పాలైనటులుగాని వచింపలేదు. ఒక్కేరాజు శాసనములందు ఈ సందర్భములు వేర్వేరుగా ఏల తెలుపబడవలెను.' అయితే అది క్రీ. శ. 1195 నాటిది అని చెప్పుచున్నారు. ఈ పిఠాపుర విష్ణువర్ధన మల్లపదేవుడు క్రీ. శ. 1202 నాటివాడు. అనగా ఆ శాసనము ఈతనికి ఏడు సంవత్సరముల కాలము పూర్వపుది. అందుచే ఆ తామ్రశాసనము ఈ విష్ణువర్ధన మల్లపదేవునిది కాదనుట నిశ్చయము. అది వేరొకరిదై యుండును. అంతేగాక ఇట్టి భేదములు తూర్పు చాళుక్య శాసనములలో ఇంకను కలవు. క్రీ. శ. 927 సం. మూడవ భీముడు వేంగీదేశమును పరిపాలించినటుల 'పరణవిన్ని' తామ్రశాసనము ప్రత్యక్ష సాక్ష్యము. (భారతి 1965 ఏప్రియల్ 24—38 పే). అయినను ఆ మూడవ భీముని ఇతర చాళుక్య శాసనములు వ్రాయ విడిచినవి. ఆ విషయమున ఏదో యొక తామ్రశాసనపు మధ్య రేకు చివరి పంక్తిలో ఆ మూడవ పంక్తి యుదాహరించియున్నది. J. A. H. R. S. Vo. XVI. 134 P. 136. 8. L. 'తతను అమ్మ భీమాఖ్యం హత్వా ప్రో' అని యున్నది. 1964 నవంబరు భారతి 23—37 పే. సిరియూరు (కడప) తామ్రశాసనమున రెండవ రేకు - మొదటిప్రక్క 12. 'తతస్తడపరాజో మాసం, తన్నిజ్జిత్య చాలుక్యభీ 13. మతనయో విక్రమాదిత్య స్సంవత్సరం వేంగీ విషయ మపాలయత్. అత్రాన్తరే సామన్త శబర వల్లభ దన్డా శ్చాన్యేచళరామి మహామహిమికయా సప్తభ్యాన్స్య లంప న్నభిషిక్తం యుద్ధమల్లమవను 15. త్యబలాత్. ప్రాచ్యాముదితో విజయాదిత్య టవ స్తేజసానిధి భీమనృపః తత్సామన్తదితమోనిభిర్వ్యాపృ దశా 16. బ్ద మవని మరక్షత్.' అని యుదాహరించుటచే మూడవ భీమునితోపాటుగా యుద్ధమల్లునిగూడ బహిష్కరించి (రాజ)భీముడు (పదనొకండు సంవత్సరములే నిజముగా రాజ్యమేలినను) పదునెనిమిది సంవత్సరములు రాజ్యమేలిన ట్లుదాహరింపబడినది. కాని మిగిలిన తూర్పు—చాళుక్య తామ్రశాసనములన్నియు

యుద్ధమల్లుని రాజ్యమును గుర్తించియున్నవి. అందుచే ఈ శాసనవైషమ్యము బట్టి నిజమూరయక మూడవ భీముడుగాని, యుద్ధమల్లుడుగాని వేంగిదేశము పాలింప లేదని వక్కాణింప వీలుకలుగునా? అట్లే భిన్నవంశ ములవారు తమ శాసనముల నీబేతకంఠికవిజయా దిత్య వంశము వర్ణింపలేదను సాకుతో వీరు రాజ్యమే ఏలలేదను వాదము సమంజసము కానేరదు.

8. 134 — 144 దానము ప్రథమమున ముక్కంటి కాడ్వెట్టియను త్రిలోచన పల్లవునిచే సూర్యగ్రహణకాలమున వేదవేదాంగవేత్తలు సమస్త శాస్త్రవేత్తలు, గృహస్థులగు సద్విజులకును అన్ని పన్నులు తీసివేసి అగ్రహారముచేసి ధారాపూర్వకముగ నిచ్చి తామ్రశాసనము వేయించినట్టిది. అది కాలవశమున నశించుటచే తిరిగి కోరిన ఆయా బ్రాహ్మణాదులకు విష్ణువర్ధనుడు ధారాపూర్వకముగా నిచ్చి అమలుపఱచి పునర్దత్త తామ్రశాసనము వ్రాసియిచ్చెను. త్రిలోచన పల్లవుడను ముక్కంటి కాడ్వెట్టి 4వ శతాబ్దారంభమున కాంచీపురము రాజధానిగా నేలిన చక్రవర్తి. హిందూ దేశములో నాతని పేరెరుగనివారు లేరనియే చెప్ప వచ్చును. అతడే దక్షిణ దిగ్విజయ యాత్రకు వచ్చిన కోసల విజయాదిత్యుని నిర్జించినవాడు. కావున అతడా సమయమున అనగా 4 వ శతాబ్దారంభమునందు ఈ దానము గావించెను. దానిని తిరిగి బేతకంఠిక విజయాదిత్య చాళుక్య వంశోద్భవుడైన సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజు పునర్దత్తముగావించి తొల్లిటి త్రిలోచన పల్లవుడను ముక్కంటి కాడ్వెట్టి దానమును నిల్పి సక్రమముగా పాలించెను. అనగా శా. శ. 1101 అనగా క్రీ. శ. 1179, 178–199.

'శాకేవత్సరకే చంద్ర
వ్యోమ రుద్రాఖ్య గోభువః
విష్ణువర్ధన భూమిపో
దత్తవాం చ్ఛాసనం పునః'

అని యుదాహరించెను. అనగా మొదటి శాసనమున కును పునర్దత్త శాసనమునకును మధ్య 8 శతాబ్ద ములు గడచినవి. అంతేగాక పల్లవులు మొదలు బేటకంఠిక విజయాదిత్య తూర్పు చాళుక్య వంశము వరకును ఎన్నో రాజకుటుంబములును, ఎందరెందరో రాజులను ఎన్నెన్నో దేశవిప్లవములలో సాగిపోయినవి. కాని ఆ రాజుల ధర్మబుద్ధి న్యాయదీక్ష ప్రజాపాలనా రంజితము జూడ

'స్వదత్తాం పరదత్తాంవా
యో హరేత వసుంధరాం
షష్టింవర్ష సహస్రాణి
విష్టాయాం జాయతేక్రిమిః' అను పాప

భీతియు;

దానపాలనయోర్మధ్యే
దానాత్ శ్రేయోనుపాలనం
దానాత్ స్వర్గమాప్నోతి
పాలనా దచ్యుతం ఫలమ్.'

అన్న సూక్తి అక్షరాల కార్యరూపమున స్థిరపఱచిన ధర్మమూర్తులు. వారి దివ్యనామస్మరణముచేతనే పంచ మహాపాతకములు నశించి అక్షయసుఖముల నార్జించు టయు సుకృతమే.

ఇట్టి పునర్దత్త శాసనము లరుదుగా గలవు కాని అవి యిట్లు దీర్ఘకాల వ్యవధి గలవి కావు. విష్ణు కుండిన మాధవవర్మ యిచ్చిన పొలంబూరు శాసన మును 40 సం॥ వ్యవధిలోనే తూర్పు చాళుక్య జయసింహమహారాజు పునర్దత్తము గావించి ధన్యు డయ్యెను. అట్లే విష్ణుకుండిన గోవిందవర్మ గావించిన పెణుకుబఱ్ఱు శాసనమును పై తూర్పు చాళుక్య జయసింహమహారాజే పునర్దత్తము గావించి ధన్యు డయ్యెను. అదియును 50, 60 సంవత్సరముల వ్యవధిలోనే. అయితే ఇంత దీర్ఘకాలము గడచినపిదప, 8 శతాబ్దములకు పిదప అన్నివంశములు, అందరు రాజులు, అన్నివిప్లవములు గడచినతరువాతగూడ దాన ప్రతిగృహీతలు వచ్చి మనవిచేసినంతమాత్రమున అట్లు తిరిగి పునర్దత్తము గావించుట అత్యాశ్చర్యకర విష యము, ఊహింపజాలనిది.

9. 138–139, 180–193 పంక్తుల నడుమ 8 పర్యాయములు 'ఎడఋ'పల్లియని యుదా హరింపబడినది. అయితే అది యేలనో శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 'ఎరరు'పల్లి అని యుదాహరించి యున్నారు. అది 'ఱ'గాక 'డ' అని లిపియందు వ్రాయ

బడియుండుట స్పష్టము. ఈ అక్షరపు మార్పువలన చిక్కు ఏమనగా రామచంద్రపురము తాలూకా రామచంద్రపురమునకు తూర్పున ఒక అరమైలు దూరమున 'ఏఱుపల్లి'యను చిన్నగ్రామము కలదు. అదియే ఎరరుపల్లియని భావించుచున్నారు కాని జాగ్రత్తగా బరిశీలింప 178—179 పంక్తులగల సరిహద్దుల గమనింప తూర్పున ఉండూరు; దక్షిణమున కిన్నపోలు (నేటి భీమక్రోసపాలెము.); పడమర దాక్షారామము; ఉత్తరమున తాండిపల్లి; ఆగ్నేయమున గొల్లగుంట, అంద్రంగి, వత్తిపూడి; వాయవ్యమున వెల్ల; ఈశాన్యమున ఏంకలవర్తి యున్నట్లు గానవచ్చుచున్నది. ఇప్పటికిని గొల్లగుంట, ఏంకలవర్తి గ్రామములు తప్ప మిగిలినవన్నియు గలవు. ఆ 'ఎడఱు'పల్లి గ్రామము మాత్రము లేదు అందు నేడు హసన్‌బాదా, కందుల పాలెము, కాపవరము గ్రామములు కలవు. అవి నేటి (చిన్న, మొన్నటి) వఱకును సర్వదుంబాలా యీనాములే. కాని లాండు రివిన్యూ లేనివే. మొత్తము సుమారు అఱువేల ఎకరము (కనీసము)గల స్థలము.

10. ఎడఱుపల్లి గ్రామము దాక్షారామ భీమేశ్వర విమానమునకు తూర్పు భాగమున దివ్యక్షేత్రము అని యుదాహరించియుండుట ఆశ్చర్యము. ఏలన దాక్షారామమే క్రీ. పూ. 7, 8 శతాబ్దములకు పూర్వమే ఆంధ్రదేశమునందలి త్రిలింగక్షేత్రములలో ప్రసిద్ధికెక్కినది. అంతేగాక పంచారామ ప్రతిష్ఠాకాలమున క్రీ. శ. 7 శతాబ్దమధ్యమందు (దాక్షవాటిక) దాక్షారామము అను పేరున ప్రసిద్ధికెక్కిన పుణ్యక్షేత్రము. అట్టితఱి అట్టి విశ్వవిఖ్యాత క్షేత్రమునకు ఒక్కమైలుదూరములోనే ఆ దైవతమూర్తుల పేరిటనే (శ్రీ మాణిక్యాంబా భీమేశ్వరులు) దివ్యక్షేత్రమై యుండుటయు; అప్పటి యిప్పటికిని చాల పురాతన ఆలయావశేషములైన వర్తులాకార పానువట్టము, మహిషాసురమర్దిని అష్టభుజ విగ్రహము పూజాపురస్కారములు లేకుండ ఆ హసనబాదా భీమేశ్వరాలయ ఆవరణలో యుండుటయు; ఆ ఆలయమందలి నంది, గణపతి, నాగ (ప్రతిమ) ముఖముగల సోమసూత్రమును ఆలయమున పురాతన ఆలయావశేషములు గూర్చబడియుండుటయు; 'ఎడఱు' అను పదమునకు ప్రఖ్యాతి, ప్రసిద్ధి, తేజోవంతము అను ఉన్నత ద్యోతార్థకములును; దైన్యము, భగ్నము అను హీనార్థద్యోతార్థకములును గూడ (యుండుట) నైఘంటుకులు వెలిబుచ్చియుండుటచేతను; 185పంక్తిని దక్షిణతః కిన్నపోలికి ఎడఱుపల్లికి (ప్రస్తుత హసన్ బాదా) నడుమ సప్తగోదావరినది యుండుటయు; అది పడమర ద్రాక్షారామ మొదలు తూర్పున ఉండూరువరకును నదీరూపమున ఈ శాసనమందు గానవచ్చుటచేతను; సప్తగోదావరినది ప్రత్యేకము (దక్షారామ) భీమేశ్వర స్వాయంభువజ్యోతిర్లింగ ప్రతిష్ఠ కొరకు భీమేశ్వరుసాదసన్నిధికి మాత్రమే సప్త మహర్షులు తెచ్చినటుల భీమఖండ, భీమేశ్వర పురాణము లుదాహరించియుండుటచేతను; ప్రస్తుతమున్న దక్షారామ భీమేశ్వరాలయమున కొన్ని బౌద్ధచిహ్నము లుండుటచేతను; తొలుదొల్త త్రిలింగదేశమందలి విశ్వవిఖ్యాతమైన భీమలింగ ప్రతిష్ఠ సప్తగోదావరి అంత్య ప్రదేశమగు శాసనకాలమునాటి 'ఎడఱుపల్లి' గ్రామమున నెలకొల్పబడి మహావైభవ మొందినట్లును; తరువాత ఈ దేశము హీనయానకాలమున బౌద్ధమత ప్రభావము ప్రబలి నేటి ద్రాక్షారామ ప్రదేశమున పెదడాకిరేమియను పేరున బౌద్ధస్థూపము వెలసి సామాన్య జనాకర్షణీయమగుటచే ప్రజాబాహుళ్య దూరీభూతమైన 'ఎడఱుపల్లి దివ్యక్షేత్ర' భీమేశ్వరస్వామి ప్రతిభాదూరుడగుటవలన అంతర్హితము శోభావంతమయి ఎడఱుపల్లిగాయుండిన దివ్యక్షేత్రము శాసనకాలమునాటికిని అపదంబొంది భగ్నమై శోభాహీనమగు ఎడఱుపల్లిగా మాఱియుండి నామమాత్రావశిష్టమైనదనియు, తిరిగి మహాయానకాలము గడిచి వజ్రయానకాలమందు పెదడాకితేమియందున్న బౌద్ధస్థూపము 'లంజదిబ్బ'యను నింద్య రూపముగా మాఱి రూపఱసి నాటి వైదికమతోద్ధరణ సమయమున సూర్యవంశరాజులు (విష్ణుకుండినులు) కాలమున సప్తమహర్షులవంటి ఆర్షసంప్రదాయ వైదికబృందముచే దక్షవాటికా భీమేశ్వరుడు పునఃప్రతిష్ఠ గావింపబడియుండెననియు, ఆ ఆలయము చాలుక్య భీమేశ్వరునిచే దివ్యక్షేత్రమై దివ్యలింగ ప్రతిష్ఠాపనయు, దేవహర్మ్యముగా మాఱెననియు పండితారాధ్యాదులచే బూజింపబడి వీరశైవకాలమున కాటయవేమారెడ్డి సేనానియగు కడియము మాచినేని

అతని భార్య పోతినేనిగార్లచే కల్యాణమండప, ప్రదక్షిణ మండపాదులు ప్రాకారపరిదేవతాదులు ప్రతిష్ఠింపబడి పరిపూర్ణమైన నేటి దక్షారామ (విభవ) భీమేశ్వరాలయముగా మారియుండెననియు దోచుచున్నది. అంతేగాక రాజేంద్రచోడుని చోడవరము శిలాశాసనమందు 'దక్షారామ పురీశ్వరాయ, విభవ భీమేశ్వరాయ' అని యుదాహరింపబడియున్నది. పామర్లకోట కుమార చాలుక్య భీమేశ్వరుడు, దక్షారామ విభవ భీమేశ్వరుడు అనుట లోకప్రసిద్ధి.

ఇంతవర కీశాసనము సప్రమాణముగ వ్యాఖ్యానించి వ్రాసితిని. ఇందలి అజ్ఞాతకృతదోషములను పండితులు మన్నించి పరిశీలించి వెల్లడింప ప్రార్థన.

# శాసన పాఠము



## మొదటి ఱేకు - రెండవ పుట

1. శ్రీ ధత్తుర్భువనేశ్వరస్య వికసన్నాభీసరోజా దభూ। ద్బ్రహ్మ వేదనిధిః
2. పురాణపురుష స్తస్మా త్సులో మానసః। అ (సీ)ద్రత్రిముని(స్సు)తో (జని)జగన్నే
3. త్రోత్సవో వారిధేః। మిత్రాతం వంశకరో మహేశ్వర శి(రో)భూషామతే శ్చంద్రమాః[1]
4. తస్మా దింద్దో ర్జ్జగజ్యోతే। స్సొంద్దవో మంద్దిరం ధియః। బుధోజజ్ఞేభుధాదాసీ। చ్చ
5. క్రవర్తీ పురూరవః[2] తస్మాదాయుః తతోనహుషః తతోయయాతిః
6. తతఃపూరుషః[3] భర్త్స్య విజితారుణ్యం। స్సురవే దత్త్వ తదంగవక్త
7. జర (ం)భూషణమివయోభేజే। పూష భూ భార భరణ ధౌ
8. రేయభుజః[4] తతో జనమేజయః తతః ప్రాచిశః తతస్సైన్యయాతి
9. ః త (తో హ)యపతిః తతస్సార్వభౌమః తతో జయసేనః తతోమహా
10. భౌమః త(తో)ద్శానకః తతః క్రోధానసః తతోదేవకిః తస్మాదజాకః
11. తస్మా దృషకః తతోమ(తి)వరః తతః కాత్యాయనః తతోనీలః తతోదు

---

1. శార్దూల విక్రీడితం. 2. అనుష్టుపు. 3. గద్య. 4. ఆర్యావృత్తమ్.

## రెండవ రేకు - మొదటి పుట

12. ష్యంతః తతోభరతః[5] జాహ్నవీ యమునాతీరే। కృత్వాయూపాన్నిరంత(రాన్)।
13. యోమహాకర్మాణా భరత। నామ్నా(ఖ్యా)తోశ్వమేధకృత్[6] తతోభూమన్యుః త(త)
14. స్సుహోత్రః తతోహస్తీ తతోవిరోచనః తస్మాదజామీఢః తతః సంవ(ర)
15. ణః తతస్సుధన్వా తతఃపరీక్షిత్ తతోభీమసేనః తతః ప్రదీపనః(త)
16. తశ్శంతనుః తతోవిచిత్రవీర్యః తతః పాణ్డురాజః[7] కుంతీమా(ద్రీ)
17. దేవ్యా। యుధిష్ఠిరం భీమార్జున నకులం। సహదేవమితి సలేభే। (స)
18. ం ప్రాప్య(తి) వివసు తేజసన్తనయాన్[8] తేషు [9]విష్ణుర్య్యర్జాన్వయస్య
19. తా మునగతో మత్యర్త్యలజ్జాంజహౌ। పీతఃపాతువతా(న్స్త)దా(వ)
20. సమయే భద్రోయదాశ్లేషణాత్। యేనశ్చై వ్యాం దమభిరాత్సహోధివసి(తం)
21. సింహాసనం వ్రజిత। స్సోయం విశ్వజనీన చాపధరితో లోకైక వీ
22. రోర్జునః[10] తతోర్జునా దభిమన్యుః తతః పరీక్షిత్ తతోజనమేజ

## రెండవ రేకు - రెండవ పుట

23. యః తతః క్షేముకః తతోనరవాహనః తతశ్శతానీకః తస్మాదుద (య)
24. నః స్త్వద్యంశ్యేష్వయోధ్యా సింహాసనాసీనే ష్వేకోనషష్టిభరాపే
25. షుగతేషు తదన్వయే విజయాదిత్యోనామరాజా విజిగీషు త(తః)
26. దక్షిణాపథంగత్వా త్రిలోచనపల్లవమధిక్షిప్య కీర్తిశేషతా మ (గ)
27. మత్ తస్మిన్ సంక్కులే షణ్మాసగర్భిణీ తదగ్రమహిషీ ము(ది)
28. వేము నామాగ్రహార ముపగమ్య తన్నివాసినా విష్ణుభ(ట్ట)
29. సోమయాజినా దుహితృ నిర్వ్విశేష మభిరక్షితాసతి విష్ణువ(ర్ధన)
30. న్నందన మసూత తస్యచ కుమారస్య మానవ్యసగోత్ర హారిత పుత్ర
31. సక్షగోత్ర క్రమోచితాని కారయిత్వా కర్మాణి తమవర్ధ్దయత్ సచమా
32. త్రా విదిత వృత్తాంత స్సన్నిగ్గర్త్య చలుక్య గిరౌ నంద్దా భగవతీం గౌరీ మా
33. ద్యకుమార నారాయణ మాతృగణాంశ్చ సంతర్ప్య శ్వేతాత పత్రై కశంఖపంచ్చ

## మూడవ రేకు - మొదటి పుట

34. మహాశబ్ద పాలికేతన ప్రవగ్గ్యా వరాహలాంచ్ఛన పింఛ్ఛకుంత్త సింహాసన మక
35. ర తోరణ కనకదండ గంగాయమునాదీని స్వకులక్రమాని నిక్షిప్తానీవ సాం
36. ప్రాజ్య చిహ్నాని సమాదాయ కదంబ గంగాది భూమిపాన్నిర్జిత్య సేతు నమ్మర్దా
37. మధ్యం సార్ధ సప్తలక్షం దక్షిణాపథం పాలయామాస[11]। శ్రీ విష్ణువర్ధనా త్త
38. స్మా। ద్విజయాదిత్యభూపతిః। పల్లవాన్వయజాతాయాం। దేవ్యా మాసీత్సు

5. గద్య. 6. అనుష్టుప్. 7. గద్య. 8. ఆర్యా వృ. 9. గద్య. 10. శార్దూల వి. 11. గద్య.

39. తోత్తమం[12] తత్పుత్రః పులకేశివల్లభః తత్పుతః కీర్తివర్మా తస్య తన
40. యః శ్రీమతాం సకలభువన సంస్తూయమాన మానవ్యస గోత్రాణా
41. ం హారితి పుత్రాణాం కౌశికీ వరప్రసాదలబ్ధ రాజ్యానాం మా(తృ)గణ పరిపా
42. లితానాం స్వామి మహాసేన పాదానుధ్యాతానాం భగవన్నారాయణ ప్రసా
43. ద సమాసాదిత వరాహలాంఛనేక్షణక్షణవశీకృతారాతిమన్డలానా
44. మశ్వమేధావభృతస్నానపవిత్రీకృతవపుషాం చాలుక్యానాం కుల మ

## మూడవ ఱేకు - రెండవ పుట

45. లంకరిష్ణో స్సత్యాశ్రయ వల్లభేంద్రస్య భ్రాతా కుబ్జవిష్ణువర్ధనోష్టాదశ వ
46. ర్షాణి వేంగీదేశ మపాలయత్ తదాత్మజో జయసింహవల్లభస్త్రయ
47. స్త్రింశతం తదనుజ ఇంద్రరాజ స్సప్తదినాని తత్సుతో విష్ణువర్ధనో
48. నవవర్షాణి తత్సూనుర్మంగియువరాజః పంచవింశతిం తత్పు
49. త్రో జయసింహ స్త్రయోదశ తదవరజః కొక్కిలి ష్షణ్మాసా
50. న్ తస్యజ్యేష్ఠో భ్రాతా విష్ణువర్ధనః స్సముచ్చాట్య సప్త
51. త్రింశతమబ్దాన్ తత్పుత్రో విజయాదిత్య భట్టారకోష్టాదశ త
52. త్సుతో విష్ణువర్ధన షట్త్రింశతం త(త్త)నయః నరేంద్రో యుద్ధో యుంసమ
53. ర శత మష్టో(త్త)ర(మ) తో రణస్యాన్నేతావత్సరిగణంయా దేవ
54. విలయాన్ తదాక్షీరారామే... విధాయ క్షితి మపాద్భలా

## నాలుగవ ఱేకు - మొదటి పుట

55. చ్చత్వారింశా ద్వా ర......రమ్మసహితాః తత్పుత్రం కలివిష్ణువర్ధనోద్యర్ధ వర్షాం
56. తత్పుతః మంగిరాజో—మార్గనయోపార్జితోస్పమురంగేహే చకారకందుక క్రీడ ప్పా
57. మ్నా త్రిభువనాంకుశః[13] యోధాక్ష్టి (చ్చ)క్ర (కూట కి) రణపుర గతం సంక్కులం
58. క్రిష్ణయుక్తం। యోజ్జ్వ షీ దృల్లభేంద్రం (భు) జమహిమయుతం యోవ్యధా ద్వగ్ర హీ
59. ద్యః। కాలింగ్గ ప్రభృతేభ్యాన్ స గు (ణ) గవిజయాదిత్య దేవో మహేంద్రః। శ్చ త్వా
60. రింశత్సమా భూవలయ మథ చతుస్సంయుతా రక్షతిస్మా[14] తద్భాతు ర్వి
61. క్రమాదిత్యస్య తనయశ్చాలుక్య భీమః। షష్ట్యుత్తరం యస్త్రింశతంరణానాం జి
62. త్వా స్వనా (మ్నా) ప్రథితం విధాయ చాలుక్య భీమేశ్వర దేవహమ్మ్యర్ణం। త్రింశత్సమా భూ
63. తలమరక్షత్[15] తతః కొల్లభిగండావరనామ్నా విదితో విజయాదిత్య స్స
64. ణ్ణారూఘం తులాభారం ఆపాద్యమాద్యం విరజో జయస్తంభం న్విధాయ యే
65. తత్సుతా వమ్మరాజ రాజభీవరా తయోరమ్మరాజాగ్ర స్సప్తవర్షా

---

12. అనుష్టుప్. 13. గద్య 14. స్రగ్ధర 15. గద్య.

## నాలుగవ ఱేకు - రెండవ పుట

66. ణి తత్సుతః కంటికబేతావరనామానం విజయాదిత్యం బాలముచ్చాట్య లా
67. డపో మాసమేకం తంజిత్వా చాలుక్యభీమతనయో విక్రమాదిత్య ఏకాద
68. శమాసాన్ తత్తాడపరాజసుతో యుద్ధమల్ల న్సప్తవర్షాణి విద్రావ్యనం
69. యుద్ధమల్లం స్వదేశాద్విరోధిమా నమ్మరాజానుజన్మా రాజత్తేజో రాజ
70. భీమో జితారి ర్వేంగీదేశం ద్వాదశాబ్దానరక్షత్ తస్యసుతాస్త్రయ ఏతే వి
71. (రేజిరే రాజభీమ భూవిశాన్య దానార్ణవోమ్మనృవ నృపకామాః)
72. భవోపహసితదేవేంద్రాః తేషు మానుష మహేశ్వరో యశః—
73. రదప్రసరణో తదీనమ్మః అమ్మభూపతి రన్వపాలయ త్పంచవింశతో వ
74. మాః క్షమాతలం తతః దానార్ణవోమ్మభూపాలభ్రాతా సంవత్సరత్రయ
75. మపా(ర్ద)రాం చ్చతుష్షష్టికలా(నిధి)రిత్రి ప్రతతఃధీవిశ్వేష్వి ర్గురుపమాన దానావో
76. దాన భూతల-తం సంత్సరం సప్తవింశతి సమా విధేర్వశాదాంధ్రమండలే
77. మనాయు కంస్థితం దానార్ణవస్య నృపతే రాయ్యాదేవ్యాశ్చనందనః నిమ్మల

## అయిదవ ఱేకు - మొదటి పుట

78. శ్శక్తివర్మ్మా పాష్టదశాబ్దా నపాద్భువం తస్యావ (ర) జో విమలాదిత్యా మానాంబుని
79. ధి మ్మహేమంద్దారః ద్రోహిద్రుమఘనో ఘనబాహాసిఃపాతీన్మధరా మథ సప్తాబ్దాన్[16]
80. పుత్రస్తస్య హిమాంశువంశతిలక శ్రీరాజరాజన్నృమా। శ్చత్వారింశత మంధ్రమం
81. డలమపా ద్భూలోక కల్పద్రుమః। యస్మిద్దో మనబన్దనద్యతికరం ధైరోభన్నివ్వాణధా।
82. పాయూపా నరపాయుతిష్ఠిర మయమేమ్మనోధరిత్రీజనః[17] తత్పుత్రోజయవా నపూర్వ్వాప(వ)
83. పుషో రాజేంద్రచోడస్సిరః శ్రీ పంప్ర్వదావిద్దై నపోంధ్రవిషయుం నం
84. చ్చాశతాబ్దా నపాత్। యస్యస్ఫారతరప్రతాపదహనజ్వాలా సమాలింగి
85. తో భేజే మానుష గమ్యతాం తత హిమవానూనం హిమానీగిరిః[18] తస్యాభవ న్నృగథ
86. గీరథ దుందుమారః। రామాంబరీష భరత ప్రతిమస్య న్నతః। శక్రక్రమః ప్ర
87. థిత విక్రమచోడనామా। చాలుక్యవంశజలధేః పరిపూర్ణ చంద్రః[19] తస్మి
88. ం స్త్యాగ సముద్రాపరనామాన్ని చోడమండలం త్రాతుం గతవతా వేంగీ భూ
89. మిన్నాయక రహితో తదంతరే[20] జాతాత్మనాయే[21] తాడపోచ్ఛాదితోయేభూ

## అయిదవ ఱేకు - రెండవ పుట

90. దమ్మభూపాలవంద్దనః। కంటికో ద్యుతిమత్కంకో। బేత క్షితిపతిఃకృతి[22] తస్మాద్దైత
91. నరేంద్రా। దింద్రగజేంద్రావపోపి విశదయశాః। ఉత్తమచాలుక్యానర]। నజ్జన్పే]

---

16. గద్య. 17. శార్దూల. వి. 18. శార్దూల. వి. 19. వసంత తిలకం. 20. ఆర్యా వృ 21. గద్య 22. అనుష్టుప్.

92. త్యాశ్రయ సముద్భూతః[23] తస్యాసీదగ్రమహిషీ । గంగాన్వయ విభూషణం । గా
93. రి(జో) రివ లావణ్య । జాతా స్వస్త సుతాస్తయోః[24] వీరో విజయాదిత్యో । విమలాది
94. త్యాథ విక్రమాదిత్యః । శ్రీ విష్ణువర్ధనన్నృపో మల్లపదేవ । నృపకామరాజమాత్రాస్తాండాః[25]
95. శేషం శ్రీ విజయాదిత్య । సూర్యాన్వయ సముద్భవాం । ప్రీత్యైత్యోన పయేమే
96. విజయా । మహాదేవీ మ్మహీనమాం[26] తస్యాంతస్మాదభూద్విష్ణు । విష్ణువ
97. ర్ధన భూపతిః । ధీరో మల్లపదేవోథ । సోపిదేవో మితత్స(తః)[27] శేషా మశేష వి
98. దుషాం పరితోషపోషి । స్థానంస్థితేః కులగ్రిహమ్మనుజేంద్రలక్ష్మ్యాం । భూపో
99. భువః ఇవి రమాన పరాక్రమస్య । మల్లోద్విషాం జగతి మల్లపదేవ ఆసీత్[28]
100. సగరవిషయేశహైహయతిలక బ్రహ్మభిధాన నృపవరతనయాం ఉప
101. యేమే సో మల్లపదేవోద్వై(వో)పకొదత్సుందలదేవిం[29] లీలావతీతి చతురేతి

## ఆఱవ ఱేకు - మొదటి పుట

102. కలావతీతి కల్యాణి నీతికుంజేతి పతివ్రతి (తే) ధీరే త్యధికశ్చ (రి) తే(తి) స
103. లక్షణేతి యావద్భర్తేననరతం జగతి జని (తే త) స్యాః చందలదేవ్యా
104. మల్లపదేవో మహేశ్వరాల్లబ్దవరః తనయమజనయద్దేవం విజయాది
105. త్యం[29] దిలీపఇవ రఘువర మనఘం[30] యంభీమసాహసరుచిం విజయాభి
106. వంద్యం। ధర్మ్మైక ప్రమూతి మపి భిన్నకులానురాగం। శ్రీ వంశవర్ద్ధనన మవా (వ్య)
107. యుధిష్టిరోయ। మిత్యన్వహం విలసతి స్థిరవాక్య లక్ష్మ్మీః[31] యూ రా
108. జేంద్రు శకాబ్దే నిధి జలధి వియచ్చంద్రగే మాఘమాసే। శుక్లేపక్షే దశమ్యా
109. మినతనయుదినే రోహిణీ తారకాయాం। మీనేలగ్నేభిషిక్తో నిఖిల గుణగణ
110. స్య (సి) వాలో విశాలో। రక్షానర్హీం జనానా మభిమతఫలదాం కీర్త్తి పుష్యామను
111. ష్యత్[32] తస్యాసీద్వినయాన్వి తాగ్రమహిషీ లక్ష్మీ మ్మస్తీ మన్దనం। యావశ్రేతుల
112. న మ్మహిమ్ని రమయా వాణ్యాథ వాక్కౌశలే। ఐశ్వర్యే ధరణీధరేంద్రను
113. తయా శీలోన్నతే సీతయా సౌభాగ్యే రతికాంతయాతివిలసద్భాగ్యై (శ్శచీ)

## ఆఱవ ఱేకు - రెండవ పుట

114. కాంతయా[33] లబ్దాయయాంప్రియపుత్రీం । పులకేశి మాజవాడి భూమీశ
115. ః । ఉన్నతిముఖ్యంలేభే । గౌరింతనయామివ హిమాద్రిః[34] తస్యాః తస్మా దభూ
116. ద్విష్ణుః । విష్ణువర్ద్ధన భూపతిః । యన్మనః (శం) కరోమేనే । కైలాసమివవాసరం[35]
117. యశ్శ్రీమాన్ కర(వాల) భైర(వ) విభుద్వేవాద్రి తుల్యస్ఫుటం । గోత్రశ్రీవృతయాక్షమాధర

---

23. ఆర్యా వృ. 24. అనుష్టుప్. 25. ఆర్యా వృ. 26. అనుష్టుప్. 27. అనుష్టుప్. 28. వసంతతిలకం. 29. గద్య. 30. ఆర్యా. వృ (ప్రథమపాదమేవ) 31. వసంతతిలకం 32. స్రగ్ధర. 33. శార్దూల వి 34. ఆర్యా వృ. 35. అనుష్టుప్.

118. తయా కల్యాణ(యు)క్తాత్మనా। శశ్వత్సంభృత మిత్రమన్దలతయా సంతాన సంశో
119. భయా। నానారత్నవిచిత్రభూతకటకశ్రీమత్తయా శాశ్వతః[36] శ్రీ రాజ
120 నారాయణ నామసార్థకం కరోతిగోత్రోద్ధరణైకదక్షః। ధృతావనీచక్ర
121. (వ) ర్త్యకమో యో యశోదయాలంకృత దివ్యమూర్తిః[37] శ్రీ మన్నందనవా న్స
122. దార్యర్ వయ సంగ్గ త్యర్వ్ (–భే) ఎరాన్। దూతీ కృత్య సతానుభావ (యతి) సంప్రీ
123. త్యఖిలాన్ స్వశ్రియం ప్రాద్భాస్వద్భత కాధి శస్త్రకుళలో వ్యాస (త్నర్) తో చ్చే
124. శ్రవా। యో దేవేంద్ర ఇవాపరః ప్రథిత చాళుక్య వంశోత్తమః[38] వాచో
125. పత్యమ (యా) మతిన్నయమయా విద్యాచ పూజామయా। కీర్త్తిర్దానమ...

## ఏడవఱేకు - మొదటి పుట

126. తను గ్గుణమయా దృష్టిశ్చ రక్షామయా। శక్తిశ్శౌర్యమయా ప్రీతి స్తుతిమయా
127. యస్యాద్భుతభ్యాతశేః చాళుక్యాభరణస్య సజ్జనమనః పంకేరుహాశ్రిహ
128. రేః[39] యశ్చ జిష్ణు శ్చుచి స్సమవర్త్తీ నిరితి రత్నాకరస్వామీ మహాబలోరా (జ)
129. రాజ స్సనాళవ ఇత్యష్టదిక్పాలమయయేవ వర్తమానస్స సర్వలో (కా)
130. శ్రయ శ్రీ విష్ణువర్ద్ధన మహారాజాధిరాజ రాజరాజ పరమేశ్వరః పర
131. మ భట్టారకః పరమబ్రహ్మణ్యః పరమమాహేశ్వరః శ్రీ విష్ణువ
132. ర్ధనదేవో గుద్దవాడి విషయ నివాసినో రాష్ట్రకూటప్రముఖాన్కుటు
133. ంబిన స్సమాహూయ శ్రీ మజ్జననాథవరే మంత్రి పురోహిత సేనాప
134. తి యువరాజ దౌవారిక సమక్ష మిత్థ మాజ్ఞాపయతి[40] శ్రీమా నాసీ
135. దలిక తిలకోద్భాసి తార్త్తీయనేత్రః శ్వశ్వర్లోక ప్రథిత సుయశా సర్వ సర్వాంస
136. హేశః। గాంభీర్యాణాంభోనిధి రతిలసద్ధైర్య సద్భాధరేంద్రః। పార్దశ్శౌర్యే వితర
137. ణవిధా వర్కనూమస్మ భాతి[41] తేన ముక్కంటి కాడ్వంటి నామ్నా భూపాలకేన గు

## ఏడవ ఱేకు - రెండవ పుట

138. ద్దవాడి విషయే శ్రీ భీమేశ్వర విమాన పూర్వోర్భ్యయాం పుణ్యక్షేత్రే ఎద
139. ఱుపర్లి నామ గ్రామ మ్మార్యగ్రహణ నిమిత్తం ధారాపూర్వకం నిఖిలవేదవేదా
140. ంగ్గ విద్యస్సమస్త వ్యాకరణ న్యాయ వైశేషిక వేదాంత మామాంసేతిహాస పురాణ
141. ప్రవీణేభ్య స్సకలాగమ ధర్మ్మశాస్త్రార్థ తత్వపరిజ్ఞాన నిపుణేభ్యో ద్విపేభ్య స్స
142. ద్విజోత్తమేభ్య స్స ర్వ కరపరిహారేణ్యాగ్రహారీ కృత్య దత్తః తస్య తాంబ్ర శా
143. సనం చిరకాలవశేన శీర్ణే సతి తత్ర తే(భ్యో) బ్రాహ్మణేభ్య శ్శానవాదీనాభ్య
144. స్మా—ధారా పూర్వకం పునర్దత్తం తాంబ్రశాసనమితి విదిత మస్తు వః[42]
145. తే గోత్ర నామభిః పరిగణ్యంతే తివ్రవార్యః మల్లివార్యః ఎఱియ

---

36. శార్దూల వి 37. వి॰ (ఉపజాతి) 38. శార్దూల వి. 39. శార్దూల వి 40. గద్య.
41. శార్దూల వి. 42. గద్య.

146. నాయ్యా౯ః యాదిత్యయ్యా౯ః చీదనాయ్యా౯ః యజ్వా త్రివిక్రమ షడంగవి
147. త్......నాయ్యా౯ః ప్రోలనాయ్యా౯ః కామనాయ్యా౯ః ద్విభాగీ వెన్ననాయ౯ః పురు
148. షోత్తమాయ్యా౯ః......ద్ధా౯భాగీ కామనాయ్యా౯ః – ర్జేణ్ణ షడం
149. గ–త్రి–త్రయా–ద్వైభాగీ ఏతౌ భారద్వాజ వ..........

## ఎనిమిదవ తేకు - మొదటి పుట

150. ష్యైదశభాగినః...పోత............................వెన్ననాయ్యా౯ః
151. మాధవ షడంగ...భ......భీమనాయ్యా౯ః.............నారా
152. యణాయ్యా౯ః దామోదరాయ్యా౯ః మత్సనాయ్యా౯ః తాత్యనాయ్యా౯ః మండనా
153. య్యా౯ః జాయనాయ్యా౯ః ద్విభాగీ సూరనాయ్యా౯ః దామోదరాయ్యా౯ః కంద్దనాయ్యా౯ః
154. అప్పనాయ్యా౯ః త్రిభాగీ అన్నపాయ్యా౯ః ఏతేహరితా వింశతిభాగినః చామనాయ్యా౯ః భట్ట
155. నాయ్యా౯ః భీమనాయ్యా౯ః చామనాయ్యా౯ః సాద్ధా౯భాగీ మాకపోల భ
156. ట్టః అప్పనాయ్యా౯ః శంకరాయ్యా౯ః భీమనాయ్యా౯ః రుద్రభట్ట యజ్వ స్తోత్రా
157. య ఏతేభార్ద్వా౯ నవభాగినః గుండనాయ్యా౯ః మల్లనాయ్యా౯ః మేడనాయ్యా౯ః
158. శ్రీధరాయ్యా౯ః గోకనభట్టః మారపోలభట్టస్వా–మా భట్టాధితపః ఏతేకప్పార్ద్ధా౯ సప్త
159. భాగినః బల్పనాయ్యా౯ః దద్దనాయ్యా౯ః శ్రీధరాయ్యా౯ర్ద్ధా౯భాగీ చాననాయ్యోర్ద్ధా౯ భా
160. గి ఏతే శండిలాః త్రిభాగినః దమోదరచతుర్వేదర్ధ్యభాగీ కేశవాయ్యా౯ ద్వే
161. భా॥ వన్నపాయ్యా౯ః విజయనాయ్యా౯ః మేడనాయ్యా౯ః వెన్ననాయ్యా౯ః ద్వైభాగీ జనా
162. ద్ధ౯ నాయ్యార్ధ్ధ౯భాగీ భీమనాయ్యా౯ః బల్పనాయ్యా౯ః ప్రోలనాయ్యా౯ః మాధవాయ్యా౯ః సూ౯

## ఎనిమిదవ తేకు - రెండవ పుట

163. నాయ్యోర్ద్ధ౯భాగీ అన్నపాయ్యో౯ ద్విభాగీ ఏతేకుండినా దశభాగినః కొమర
164. నాయ్యా౯ః అన్నపాయ్యా౯ః శ్రీవత్స...నాయ్యా౯ః ఎఱియనాయ్యా౯ః ఏతే
165. మైత్రేయ ఏకభాగీ కేశనాయ్యా౯ః భీమనాయ్యా౯ః తల్లినాయ్యా౯ః జనార్ద్ధ౯నా
166. య్యా౯ః ఎఱియనాయ్యోర్ద్ధ౯భాగీ పురుషోత్తమాయ్యా౯ః తొంటనాయ్యా౯ః కంద్ద
167. నాయ్యా౯ః దివాకరాయ్యా౯ః సోమనాయ్యా౯ః మారనాయ్యోర్ద్ధ౯భాగీ ఏతేమండ్డ
168. ద్వాదశభాగినః ప్రోలనాయ్యా౯ః విష్ణు ద్వ ఏకభాగే సాం(ఖ్య) నాయ్యా౯ః
169. రటితర ఏకభాగీ అన్నపాయ్యా౯ః నాగనాయ్యా౯ః ద్వైభాగీ పారాశ
170. య్యా౯ మేడనాయ్యా౯ః ఎఱియనాయ్యా౯ః ప్రోలనాయ్యా౯ః (హరి)
171. తయా స్త్రిభాగినః పునఃహరితో మాదేవాయ్యా౯ః పునః వౌ
172. ద్గల్యః పోతనాయ్యా౯ః పునఃకొమ్మనాయ్యః భీమనాయ్యా౯ః కాశ్యపో
173. పునః కౌండిన్యో భీమనాయ్యా౯ః పునఃకాశ్యపస్య నాగదేవాయ౯స్యదశ *
174. ద్రా పరిమిత మారామక్షేత్రం దేవభాగాన్యో దేవ్యోరర్ద్ధ౯భాగః దుర్గాయా ఏక భ
175. * పునఃకాశ్యప ఆదిత్యాయ్యో౯ ద్విభాగీ

## తొమ్మిదవ తేకు - మొదటి పుట

176. ణ్డకం వన్యక్షేత్రః వేశ్యద్వయం కృషీవలకుటుంబినః స్థలయంత్రోలూఖలం క్రముక వ
177. నపాలకాః కుంభకార సువర్ణ్ణ౯యనలోహకార తక్షక నాపిత రజక చమ్మ౯కార తన్తులా

178. ప్రత్యేకార్యణి వ్యాపార్థ మంగీకృత్య తే భ్యోదత్తా:[43] పూర్వతః ఉన్నూరు దక్షిణతః కిన్నెరొం ప
179. శ్చిమతః దాక్షారామము ఉత్తరతః తాండిపల్లి ఏతేషాం మధ్యవర్తి త్రానోమహాగ్రహారస్యాస్య
180. క్షేత్రసీమానః పూర్వాతః ఉన్నూరి ఎడఉపల్లి నడిమి తొందులావ తల్లివారి సీమె వ
181 సీమా ఇందుండి దక్షిణముంబై పాయితూర్పు బద్ది ఆగి బత్తులగట్టు పైంగా గొల్లనిగుంట్టం జే
182. రి దక్షిణంబై పోయి ఆగ్నేయతః అంద్రదంగి ఎడఉపల్లి పెన్నుబ్ది మేముయర్యారి కు
183. త్రేన అవ తల్లివారిసీమె వసీమా ఇందుండి పడుమటించి (వ)ట్టవూడి వె
184. ఉపు నుత్తరము కద్దువడి దక్షిణముంబై కట్టుంబీదలగరువు పైంబోయి దక్షిణ
185. తః కిన్నపొలికి ఎడఉపల్లికి నడిమి సప్తగోదావరి తల్లివారిసీమె వసీమా ఇందుండి
186. పస్నమనాయకునితోట ఉత్తరమున నదియు మేరగా బోయనే నైరుత్యతః పొట్ట్న హం
187. గుత్తోన్ని తూర్పున నదియ సీమె వసీమా ఇందుండి పొంగా దన్నపాణి తోన్ని తూ
188. ర్పున ఎంగట్టువడి నుత్తరముంబై పొంగా పశ్చిమతః దాక్షారామమున ఎడఉప
189. ల్లి నడుమ హిమవంత్తేశ్వర మహాదేవర పద్మమున తూర్పుగట్టు సీమె వసీమా ఇం
190. దున్ని ఉత్తరముంబై గారిడిచెఉవు నడిమింగా వెడలిపోయే వాయవ్యతః వెల్ల

## తొమ్మిదవ ఱేకు - రెండవ పుట

191. ఎడఉపల్లి తాన్నిపల్లి ముయ్యేవికుట్టనఅవ తల్లివారిసీమె వసీమా ఇందుండి పో
192. గా ఉత్తరతః దూడూరి పొలమున ఎడఉపల్లిలవ త్రావిసీమె వసీమా ఐశాన్యతః
193. ఏంకలపత్రి ఎడఉపల్లి నడిమఅవ తల్లివారిసీమె వసీమా[44] అస్య నకేనవిద్యాధారర
194. ణియా యఃకరోతి స పంచ్చమహాపాతకసంయుక్తోభవతి ఉక్తంచ తదావేదవ్యాసేన[45]
195. స్వదత్తాం పరదత్తాంవా । యోహరేతవసు ధరాం । షష్టివర్షసహస్రాణి । విష్టాయాం జాయ
196. తే క్రిమిః[46] బహుభిర్వసుధాదత్తా । రాజభిస్సగరాదిభిః । యస్యయస్యయదాభూమి నస్య
197. తస్య తదాఫలం[47] (యా)వద్విజగతాంభూమిం । పూర్వభుక్తాం యయోహరేత్ । త్ర(మా)
198. దైమపికాలేవ । తం విద్యాద్బ్రహ్మఘాతుకం[48] శాకేవత్సరకేచంద్ర । వ్యోమ రు
199. ద్రాబ్యగోభువః । విష్ణువర్ధన భూవిశో । దత్తవాంచ్ఛాసనం పు
200. నః[49] లేఖక త్రిపోలాచార్యేణ[50]



43. గద్య. 44. గద్య. 45. గద్య. 46. అనుష్టుప్. 47 అనుష్టుప్. 48, 49. అనుష్టుప్
50. లేఖకః.

# పతనం అంచున

శ్రీ జి. భాను

హృదయంలో మూగగా కదులుతున్న ప్రేమలా ప్రవహిస్తున్న కాలువలోని చిరుతరంగాలమీద పడిన ఎలక్ట్రిక్ దీపపుకాంతి దీర్ఘమైన కాంతి లతను ఏర్పరుస్తున్నది.

కాలవగట్టుమీద నల్లని నీడ దుప్పటి కప్పుకొని పిట్టల మూలుగులలో స్తబ్దంగా ఉన్నచెట్టు గుండెలో దిగులున్నప్పటికీ మౌనం వహించిన వ్యక్తిలా ఉన్నది.

నెమ్మదిగాఉన్న మనసును మథనపెట్టే కత్తి వంటి ఆలోచనలా నిశ్శబ్దంగా ప్రవహిస్తున్న కాలువలో ఏదో చేప తళుక్కుమని ఎగిరి మరలా నీళ్ళలో పడింది.

వరండామీద నుంచొని పై పరిసరాన్ని గమనిస్తున్న భాగ్యం మనసులో ఏవేవో అనుభవాలు కలుక్కుమన్నాయి. ఉవ్వెత్తుగా విరుచుకుపడే భావాల తీవ్రతకు కన్నులు మూసుకొన్నది.

పరిమళాలు గాలికి దానం చేస్తున్న ప్రక్కన ఉన్న పొన్నచెట్టు మీదగల పక్షుల కంఠాల్లో దైన్యం కదలాడింది. అవి ఏ శిథిల జీవితానికి అపశ్రుతుల స్వర్గో!

కలలో ఉలిక్కిపడిన పసిపాపల్లాగ ముద్దబంతి పూలు ఆమెనుచూచే కాబోలు తలలూగించాయి! అవి ఏ భావి భాగ్యోదయానికి సూచకాలో !

భాగ్యం కన్నులు తెరిచింది. మనసునకు తాత్కాలిక ఉపశాంతి కల్గించిన రెండు కన్నీటిబొట్లు మెల్లగా జారిపడ్డాయి. అంతలో 'అక్కా!' అనికేక వినిపించింది. లోనికి వెళ్లింది భాగ్యం. మంచంపై పదహారు సంవత్సరాల పిల్ల ఆవలిస్తూ కూర్చున్నది. అందమైన ముఖంమీద అల్లిబిల్లిగా జుట్టుపడి ఒక క్రొత్త అందాన్ని కల్గించింది. విశాలమైన కన్నుల్లో నిద్రాదేవి లాస్యం కనబడుతున్నది. భాగ్యం చెల్లెలి ప్రక్కన కూర్చున్నది.

'ఏ...మ్మా...భారతీ! నిద్రపట్టడం లేదా?' తల నిమురుతూ అడిగింది.

'కొత్తగా ఉందక్కా ఇల్లు...నిద్రసరిగా రావడం లేదు' ఆవలించి అక్క భుజంపైన తలపెట్టింది.

'కొత్తదనానికికూడా...అలవాటు పడాలమ్మా! సర్దుకు పోవాలి...ఎలాగో నిద్రపోవాలి...నా తల్లివి కదూ...నిద్రపో.' వీపు నిమిరింది.

'నువ్వుకూడా నిద్రపో మరి'.

'ఎందుకు నిద్రపోనూ? నీకులా...నిద్ర తొందరగా ఎలాపడుతుందమ్మా నాకు? అయినా నాకు తొందరగా నిద్రపడితే నిద్రకే నామర్దా'—చిన్నగా నవ్వింది.

'పో అక్కా! నువెప్పుడూ ఇంతే. మరీ బయటికెందుకు వెళ్ళావ్?'

'బయటికా? ప్రకృతి ఏమైనా మనస్సుకు ఉపశాంతి ఇస్తుందేమోనని ఆశ! అదీ లేకపోతే జీవితం ఎంత భారం! నీ కెందుకమ్మా ఈ ప్రశ్నలు? నువ్వు నిద్రపో'.

'కొత్తింటిలో ఎలా నిద్రపడుతుందమ్మా... ఎందుకు కొత్తిల్లు మార్చింది?'

'క్రొత్తగా ఉండాలనే భారతీ! నిద్రపో ఇక... నా ముద్దుల చెల్లెలివికదూ! నా వరాలతల్లివి కదూ'. లాలనగా అంది.

'నీ ముద్దుల చెల్లి రాబోతుందిగా. నే నెందు కొలాను.?'. బుంగమూతి పెట్టింది.

'భారతి! ఈ మాట చిన్నక్క వింటే ఊరుకొంటుందా? దానికి నువ్వంటే ఎంత ముద్దు! నేనంటే ఎంత గౌరవం! రేవన్నా వస్తారో లేదో? ఈ రోజు వస్తామన్నారు. రాలేదు. అసలే ఈ బండ్లు ఆలస్యంగా నడుస్తున్నాయి. దారిచూసి కళ్లుకాయలు కాస్తున్నాయి. మూడు సంవత్సరాలైంది చూసి; ఎలా ఉందో నా చెల్లెలు! ఎలాగైనా దాని బెడద తీరిపోయింది. ఏదో కొంతవరకు చదివించాను; ఒక యింటిదాన్ని చేశాను. ఇక నువ్వున్నావు. నిన్నొక అయ్యచేతిలో పెడితే...నా జీవిత లక్ష్యమే సంపూర్తి అవుతుంది... తర్వాత నా బ్రదుకు ఏమైనా ఫర్వాలేదు'. నిట్టూర్పు విడిచింది.

అప్పుడే దగ్గరలో ఏదో పిట్ట భయానకంగా అరచింది. భారతి అక్కను భయంతో కౌగలించుకొన్నది.

'పిట్ట కూతలకే ఉలిక్కిపడితే జీవితంలో ఏం సాధిస్తావమ్మా నిద్రపో. నేను దుప్పటి కప్పుతాను. వెచ్చగా పండుకొని, ప్రొద్దున్నే లేవాలి. చిన్నక్క, బావ తప్పక వస్తారనే అనుకొంటున్నాను' అని ఆప్యాయంగా నుదురుమీద ముద్దుపెట్టుకొని, ప్రక్కన ఉన్నమంచంపై కూర్చున్నది.

ఆలోచనా తరంగాలు మనసుమీద విరుచుకుపడుతున్నాయ్. గత జీవితాన్ని సింహావలోకనం చేసుకుంటే ఒళ్లు గగుర్పొడుస్తున్నది. కానీ గత్యంతరం లేని పరిస్థితులు, పరిస్థితులపైన పెత్తనం వహించిన లోకం, మనసులోని మమతల సంరక్షణం— ఇవన్నీ తన జీవితాన్ని చీకటి గుయ్యారంగా చేశాయి. గాఢతిమిరంలో బీద చుక్కల వెలుతురే పెన్నిధిలాగా తలచిన తనకు వ్యధలేమిటి? రెండు కన్నులైన చెల్లెళ్ల సుఖమే ధ్యేయంగా తలచిన తాను లోకాన్ని చూడలేదు. మనసులో ఓమూల మచ్చ హెచ్చరించినా— 'లక్ష్యం మంచిదైనపుడు, ఏం చేసినప్పటికీ, దైవం కొంతవరకు క్షమించక పోదు' అనే ఊరడింపు హృదయానికి తోడ్పడింది.

ఆ నాడూ, ఈ నాడు ఇవే ఆలోచనలలో సతమతమైన భాగ్యం చివరకు నిద్రాదేవి అదృశ్య హస్తాల్లో కన్నులు మూసుకొన్నది.

తాలూకాలో మూడు గంటలు కొట్టారు.

• • •

తూర్పుదిక్కు కుంకుమ పులుముకొన్నది. పండి, భారంగా, మగతగా ఒరిగిన వరిచేలమీద దూబరలు మందలు మందలుగా పరారుచేస్తూ గోల చేస్తున్నవి. కాలువలోని నీళ్ల పొగలు కక్కుతున్నవి.

పాలవాని కేకవిని, నిద్రలేచిన భాగ్యం వెంటనే పొయ్యి ముట్టించింది. చెల్లెలు, మరిది ఇంకా రాలేదే అన్న ఆలోచన మనసులో సుళ్లు తిరుగుతున్నది. ఇంటి ముందునుండి రిక్షాలు వస్తూ, పోతున్నవి. ఆశగా చూస్తున్నది భాగ్యం. కొద్దిసేపైన తర్వాత ఒక రిక్షా యింటిముందు ఆగింది. రిక్షాలోనుండి దిగిన ఆడమనిషి, మగమనిషి ఇంటిలోనికి దృష్టి సారించారు. పట్టరాని ఆనందంలో భాగ్యంవెళ్ళి 'సత్యా' అని గట్టిగా కౌగలించుకొన్నది. భాగ్యం కన్నుల్లోనుండి ఆనంద బాష్పాలు జాలువారాయి. 'అక్కా!' అని సత్యవతి భాగ్యం కౌగిటిలో కరిగిపోయింది. ఈ సంరంభానికి నిద్రనుండి భారతి లేచివచ్చి 'చిన్నక్కా' అనగానే భాగ్యం కౌగిలినుండి విడిపోయి, సత్యవతి, భారతిని ఎంతో ఆప్యాయంగా దగ్గరకు తీసుకొన్నది. రిక్షావాడు—పెట్టె, బెడ్డింగ్ వరండాలో ఉంచి వెళ్ళాడు.

'ఏం బావా! బాగున్నావా?'. భారతి సిగ్గుతో పరామర్శించింది.

'ఎవరూ? భారతిగారా! ఇప్పుడు జ్ఞాపకానికి వచ్చామన్న మాట. ఓ...బాగా ఉన్నాం...అయినా మనలో చెడిపోయే పదార్థం ఏముంది చెప్పు?'. కృష్ణారావు నవ్వుతూ అన్నాడు.

'మీ మాటలకేంగాని లోపలికి పదండి... మంచు కురుస్తున్నది.' సత్యవతి అన్నది.

'మొక్క మొలవ్వలే నువ్వు' అని ఇంట్లోకి దారితీశాడు కృష్ణారావు.

భారతి బావగారి మాటలకు సంతోషించింది.

భారతిని వెంటబెట్టుకొని సత్యవతి ఇల్లంతా కలయ జూస్తున్నది.

'ఏమండీ! మీ ఆరోగ్యం ఎలా ఉంది? అదివరకటికన్నా తగ్గినట్లున్నారు?' కృష్ణారావు కుర్చీలో కూర్చుని భాగ్యాన్ని ప్రశ్నించాడు.

భాగ్యం గుండె క్షణం ఆగింది. హృదయంపై ఏదో కల్పితభారం కలుక్కుమంది. ముఖంలోకి మనసులోని వ్యాకులభావం కనబడనీయకుండా 'ఫర్వాలేదు' అన్నది.

అంతలోనే సత్యవతి, భారతితో అక్కడకు వచ్చింది. భాగ్యం కాఫీ తేవడానికి వెళ్ళింది.

'అప్పుడున్న ఇంటికన్న బాగుందనుకొంటాను... ఆ యిల్లు స్టేషన్‌కు కొంచెం దగ్గరనుకొంటాను. ఇది కొంచెం దూరం... మొత్తానికి ఇక్కడ ప్రశాంతంగా ఉంది...తలనొప్పిగా ఉన్నదన్నావ్...ఎలా ఉంది?' అని భార్యను అడిగి 'ఏం భారతి! బాగా చదువుతున్నావా? గుంటూరులోగదూ? కాన్వెంటులోవుండి చదువుతున్నావా? గుడ్! ఎన్నిరోజులు సెలవులు?' అని అడిగాడు. భారతి సమాధానం చెప్పేలోగా కాఫీతో భాగ్యం వచ్చింది.

కృష్ణారావు కాఫీ త్రాగి 'దివ్యంగా ఉంది' అని భార్యవంక చూశాడు.

'నాకు ఇట్లా చేతకాదని అక్కా దీని అర్థం... మంచి కాఫీ...మంచి కాఫీ అని ఒకటే గోల' అన్నది సత్యవతి భర్తవైపు చురచుర చూస్తూ.

'నేనన్నానా ఆ మాట? నీ చేతగానితనాన్ని వెల్లడించుకుంటున్నావుగాని...'

'సరే..లెద్దురూ...నా చేతైనట్లు చేస్తున్నాను...' అని మూతి ముడుచుకొన్నది.

'దానికేంలే అమ్మా! కాఫీ బాగా చేయలేకపోవడం ఒక్కటే చేతకానితనం కాదు...లే, స్నానం చేయడానికి...ప్రయాణం బడలికవల్ల నలిగిపోయారు' అన్నది భాగ్యం సత్యవతిని కన్నార చూస్తూ.

సత్యవతి అక్కవెంట వెళ్ళింది. భారతి కృష్ణారావు దగ్గర కూర్చున్నది.

'ఏం భారతి! ఏమిటి విశేషాలు! అరరే...అంత సిగ్గయితే ఎలా? గుంటూరు బాగుంటుందా? ఈ వూరు బాగుంటుందా? అయినా ఒక్కదానివి ఇక్కడ ఏం బాగుంటుందిలే? స్నేహితులు వుంటేగదా ఎక్కడైనా ఉషారుగా ఉండడానికి...సరేగాని మద్రాసు ఇంతవరకు చూడలేదు కదూ? ఎన్నిసార్లు రమ్మన్నా మీరు రాలేదు... ఈ సారి మాతో...రండి... బ్రహ్మాండమైన బిల్డింగ్స్...పెద్ద పెద్ద రోడ్లు... కార్లు... మ్యూజియం...జూ, సముద్రతీరం...ఒకటేమిటి...అంతా దివ్యంగా ఉంటుందనుకో!'

'అక్కడ సినిమా స్టుడియోలు ఉంటాయి కదూ? వెళ్లవచ్చా అక్కడికి'. మెరుస్తున్న కళ్ళతో అడిగింది.

'ఓ యథేచ్ఛగా వెళ్లవచ్చు మనం. డైరెక్టరు తెలిసిన నా స్నేహితుడొకడున్నాడు. ఎప్పుడూ 'వెళ్దాం రారా' అంటాడు. ఎన్నిసార్లు చూడను! చెప్పు'

'నన్ను ఇక్కడే జాయిన్ కమ్మంటున్నది అక్క. దగ్గర ఎవరూ లేకపోతే మనసు బాగుండలేదట...మరి మద్రాసు చూడడం వీలు అవుతుందా?'. నిరాశగా అంది.

'నేను మీ అక్కకు చెబుతానులే భారతీ!... మీయిద్దర్నీ రమ్మంటున్నానుగా...సమస్య ఏముంటుంది? ఎన్నిసార్లు రమ్మని రాసినా ఈ వూరు తప్ప, ఇంకో వూరు పడదు అని మీ అక్క ఉత్తరం వ్రాసింది. ఈ సారి తప్పకుండా మిమ్మల్ని తీసుకువెడతానుగా... ఇక్కడ సినిమాలున్నాయా...మంచివి...' అనగానే సత్యవతి గొంతు వినిపించింది. 'అమ్మా! భారతీ! మీ బావగార్ని స్నానానికి రమ్మను' అని.

స్నానాలు, భోజనాలు అయిన తర్వాత మేను వాల్చి లేవగానే సాయంత్రం మూడైంది. చల్లని గాలులు ప్రారంభం అయినాయి. సూర్యరశ్మిలో తీవ్రత తగ్గింది. కృష్ణారావు లేచి ముఖం కడుక్కొని రాగానే కాఫీ, టిఫిన్ రెడీగా ఉన్నాయి. కాఫీ త్రాగి వరండాలోకి రాగానే సత్యవతి భారతికి తల దువ్వుతున్నది.

'అలంకరణ పొగుతున్నట్లుంది! త్వరగా కానీయాలి... ఈ కాలువగట్టు దృశ్యం బాగున్నట్లుంది. షికారు పోదాం' అని సమాధానంకోసం ఆగకుండా బట్టలు మార్చుకోడానికి ఇంట్లోకి వెళ్లాడు కృష్ణారావు సిద్ధం అయ్యేటప్పటికి సత్యవతి, భారతికూడా సిద్ధం అయ్యారు. బయలుదేరారు. 'తొందరగా రండమ్మా' అని లోపలనుండి భాగ్యం కేక వేసింది. 'అలాగే' అని సమాధానం ఇచ్చారు.

దూరంగా ఎక్కడో పొలాల్లో కాపలాకోసం వేసుకొన్న గుడిసెలోనుండి నెమ్మదిగా పొగ వాతావరణంలో కలియలేక కలుస్తున్నది. పండి, బరువులో ఒరిగిన వరిపొలాలు పరవశంతో పప్పళించిఉంటే ఆనందంలో దేవతలు చల్లిన తెల్లని పూవుల్లాగా ఉన్నాయి ఎగురుతూ కొంగలు.

ఈ పరిసరాల్ని పరిశీలిస్తూ మూడు నాలుగు ఫర్లాంగులు నడిచారు. వెళ్లి పచ్చికపైన కూర్చున్నారు. భారతి కొంచెందూరంగా వెళ్లి రకరకాల పూలూ కోసి రాశి పోస్తున్నది.

'సత్యా! సాధారణంగా నగరాల్లో ఇంత సహజమైన సోయి ఉంటుందా? అక్కడ జనసమూహపు కోలాహలమే విశేషంకాని ఇంత సజీవమైన ప్రకృతి కనబడదు. మగువలా వంపులు సొయలు చిలికిస్తూ సాగిపోతున్న కాలువ, మగువ నడకలు చూచి తల లూగిస్తున్న మగవారిలాగా తుంగపూల త్రుళ్లింత, ఈ సంరంభాన్ని చూసే ధ్వని చేస్తున్నట్లు, రకరకాల పిట్టల అరుపులు, వీటన్నిటికన్న మనస్సుకు తృప్తినిచ్చే పంటచేల కమనీయదృశ్యం, ఎంత బాగుంది ఇక్కడ? మనముండే పదిరోజుల్లో రోజూ వద్దాం. ఏమంటావు?'. భార్య ముఖంవైపు చూశాడు.

'సరే' అంది సత్యవతి ఏమిటో ఆలోచిస్తూ.

'ఏమిటో ఆలోచిస్తున్నావ్'. నెమ్మదిగాఅంటూ, ఆలోచనా భంగిమలోఉన్న అర్ధాంగిని ముద్దు పెట్టుకోబోయాడు.

'ఉష్...భారతి' కళ్లతో సైగ చేసింది. మామూలుగా కూర్చున్నాడు కృష్ణారావు.

'భారతిని మనతోబాటు తీసుకు పోదామండీ. నాకు తోడుగా ఉంటుంది. మీ రేమంటారోనని ఆలోచిస్తున్నాను.'

'ఊఁ... ఇంకా...'

'ఇంకా లేదు...ఏమీలేదు...మీరేమంటారు?,

'నీ ఇష్టం కాదంటానా? కాని మీ అక్క ఒకరే అవుతుంది గదా అని...'

'అయి...తే...'

'ఒకటి: మీ అక్క ఒప్పుకోవాలి. రెండు: భారతిని ఇక్కడే చదువుకోమంటున్నదట. మూడు—మీ అక్క ఆరోగ్యం సరిగాలేదు. కాబట్టి ఈ కారణాలనుబట్టి అసలు మనతో పంపుతుందా? పంపినా పై కారణాల్నిబట్టి ఏం బాగుంటుందీ? అని...'

'ఏం మునిగిపోదులెండి!'. మాటల్లో పరుషత్వం ధ్వనించింది.

భార్యవైపు సాశ్చర్యంగా చూశాడు. ఆమె కన్నుల్లో ఏవోఏవో భావాలు కనబడ్డాయి. ఆ భావాల వెనకాల ఏదో రూపం ఉంటుందని కృష్ణారావు అనుకున్నాడు. మౌనం వహించాడు.

'ఈ రోజు స్టేషన్‌దగ్గర ఏవడో రిక్షావాడు ఇంటిగుర్తు చెప్పగానే ఒకవిధంగా మాట్లాడాడు కదూ...నాకెంత నామోషీ అయిందనుకొన్నారు... మొత్తంమీద నాకేమిటో అనుమానంగా ఉందండీ' భర్త కన్నుల్లోకి చూచినది.

'ఆఁ...మనసు స్థిమితంగా లేనపుడు ఏ మాటలు విన్నా ఏదో వ్యంగ్యార్థం స్ఫురిస్తుంది. అది మనసు స్వభావం. ప్రయాణపు బడలికలో ఎవడో, ఏదో కూశాడని అపార్థాలు కల్పించుకోడం తొందరపాటు. మీ అక్కను గురించిన చెడువిషయం ఎందుకో నేను నమ్మలేను. ఎందుకంటే మన పెళ్లి సంఘటన జ్ఞాపకంవస్తే ఈ విషయాలు పరిగణనకే రావు. ఈ సంగతి నేను అదివరకే చెప్పాను. మళ్లా చెబుతున్నాను. నేను ముందు మీ అక్కనే పెండ్లి చేసుకొందామనుకొన్నాను. కాని మీ అక్క అంగీకరించు

లేదు. 'నాకు టి. బి. లక్షణా లున్నాయ్. నన్ను చేసు కోడంవల్ల ప్రయోజనంలేదు. నా జీవితం ఇక ఇంతే. కాని నాకు ఇద్దరు చెల్లెళ్ళున్నారు. వాళ్ళే నా ప్రాణం. వాళ్ళలో పెద్దపిల్లను చేసుకోండి...నా జీవి తాంతం మిమ్మల్ని పూజిస్తాను' అని ఎంతో దయ నీయంగా ప్రాధేయపడింది. అప్పుడు నాకు నిజంగా మనసు కరిగిపోయింది. స్వార్థాన్ని త్యాగం చేసుకొనే వాళ్ళూ, ఆనందాన్ని ఆహుతి చేసుకొనేవాళ్ళు ఇంకా లోకంలో ఉన్నారనిపించింది. తర్వాత నిన్ను చూశాను. అది వేరే సంగతి. కానీ అప్పటినుండి మీ అక్క అంటే ఒకవిధమైన గౌరవం నాకు. ఎన్నోవిషయాలు, ఆలోచించగలిగినా ఎందుకో మనసు వెనుకంజవేస్తుంది. అందుకనే ఆవిడ విషయం భిన్నంగా ఉన్నదంటే వెంటనే నమ్మలేకపోతున్నాను...అయినా ఎందుకా వృథాఆలోచన నీకు...' అన్నాడు కృష్ణారావు. సత్యవతి కన్నులు తుడుచుకొన్నది.

'భారతీ! బయలుదేరుదామా' అన్నాడు కృష్ణా రావు. ముగ్గురు బయలుదేరారు.

హృదయంలో రేగిన అనుమానాల కీలల్లాగా చీకటితెరలు భూమిని ఆక్రమించుకొంటున్నాయి. శాధా నిట్టూర్పుల్లా చలిగాలులు విజృంభించాయి. అన్యాయాన్ని ఆసరా చూచుకొని మిడిసిపడే సమస్యల్లా చుక్కలు నిక్కి చూస్తున్నాయి.

దాదాపు ఇంటివద్దకు వచ్చాక కృష్ణారావు వెనక్కు తగ్గాడు. సత్యవతి, భారతి ఇంటికి వచ్చారు. వరండా ఎక్కబోతుండగా కొన్నిమాటలు విన్పించాయి.

'ఈసారికిమాత్రం ఒప్పుకోండి భాగ్యంగారు! నా మాటా నిలబడుతుంది; మీకు లాభమూ ఉంటుంది. అవతల మనిషి ఎవరో తెలుసుగా?'

'లేదు నరసింహం! నా మనసు ఎప్పుడో మార్చు కున్నాను. అదివరకులా అనుకోవద్దు. అదంతా పీడకల అనుకొంటున్నాను. నువ్వెళ్ళిపో. ఎప్పుడూ రావద్దు. నీ కాళ్ళు పట్టుకొంటాను. మా వాళ్ళు వస్తారు... దయచేసి వెళ్ళిపో...'. వ్యాకులంగా విన్పించాయి మాటలు.

'చివరిసారిగా అడుగుతున్నాను...... అంతేనా భాగ్యం!'

'ముమ్మాటికి...అంతే!'

'సరే...వస్తా'నని ఆ మనిషి వరండా మెట్ల పైన నిలబడిన భారతిని, సత్యవతిని చూచి ఒక్క క్షణం ఆగి, ఓరచూపుచూసి, ఒకవిధంగా నవ్వి వెళ్ళి పోయాడు. సత్యవతి గుండెలో మంట పుట్టింది ఒక్కొక్క రోమకూపం అగ్నిపర్వతం అయ్యింది. ఊహించిన విషయం జరిగితే కలిగే దిగ్భ్రమలాంటిది ఆవరించింది. భారతి సత్యవతిని చూసి భయపడింది కాని పూర్తిగా అర్థం కాలేదు. ఇద్దరు మౌనంగా వరం డాలో కూర్చీంపై కూర్చున్నారు. ఏదో ఆందోళన, అసహాయత వాళ్ళ మనసుల్లో ఉంది. అంతలో భాగ్యం వరండాలోనికివచ్చి, చెల్లెళ్ళను చూసి అదిరిపడింది.

'అమ్మా! చీకటిలో కూర్చున్నారా? భారతీ! బావగారేరీ?' మామూలుగా మాట్లాడింది. సత్యవతి అనుకొన్న మార్పు గొంతులో కనిపించలేదు.

'అమ్మా! మాట్లాడవేం' సత్యవతి దగ్గరకు వస్తూ అంది.

'ఏం లేదక్కా...' గద్గదికంగా మాటలు వచ్చాయి.

భాగ్యం సత్యవతి తల నిమురుతూ నుంచు కొన్నది. సత్యవతి హృదయంలో క్రోధ సర్పం బుసలు కొడుతున్నది. వాగీశ్వరంవంటి అక్క హస్త స్పర్శ దాన్ని ఉపశమింప జేస్తున్నది. అక్కను నిర్దాక్షిణ్యంగా అడిగివేయాలి. ఎవ రతను? ఏమిటీ సంభాషణ? ఏమిటా మాటల అంతరార్థం? అని. కాని ఎలా? తనను వాత్సల్యంగా పెంచిన అక్క! స్వార్థం చూచుకోని అక్క! తనక్షేమం కాంక్షించే అక్క! అలా చేస్తుందా? అవినీతిగా ప్రవర్తిస్తుందా? ఇంకేమైన విషయాన్ని గురించి మాట్లాడుతున్నదేమో? అని రకరకాల ఆలో చనలు మనసులో వెలుగునీడలైనాయి.

'బయట బాతాఖానీ వేస్తున్నట్లున్నారే?' అని అప్పుడే వచ్చిన మరిదిమాటవిని భాగ్యంలోనికి వెళ్ళింది. కృష్ణారావు వచ్చి స్విచ్ వేశాడు. ముఖకవళికలతో

మార్పు కనిపెట్టి వెంటనే భార్యవద్దకు వచ్చాడు.

'ఏమిటీ...ఇలా ఉన్నావ్' అని కృష్ణారావు భార్య ఫాలభాగంమీద చేయివేశాడు. భర్త చేతిని మృదువుగా స్పృశించింది సత్యవతి చెయ్యి.

సత్యవతికి సరిగా నిద్రపట్టలేదా రాత్రి. భారతికి జరుగుతున్న విషయాలు స్పష్టాస్పష్టంగా అర్థం అవుతున్నాయి. భాగ్యం తన మాటలు, నరసింహం మాటలు చెల్లెళ్లు విన్నారేమోనని లజ్జా భారాలతో క్రుంగిపోయింది. ఆమెకు కలలో పిశాచాలు, వికృతాకారాలు, దేవతాస్వరూపాలు కన్పించాయి. భాగ్యం అపుడు భారతిని నిద్రలో కౌగలించుకొన్నది.

తెల్లవారింది. సత్యవతి ఆలస్యంగా నిద్ర లేచింది. అప్పటికే కృష్ణారావు ముఖం కడుక్కొంటు బయట కూర్చున్నాడు. సత్యవతి ముఖం తుడుచుకొంటూ బయటకు వెళ్లింది. భర్త నవ్వాడు.

'లేచిన వాళ్లు...నన్ను లేపకపోయారూ?' చిరుకోపం ప్రదర్శించింది.

'అవును. వందిమాగధులొచ్చి స్తోత్ర పాఠం చేయవలసింది. పొరపాటైంది. కాని ఒంట్లో బాగా లేని కారణంచేత నిద్రపట్టలేదేమోనని...'

'నాకు నిద్రపట్టలేదని తమరికెలా తెలుసు?'

'తమ ముఖారవిందం చూస్తుంటే తెలియడంలా, పూబోణీ!'

'అంతేగదా!' అని భర్తవద్దకువచ్చి కనబడుతున్న పరిసరాల్ని చూచింది.

'చూశారా! కాలువలోని నీళ్లు పొగలు కక్కుతున్నాయి. నిద్రగన్నేరుచెట్టునుండి నీటిబొట్లు వర్షంలాగ రాలుతున్నాయి. బంతిపూలు ఎంత బాగా విచ్చాయి. భారతీ! విచ్చిన పూలు కోసుకురా' అని ఉత్సాహంగా మాట్లాడుతున్నది. కృష్ణారావు భార్య ముఖాన్ని చిరునవ్వుతో చూస్తున్నాడు. భారతి పూలు కోస్తున్నది అంతలో భాగ్యం బయటకువచ్చి 'అమ్మా! సత్యా! తొందరగా ముఖం కడుక్కో. కాఫీ చల్లారిపోతుంది' అన్నది.

'ఇదిగో...ఒక్క నిముషం అక్కా!' అన్నది మార్దవంగా. ఆ మాటల్లో ఎటువంటి బాధగాని, వ్యధగాని కన్పించలేదు. భాగ్యం మనసులో ఆందోళనా కెరటాలు కొంచెం ఉపశమించాయి.

మధ్యాహ్నం భోజనాలైనతర్వాత భారతి, భాగ్యం షాపింగ్‌కు బయలుదేరారు. సత్యవతిని రమ్మన్నారుగాని తలనొప్పిగా ఉన్నదని ఆమె వెళ్లలేదు. కృష్ణారావు ఎవరితోనో మాట్లాడడానికని వెళ్లాడు. సత్యవతికి ఆ ఏకాంతంలో గడచినరోజు ఘట్టం జ్ఞాపకానికి వచ్చింది. అంతకుముందు భర్త చెప్పినమాటలు దివ్యోపదేశంలాగా అనిపించాయి. మనసు మంచి, చెడు భావాల ద్వంద్వంలో చలిస్తున్నది. అక్క చీకటిలో, అగాధప్రవాహంలో కొట్టుకుపోయినట్లు, ఏవేవో పిచ్చిపిచ్చి ఊహలు కల్గుతున్నాయి. అయినా అక్క 'మారిపోయానంటున్నదికదా?' ఎందుకీ ఆలోచనా ప్రయాస?' అని, ఓదార్పు ఒకవైపునుండి. మొత్తానికి మనసులో రకరకాల భావాల యుద్ధం జరుగుతోంది సత్యవతికి.

అంతలో 'భాగ్యం...గారు' అని పిల్లవాడి గొంతు విన్పించింది. ఉలిక్కిపడి లేచిన సత్యవతి బయటకు రాగానే పదేళ్ల కుర్రవాడు వచ్చాడు. సత్యవతికి ఒళ్లు మండింది మాట్లాడలేదు. ఆమె మాట్లాడకముందే పిల్లవాడు మాట్లాడాడు.

'మీరేనా భాగ్యం...గారంటే?'

'కాదు...అవును...ఎందుకు? ఏం కావాలి?' కాఠిన్యం మాటల్లో కనబడింది.

ఈ మాటలకు కుర్రవాడు జంకాడు. 'ఆఁ... మరే...మరే...ఇదిగో ఈ ఉత్తరాన్నే...మోహన్‌రావుగారు మీకిమ్మన్నారు...సాయంత్రం పార్కుకాడికి రమ్మన్నారు' అని గబగబచెప్పి ఉత్తరాన్ని ఇచ్చి పరుగెత్తాడు బయటకు.

యాంత్రికంగా ఆ ఉత్తరాన్ని అందుకొన్నది. మనస్సంతా చీకాకైపోయింది. దెబ్బమీదదెబ్బ పడితే ఎలా ఉంటుందో అలా ఉంది ఇటువంటి సంఘటనపైన సంఘటన. ఉత్తరాన్నిగురించి అసంఖ్యాకమైన

ఆలోచనలు కల్గాయి; అంతులేని ప్రశ్నలు ఉదయించాయి.

'భగవంతుడా! నేను శంకించినట్లు కాకూడదు.. అక్క...అటువంటిది కాకూడదు...కాకూడదు' మనసులో కోరుకొన్నది. ఉత్తరాన్ని అటు, ఇటు త్రిప్పి చూచింది. మొదట ఏమైనా ఉత్తరాన్ని చదవకూడదనుకొన్నది. కాని దీనిలో ఏముందోననే బలీయమైన చదవాలనే వాంఛను అణచుకోలేకపోయింది. గుండె వేగంగా స్పందించడం మొదలుపెట్టింది. చదవాలనే మానసిక బలహీనత ఇనుమడించింది. గదిలోకి వెళ్ళి తలుపువేసుకొని, వణుకుతున్న చేతులలో ఉత్తరపు మడతలు విప్పుతున్నది. ఆ విప్పడం సత్యవతికి అక్క గుండెల పొరలు విడదీసినట్లుగా ఉంది. మహాపాపం చేస్తున్నాననిపించింది. ఆ ఉత్తరంలో ఇలా ఉంది.

ఒకనాడు గుండెకు దాపై, దూరమైన దయాహీనురాలైన భాగ్యానికి ఇంకా మరువలేని మోహనరావు.

నన్ను బహుశా మరచిపోయి ఉండవు. అంత మాత్రంచేత నాకు సంతోషం కలుగదు. ఆ నాడు నన్ను త్యజీకరించావు. కాదంటే మోసం చేశావు. అందుకే ఈ నాడు పతనం చెందావు. సుందరకేశపాశాల్లో అలంకరింపబడవలసిన కన్నెగులాబి దుమ్ములో, ధూళిలో కఠోర పాదాల క్రింద, కసుగంది రేకులు విడిపోయినట్లు నీ జీవితాన్ని ధ్వంసం చేసుకొన్నావు. తప్పు నీదే! ప్రశ్నించుకో హృదయాన్ని.

ఆ నాడు—వర్షం రోజు—అనాథవై ఆక్రోశిస్తున్నప్పుడు, కష్టాల పొలిమేరల్లో తారట్లాడుతున్నపుడు నా మాటలు నీ చెవికెక్కలేదు. అక్కడనుండి మాయమైయావు నీ చెల్లెళ్ళతో. కాని బుగ్గి అయ్యావు; పతనం అయ్యావు; జీవితపు తలుపులు తెరచియుగా ఆ వాకిలిని ప్రవేశింపలేక ఎడారి పథంలో జీవితాన్ని వమ్ము చేసుకొన్నావు. అవకాశం సద్వినియోగం చేసుకోలేని అధమురాలివి. ఏ భీకర శక్తి నిన్ని అధోమార్గానికి లాగిందో కాని ఆ నాడు నా మాట వినివుంటే జీవితం ఇంకొక విధంగా ఉండేదేమో!?

అయిందేదో అయిపోయింది. పొంపిక జీవితంలో నీ బ్రతుకు భ్రష్టమైపోయింది. ఈ విషయం నేను విన్నప్పుడు ఎంత మధనపడ్డానో ఆ పరమాత్ముడికే తెలుసు. ఇలా ఎందుకయ్యావు భాగ్యం? ఏ వెలుగులకోసం శిథిలమయ్యావు నీవు? ఏ భాగ్యంకోసం ఈ దౌర్భాగ్యాన్ని వరించావు? నీ చెల్లెళ్ళైనా గౌరవంగా జీవితాన్ని గడుపుతున్నారా? అప్పుడు పసిపిల్లలు పాపం! నీ జీవితపు మూసలోనే ప్రతి[illegible]లయ్యారా?

ఈ భూమి అనంతం. ఇంకా అవకాశా[illegible] పోలేదు. నువ్వు అర్థం చేసుకోగలవు.

ఎంతో ప్రయత్నంమీద నీ విషయం తెలుసుకోగల్గాను. వెంటనే వద్దామనుకున్నాను. కాని మర్యాద కాదనిపించింది. నీ ఉద్దేశ్యం తెలుసుకొందామని ఈ ఉత్తరం. కాబట్టి నన్ను కలుసుకోవాలనే కోరిక ఉంటే పార్కువద్దకు రా. బలవంతం లేదు.

ఇట్లు నీ శ్రేయోభిలాషి,
మోహనరావు.

చదివి కుప్పగా కూలిపోయింది సత్యవతి. కన్నీళ్లు, బాధ, నిస్పృహలో—మనసులో జిలుగు జిలుగుగా గడచిన జీవిత దృశ్యాలు...కష్టాలు, కడగండ్లు, దైన్యాల స్థానంలో...మార్పు. తనకు హాస్టల్ జీవితం, తెలిసీ తెలియని అక్క జీవితం...తన పెండ్లి...

కానీ ఈ నాడు అవమానం...అక్క పతివిహీన.. ఆమె అనుచిత కార్యాన్ని ఎట్లా సమర్థించేది? తెలిసిన తర్వాత ఎలా? నేను అక్కను క్షమించలేను... నేను దూరంగా పోగలను...అక్కముఖం చూడలేను... నాలో అసహ్యాన్ని దాచుకోలేను...ప్రయాణానికి సిద్ధమైంది సత్యవతి.

భారతి, భాగ్యం వచ్చేటప్పటికి ఆలోచనలలో వివశమై కూర్చున్నది సత్యవతి. అప్పుడు భారతి 'చిన్నక్కా! నీకు అక్క ఎంతమంచి సిల్కుచీర కొందనుకొన్నావు. చూడక్కా! ఎంత బాగుందో!' అని పార్శిల్ యివ్వబోయిందికాని సత్యవతి ఎంతమాత్రం కుతూహలం ప్రకటించలేదు.

'సత్యా! మరదిగారు రాలేదనా ఈ కోపం, చిరాకు?'. భాగ్యం అన్నది.

'అందుకే కోపం, చిరాకు ఉండాలా?' విరుసుగా అంది సత్యవతి.

'నాకేం తెలుసమ్మా మరి...ఎందు కలా ఉన్నావ్?' బుజ్జగింపుగా అడిగింది.

'ఏమీ జరగలేదు...జరగదు. మేమీ రోజే ప్రయాణమౌతున్నాం...వారి కేదో అర్జంటుగా పని వుందట...ఇదిగో నీ కివ్వమని ఎవరో ఉత్తరం ఇచ్చారు'. ఉత్తరం అందించింది. అందామనుకొన్న మాటలన్నీ నోటిలోనే ఉండిపోయాయి.

భాగ్యం ఉత్తరం అందుకొని ఇంట్లోకి వెళ్ళింది. సత్యవతికి, భారతికి అక్క ముఖంలో వర్ణింపరాని ఆవేదన కనబడింది. వారిద్దరూ మూగగా, పిచ్చిగా ఒకరిని ఒకరు చూసుకొన్నారు.

అంతలో కృష్ణారావు ఈల వేసుకుంటూ వచ్చాడు. సత్యవతి ముందుకువెళ్ళి 'మనం వెళ్ళిపోదా మండి'. ఏడుస్తూ అన్నది.

'ఏమిటి నువ్వంటున్నది'.

'మనం వెళ్ళిపోదాం...ఒక్కనిముషం కూడా ఇక్కడ వుండలేను.'

'అసలేం జరిగింది? ఏమిటీ తొందర?'

'అన్నీ తర్వాత చెబుతాను...ముందు బయలు దేరండి'.

'నీకేమైనా పిచ్చా ఏమిటి? ఇప్పుడు బయలు దేరితే మీ అక్క బాధపడుతుందనే ఆలోచన లేకుండా...ఇంత తొందర పనికిరాదు...'

'అక్క బాధపడటంకాదు; అక్కను గురించే ఇంత బాధ అనుభవించడం...నేను ఇక్కడ ఒక్క క్షణం ఉండలేను...వెళదాం పదండి...లేకపోతే...మీ ఎదుట చచ్చిపోతాను...'

'ఆఁ...' అన్నాడు అమితాశ్చర్యంగా కృష్ణారావు. రెండు నిముషాలు ఆలోచించాడు. ఏమి ఆలోచించాడో ఏమోకాని తాపీగా ఇట్లా అన్నాడు:

'సరే! నీ మాట ప్రకారం వెడదాం...కానీ తర్వాత విచారిస్తే లాభంలేదు. ఆడదాని హృదయం అనుమానాలపుట్ట. కొన్నిసమయాల్లో వారి గురి నిజం కావచ్చు; కాకపోవచ్చు. పోనీ ఆ సంగతెందుకు గానీ ఒకవేళ నీకు బాధ కల్గించే విషయం ఎందుకు జరిగిందో, ఎందుకు జరగవలసివచ్చిందో, దాన్లో నీ ప్రమేయం ఏమన్నా ఉందో లేదో అవేది కూడా ఆలోచించి నిర్ణయానికి రావాలి. అందుకే దెబ్బకన్నా మాట ప్రమాదకరమైంది అంటారు పెద్దలు. కాబట్టి ఇంకోసారి ఆలోచించు. కాదంటావా? ప్రయాణం కట్టు.' సత్యవతి కన్నీరు తుడుచుకొన్నది. సామానులు సర్దింది.

భారతికి అంతా అయోమయంగా ఉంది. ఆ లేత హృదయానికి పూర్తిగా విషయాలు అర్థం కావడం లేదు. ఆమెకు అర్థమైందల్లా ఒక్క కన్నీరు కార్చడమే!

భాగ్యం ఏమీ మాట్లాడలేదు. మాట్లాడ డానికి ప్రయత్నించనూలేదు. ఆమె ఆలోచన, అనుభూతులు, మమతలు అన్నీ మూకీభావం వహించాయి.

కృష్ణారావు భాగ్యం గదివద్దకువెళ్ళి 'మేము ఒస్తామండి...అనుకోని విధంగా వెళ్ళవలసి వచ్చినందుకు బాధపడుతున్నాను. మానవులందరూ పరిస్థితులకు బానిసలని మీకు తెలుసు! మీ కర్తవ్యం ఎలా నెరవేర్చారో నా కర్తవ్యం అలానే నెరవేరుస్తున్నాను...వస్తాం' అన్నాడు.

కన్నీరు ప్రవిస్తున్న కొద్దీ భాగ్యం గుండె పాషాణమైంది. ఆమె మాట్లాడలేదు.

భారతిని కన్నారా చూసి సత్యవతి బయలు దేరింది. తన హృదయ భారాన్ని తగ్గించుకొని, అక్క హృదయంలో భారం హెచ్చించి, ప్రళయం రగిల్చి కదిలింది. దూరమైపోయారు దంపతులు.

బయట వరండాలో కన్నీటితో భారతి. లోపల, గుండె లోపల భరింపరాని బాధ తొలుస్తూవుండగా నిశ్చేష్టయైన భాగ్యం. ఆమె మనసులాగే చేతిలోని ఉత్తరం ముక్కలు, ముక్కలై ఉంది. కమలలో

నుండి జారిన కన్నీటిలాగే ఆమె మనసులోని ఆలోచనలకు కళ్ళెం పోయింది. ఆవేశంతో ఆమెలోని నరానరాలు వణికినట్లుగా ఆమెలోని వాత్సల్య వీణా తంత్రులు పడలాయి. ఆమె మెదడు పొరల తెరపై గడచిన జీవిత సన్నివేశపు చిత్రాలు మనసు కన్నులకు కనబడుతున్నాయి.

...తల్లిదండ్రులులేక అనాథయై చెల్లెళ్ళతో అష్టకష్టాలుపడటం. ఎందరో మనుష్యులు తనను కామించడం, వారి పాశవిక శక్తులనుండి ఎలాగో బయటపడటం...

...ఒక వర్షంరోజు...తడిసిపోయిన పూరింట్లో కామపు పొరలతో ప్రేమించినట్లు నటించే రకరకాల రుచులు మరిగిన మోహనరావు తెచ్చిపెట్టుకొన్న పరివేదన...అతని మాటల్లో చెల్లెళ్లను గురించిన ప్రసక్తి ఏ మాత్రం లేకపోవడం కారణంగా అక్కడ నుండి మాయమై లోకంమీద పడడం...

...బతుకుతెరువుకోసం, ఏ పనిచేసినప్పటికీ అజమాయిషీచేసే వాళ్ల కళ్లలో కోరలు విప్పిన కామాన్నిచూసి, దానితోబాటు తనలో రగుల్కొం టున్న అర్థంకాని తపనకు దాసోహం, జీవన పోరా టాన్ని ఎదుర్కోడానికి జీవితం మారురూపు ధరించడం.

కాని తన భ్రష్ట జీవితానికి దూరంగా చెల్లె ళ్ళకు ఉన్నత సంస్కారం అబ్బేటట్లు ఏర్పాటు చేయడం...తాను పతనమైనా వారి అభివృద్ధికోరి వారే తన రెండు కన్నుల్లాగా అనుకొని తనఉనికి మాత్రం అతి రహస్యంగా ఉంచటం...

...సత్యవతి పెండ్లి ప్రయత్నం...మళ్లా సమ స్యలు...తనను పెండ్లిచేసుకోడానికి సిద్ధమైన కృష్ణా రావుకు తాను టి. బి. పేషెంటుననిచెప్పి, ఆ విధంగా నటించి, సత్యవతి పెండ్లిచేసి సగంభారం వదిలించుకొని తృప్తిపడటం...

...తర్వాత బ్రదుకుమీద అసహ్యంతో తనకు తానే సంస్కరించుకొని సరిక్రొత్త జీవితాన్ని ప్రారం భించడం...ఇంతకాలానికి మోహనరావు అక్కసుతో అసూ యతో, అతిశయోక్తులతో వ్రాసిన ఉత్తరం సత్యవతి చేతుల్లో పడడం...గోప్యమైన తన విషయం బయట పడటం...

...సత్యవతి...ఒక్కసానుభూతివాక్యంలేకుండా... తా నేపరిస్థితుల్లో అట్లా ప్రవర్తించవలసివచ్చిందో తెలుసుకోకుండా, కనీసం పెంచిన మమకారాన్ని లక్ష్యం చేయకుండా, పైపెచ్చు కర్కశంగా మాట్లాడి... భర్తతో వెళ్లిపోవడం...మొదలైన విషమఘట్టాలు భాగ్యం మనసులో.

ఆమె హృదయం వాదోపవాదాల సంగ్రామ రంగం అయింది.

—నా జీవితాన్ని వమ్ముచేసుకొని నా రెండు కన్నులవంటి చెల్లెళ్ళ సుఖం కాంక్షించాను. ఒకదానికి పెండ్లిచేశాను. ఇప్పుడు నా కథ వేరైంది. దానికి ఆలోచన, సానుభూతి, వివేకం లేకుండా నన్ను కేవలం కులటగా ఎంచుకొని నా మనసును క్షోభపెట్టి పోయింది. నేను కోరింది దాని సుఖం, క్షేమం మాత్రమేనని, అదే నా జీవితానికి సంతృప్తి అనే సంగతి అది ఆలోచించలేదు. కానీ...ఇప్పుడు నా ఆశాతంతువు తెగింది. నా జీవిత లక్ష్యమే ధ్వంసమయింది. సత్యవతి...హూఁ...అభిమానురాలు...నన్నవమానించి, తన్నవమానించుకొంది......ఏమైనా నా ఒక కన్ను పోయింది...ఏంచేయాలి నేను?

ఇప్పుడు...ఇక మిగిలింది...ఇంకొక్క కన్ను... భారతి...పసిపిల్ల...ఇది నన్ను గౌరవిస్తుందా?... నమ్మకం ఏమిటి? దాని చెల్లెలు ఇది! పెండ్లిచేసి సంసారపక్షంగా ఉంచినప్పటికీ అది శ్రీమంతగౌరవం చూపలేదు; కృతజ్ఞత ... కాదు. ఒక్క సానుభూతి వాక్యమైనా పలకలేదు. ఇదిమాత్రం ఇస్తుందా? ఏమో! మనసుల్ని ఎవరు చదువగలరు? ఇది దానిలా చేస్తే నా జీవితం ఏంకాను? రెండు కన్నులు పోతే ప్రాణం ఏంచేసుకోను? ఇక ఏ వెలుగు నా నిస్సారమైన అంధజీవితానికి ప్రకాశం ఇస్తుంది? లోకంలో నా మనుగడకు అర్థమేమిటి? నా ఉనికికి సార్థకత ఏమిటి??

నా జీవితాన్ని సంస్కరించుకొన్నాను ప్రస్తుతం.. ఇప్పటికే కొంత బయటపడిన నా చరిత్ర ఎప్పుడో ఒకప్పుడు స్పష్టంగా తెలియక తప్పదు. అప్పుడు దీనికి ఇప్పటి ప్రేమ, వాత్సల్యం, ఆదరణ ఉంటాయా? దీని అక్క ఆలోచించలేదే ఒక్కక్షణం

అయినా నన్నుగురించి. ఇది మాత్రం? కాబట్టి... కాబట్టి...దీన్నికూడ...నాలాగే...తయారుచేస్తే!!?... ఈ మాట అనుకోగానే నరనాడులు ఆవిపిపోయాయి. క్షణం సేపు గుండెలో రక్తం స్తంభించింది. శరీరం గగుర్పొడిచింది. ఇంత పతనమా? ఇంత అమానుషమా? అని మనసు ఘోషించినా కశివల్ల అంతరాత్మ ఆవేదనకు జోలపాడింది. అది స్వార్థమో! అవివారమో! గత్యంతరం లేకపోవడమో! ఒకవిధమైన సంతృప్తి!

వెంటనే భాగ్యం గుండెల్లో ఏదో శక్తి విజృంభించింది. ఆలోచనలకు మబ్బుపట్టింది. 'భారతీ!' కఠినంగా పిలుద్దామనుకొని పిలిచింది. అంత కాఠిన్యం లేదనుకొన్నదో ఏమో 'భారతీ! లోపలకు రా. అలంకరించుకో...' సాధ్యమైనంత క్రూరత్వం తెచ్చిపెట్టుకొని తలుపు తెరచింది. హృదయ కుహరంలో ఒక మూలనుండి మాత్రమే ధ్వనించిన ఆక్రందన అది. ఆమె గొంతు ఆమెకే క్రొత్తగా ఉన్నది.

అక్క ఎదుట ఎన్నడూ ఏడ్వని భారతి వచ్చి కన్నీళ్ళతో ఎదురుగా నిలబడివున్నది. ఉగ్రురాలైన తల్లిని చూసి భయపడిన పసిపిల్లలాగా ఉన్నది; రాక్షసుని చూసి గుండె పగిలిన ప్రాణిలాగా ఉన్నది. భారతికి విషయం అర్థమైనట్లున్నది. అందుకు కన్నీరుతో నిండిన కన్నులు సాక్ష్యం.

'భారతీ!' అదలించింది భాగ్యం. 'అక్కా!' అని భారతి అక్కను వాటేసుకొన్నది. భారతి కన్నీరు భాగ్యం చెంపల్ని, భుజాల్ని తడిపాయి. భారతి అమాయకపు కన్నీరు భాగ్యం గుండెలోని క్రోధాన్ని ఉపశమింపజేసింది. ఆమె మనసులో అనురాగపు మెరుపులు, వాత్సల్య ప్రవాహాలు...హృదయంలో కోపపు మురికి పోగా ఇనుమడించిన మమతాకాంతి! భారతి మూగ కన్నీరు భాగ్యం ఉద్దేశాన్నే క్షాళితం చేసిందో? మరల్చుకోలేని మమత జ్ఞానోపదేశం చేసిందో? అగాధంలో పడబోయే జీవికి ఆశాపాశమే దొరికిందో!?

మారిన భాగ్యం మనసు మాఠింది! భాగ్యం మనిషే! తాము నాశనం అయినా తమ సంతతి సురక్షితంగా ఉండాలని కాంక్షించే చెట్టుచేమా, పుట్టాపురుగుకన్నా, జంతువులకన్నా భాగ్యం క్షుద్రజీవికాదు.

'అమ్మా! భారతీ! నిన్ను నాలా నాశనం చేయను తల్లీ! నువ్వు నా ప్రాణంలో ప్రాణానివి... నా చూపులో చూపువి...నువ్వు బాగా...చదువుకొని... హాయిగా...ఆనందంగా జీవితం గడపాలి...మనం... ఎక్కడికన్నా...దూ...రంగా...వెళ్ళిపోదాం...నన్ను... క్షమించు...అమ్మా...' అని పిచ్చిగా, గోముగా, ఆవేశంతో భారతి ముఖాన్ని ముద్దులతో నింపింది.

'అక్కా!' అని భాగ్యం పాదాలపై పడిపోయింది. భాగ్యం నిర్మలమైన కన్నీరు భారతి తలను అభిషేకం చేసింది.

వారి రెండు హృదయాల స్పందనం మినహా ఆ గదంతా మూగ నిశ్శబ్దంతో తపస్సు చేసింది.

---



# తెలుఁగు నిఘంటువులలో దేశ్యపదములపై చిన్నచూపు

శ్రీ భాగవతము రామారావు

ఆంధ్రభాషలో శబ్దరత్నాకరమునకుఁ బూర్వమును, తరువాతను నకారాది నిఘంటువులు బహుళముగా బయలుదేరినవి, బయలుదేరుచున్నవి. కాని వీటిలో నేదియు సర్వసంపూర్ణముగా నున్నట్లు లేదు.

నిఘంటువులో ప్రతి పదమునకు సంపూర్ణమైన వివృతి యవసరము. మన నిఘంటుకారులు పదములకు ప్రాచీనకావ్యములనుండి ప్రయోగములఁ జూపెట్టుటతో సరిపుచ్చినారు. అచ్చతెనుఁగు పదములలో ఆయాప్రయోగములనుబట్టియే యర్థనిర్ణయము జరిగినది. దానికి ప్రాచీనకాలములో వ్యవహారమునందుండియు నిప్పుడు వ్యవహారములో లుప్తములైన పదము లధికము లగుట హేతువు. అందువలన దోసఁగులుకూడ దొరలినవి.

ఇఁక వృక్షములు, జంతువులు మున్నగువాటి నామములు వచ్చినప్పుడు చాలవఱకు వేఱొక పర్యాయము నిచ్చుటతో తృప్తిఁజెందినారు. అట్లుగాక ప్రతివస్తువుయొక్క అవగాహన కవసరమగునంత సూక్ష్మవివరము నిచ్చుటగూడ అవసరము.

ఇప్పుడు నేను ముఖ్యముగాఁ జెప్పదలచినది దేశ్యపదముల గురించి. తెలుఁగుదేశములో నీనాడు వ్యవహారములోనుండి గ్రంథప్రయోగములు మృగ్యములుగానున్న పదము లనేకములు. వానిలో నిఘంటువులలోఁ జేరినవి తక్కువ. అట్లే కొన్నికొన్ని దేశ్యపదములు గ్రంథప్రయోగములఁ గలిగియు, సామాన్య వ్యవహారములో లేకున్నను కొన్నికొన్ని ప్రాంతములందు వ్యవహారములో నున్నవి. అట్టిచోట్ల నా పదము లాయాప్రాంతములందు నిత్యవ్యవహారములో నున్నట్లు దెలుపుటకూడ ఆవశ్యకము. ఇది ఈనాటి భాషా పరిస్థితినిఁబట్టి అత్యంతావశ్యకము. ఈనాడు రచనలలో గ్రాంథికమైనను, వ్యావహారికమైనను, సర్కారు ప్రాంతపు పదజాలము, వ్యావహారికమును అధికవ్యాప్తిలోనికి వచ్చినవి. ఈ ప్రాంతములోనున్న దేశ్యపదములే ఇతరప్రాంతములలోఁగూడ, వారి ఆర్థిక విద్యారంగములలోని ఆధిక్యమువల్ల వ్యాపించుచున్నవి కాగా ఇతర ప్రాంతములలో— ముఖ్యముగా పల్లెటూళ్లలో నివసించు రైతులు మున్నగువారి వ్యవహారములోని పదము లెన్నో లోపించిపోవుచున్నవి. ఇట్టివి తెలంగాణా ప్రాంతమునందు అధికముగా గలవు.

అట్లే ఆయావృత్తులలోఁగూడ పెక్కుపదములు—వస్తువులు, యంత్రములు, పనిముట్లు మున్నగువాటిని - గలవు. ఈ పదముల కొఱఁత ఎకాడమీవారి మాండలికవృత్తి పదకోశములవల్ల తీరగలదు. ఎకాడమీ వారిట్లే ఆయామండలములలోని దేశ్యపదముల సంగ్రహణముగూడ చేసిన బాగుండును.

ఇంతవఱకువచ్చిన నిఘంటువులలో దేశ్యపదములు లేవనిగాదు. ప్రయోగములు మృగ్యములుగా నున్నవి, వ్యవహారములో నున్నవియునగు దేశ్యపదములు నున్నవి. కాని పైన చెప్పినట్లు ఆ పదములు పూర్వపు మదరాసు రాష్ట్రములోని ఆంధ్రప్రాంతమునకు మాత్రమే పరిమితములైనవి. వాని విషయములోను ప్రత్యేక శ్రద్ధ వహించినట్లు కనపడదు. శబ్దరత్నాకరము వీనికి నాసక్తిఁ జూపెట్టలేదు. వావిళ్ల నిఘంటువుయొక్క పీఠికలో బులుసు వేంకటేశ్వరులు ఇట్లు వ్రాసినారు.

'(ఆంధ్ర పదపారిజాతము—ఓగిరాల జగన్నాథకవి, గురజాడ రామమూర్తిగారు.) ఇం దకారాది

క్రమమున నెన్నియో యాంధ్రపదముల కర్థములు, నర్థాంతరములు చూపఁబడినవి. నేఁడు మఱుఁగుపడిన దేశ్యపదములిం దెన్నియో గలవు.' నేను ఆంధ్రపద పారిజాతమునుఁ జూచుట తటస్థించలేదు: ఐనను దానిలో తెలంగాణప్రాంతపు దేశ్యపదము లున్నవని తలఁచను. అసలు ఆ కాలములోనేమి, ఈనాటి ఆంధ్ర ప్రదేశ రాష్ట్ర సమవతరణానంతరమేమి తెలంగాణము లోని భాషా స్థితిగతుల గమనించుటలేదు. శబ్దరత్నా కరమున కనుబంధములు జేర్చి ప్రకటించిన విమర్శ కాగ్రేసరులు, నాకు గురుతుల్యులు శ్రీ విడుదవోలు వేంకటరావుగారుకూడ ఈ విషయమై ప్రస్తావించ లేదు.

నేను ప్రస్తుతము మెదకుజిల్లాలో కొంతకాల ముగా నీ దృష్టితో సంగ్రహణ మొనర్చిన కొన్ని పదముల నిందు వివరించుచున్నాను. ఇది ప్రతీకగా సాహిత్యసేవాధురంధరులుఁ పండితులు కృషి సలుప గలరని ఆశించుచున్నాను.

వీనిలోఁ గొన్నిపదములు ప్రసిద్ధములు. కాని అవి అంతటను వ్యవహారములో లేనందువల్ల, నీ ప్రాంతము నందు వ్యవహారములో నున్నవని తెలుపుటకుఁ జేర్చి నాను. కొన్నిపదముల మూలమేమిటో, నాకు తెలియ లేదు. వ్యవహారమునన్నున్న ప్రయోగము లుదాహరించి నాను. పండితులు పరిష్కరించెదరుగాక.

సకలాంధ్రమునందరి వ్యావహారికములతో, పలుకు బడులతో పరిచయము నిఘంటుకర్తలకు లేనందు వలన కొన్నికొన్ని దేశ్యపదముల యర్థనిర్ణయములో లోపములు రావచ్చును. కావున నిట్టి కృషి సల్పుట ప్రయోజనకరమని భావించెదను. పల్లెటూళ్లలోని వాడుకపదములఁ బరిశీలించినప్పుడుఁ పైకి సామాన్యులకు నపభ్రంశములుగా గనబడినను స్వచ్ఛమైన పద ములో, వాటికి కొద్దిగా వికృతములో యగునవి చాల గలవు.

ఇక అన్యదేశ్యముల సంగతి. అన్నిమండల ములలోను అన్యదేశ్యములు వాడుకలో నున్నవి. తెలం గాణా ప్రాంతమునందు వాడుకలోనున్న అన్యదేశ్యములు కూడ గ్రంథస్థములగుటకుఁ బ్రయత్నము జరుగలేదు. పూర్వపు టాంధ్రరాష్ట్రములోను హిందీ పదములు బహుళముగా ప్రచారములో నున్నవి. 'రోజు, రాజీ నామా, జమ, ఖర్చు, మామూలు, పంజాయిషీ, అమలు, ఆఖరు, కులాసా, కబురు,' మున్నగునవెన్నో నిఘంటువులలోఁ జేర్పఁబడినవి. బహుకాల ప్రయోగము తరువాత నివి దేశ్యపదములుగాఁ బరిగ ణింపఁబడు ప్రమాదమును గలదు. బారసాల యను నది శబ్దరత్నాకరమున ప్రాకృతసమమును, సంస్కృత ప్రాకృతభవమునగు శబ్దముగాఁ జెప్పఁబడి నది. కాని ఉర్దూలోని 'బారహీసాల' 'పండ్రెండవ సంవత్సరమునకు సంబంధించిన' అను నర్థముగల పదము మూలమేమో చింత్యము. అట్లే అమ్మాయి అనునది తద్భవముగా పేర్కొనఁబడినది. మూల మేమిటో కాని మహారాష్ట్రములో 'ఆయి' అనగా తల్లి. పూర్వపు హైదరాబాదు రాష్ట్రములో మహా రాష్ట్రుల పలుకుఁబడి ఎక్కువగా నుండెడిది. అందువలన గౌరవార్థముగా నీ పదము తెలుగువారి వాడుకలోఁ జేరినది. ఇప్పటికిని సరిహద్దుప్రాంతమున 'చిన్నమ్మ, పెద్దమ్మ' అనుటకు 'చిన్నాయి, పెద్దాయి' అందరు. గౌరవార్థముగను 'అత్తాయి' ఇత్యాదులందు గలదు. దత్తమండలములు దత్తములైన తరువాత నట మహారాష్ట్ర సంపర్కము తగ్గి ఈ 'ఆయి' ఛాయలు 'అమ్మాయి, బాబాయి' మున్నగువాటియందు పడి మిగిలిపోయినవి. హద్దు, సరిహద్దులుగూడ అన్యదేశ్యములగును. కాని దేశ్యములుగాఁ బేర్కొనఁ బడినవి.

సాహిత్య ఎకాడమీవంటి సంస్థలు ప్రాచీన ప్రతుల ముద్రించుటతోబాటు ఇట్టి కృషిని సలిపి నచో శోభావహము.

నే నీ క్రింది పదముల వివరణము వ్రాయు టలో శబ్దరత్నాకరమును (శ. ర.), వావిళ్ల నిఘంటు వును (వా. ని.) (స వరకు) సంప్రదించినాను.

1. అంట : దీనికి శబ్దరత్నాకరములో కుట్టు డాకను నర్థము గలదు. విస్తరియను నర్థములోను, 'విస్తరంట' అనిగూడ వ్యవహారమును గలదు.

2. అంబాడు : ప్రేఁకు (చిన్నపిల్లలు) అని యర్థము. అంబ యనునది చిన్నపిల్లలకు ముద్దుగా

అవు' అను వర్థములో చెప్పెదురు. అంబవరి అడు అంబాడు అని కానోవు.

3. అగడు: దీనికి దూఱు, నింద యను నర్థములు గలవు. అత్యాశ అను నర్థములో ప్రయోగింపఁబడుచున్నది. 'అగడు పట్టినదా?' 'అగడు పట్టినట్లు తినుచున్నావేమి?' మొదలగునవి.

4. అగ్గువ: వెలతక్కువ, చవుక అని శబ్దరత్నాకరము. ఇదే యర్థములో వాడుకలో నున్నది. అధికము, ఎక్కువ అని కొన్నిచోట్ల వాడుకలో నున్నట్లు వావిళ్ల నిఘంటువు పేర్కొనుచున్నది.

5. అడకొత్తు లేక అడుక్కొత్తు: శ. ర. లో (అడకాయ+ఒత్తు) అని కలదు. వా.ని.లో పోకలు కత్తిరించు కత్తెరయని గలదు. ఈ యర్థములో వాడబడుచున్నది.

6. అధ్వాన్నము: శ. ర. లో దీని విచారము లేదు. వా. ని. లో విశేష్యముగా నకారాంత పుంలింగరూపముగాఁ జెప్పఁబడి విశేషణముగా రెండవ యర్థములో 'దురవగాహము, ఏమియుఁ దేలని స్థితిలో నున్నది. (వ్యవహారమంతయు అధ్వానముగా నున్నది= ఎటును తేలని స్థితిలో నున్నదని భావము. పైనున్న విశేష్యార్థము ననుసరించి నడిత్రోవలో నున్నదనిగాని, విశేషణార్థమునుబట్టి అడవిలో నున్నదనిగాని, ఏమగునో తెలియకున్నది అనిగాని భావము చెప్పవచ్చును)' అని గలదు. నాకు వ్యవహారములో నధ్వాన్నమనియే గోచరించినదికాని అధ్వానమని కాదు. కావున అధ్వాన్నమనుదానికి మార్గమధ్యమందు వండుకొనిన అన్నము అను నర్థమునుఁబట్టి సరిగాలేనిది, అస్తవ్యస్తముగా నున్నది అని అర్థమగును. పైదానికంటె నిదియె సమంజసమగును.

7. అప్పుడేని గుణ్ణాలు: ఒకవిధమయిన కీటకములు. ఎఱ్ఱనివర్ణము, సుమారు అంగుళము పొడవు, బహుపాదములు గలవి. వర్షములు పడినప్పుడు గుంపులు గుంపులుగా నగుపడును.

8. అరయు: ఎవరైనా మరణించినప్పుడు పలుకరించుట, లేక క్షేమ సమాచారము నరయుట. 'అర్సుకొనిరా!' అను రూపములో వ్యవహారము గలదు.

9. అజ్జి: శ. ర. లో చెప్పఁబడినట్లు గది యను నర్థములో నున్నది.

10. అవిశసంచి: దీనికి మూలమేదో తెలియదు. పురోహితులు బియ్యము మున్నగునవి తెచ్చుటకు వాడెడి సంచి, అయవారమునకు వచ్చెడివారు నిట్టి సంచుల వాడుచుందురు.

11. అరుసీలు (అర్సీలు): ఇది దేశ్యమో? అన్యదేశ్యమో? కళ్లజోడని యర్థము.

12. ఇగురము: పనులు మొదలగువాటిలోని పొందికతనమని యర్థము. 'ఇగురములేని పని' అని వ్యవహారము.

13. ఇలపీట: కత్తిపీట యని యర్థము. కూరలు తఱుగుట కుపయోగించునది.

14. ఉడుకు: వేఁడి: 'ఉడుకునీళ్లు' అనగా వేఁడినీళ్లు.

15. ఉప్పలము: గృహాదుల యంచొక్కొక్కప్పుడు హస్తాకారమువంటి (మోచేయి మొదలుకొని వేళ్లవఱకు) వస్తు వుద్భవించునట. దాని కీపేరు. ఇట్టిదానిని ఇతరప్రాంతములలో నేమందురో తెలియదు. నిఘంటువులలో ఉప్పలవాయి అను పదము గలదు. బొటనవ్రేలికి, చూపుడువ్రేలికి మధ్యనున్న భాగము. దానికి దీనికి సంబంధ ముండును.

16. ఉబ్బరము: కడుపుబ్బుట, అతిశయము అని శ. ర, వా.ని.లో ఉబ్బరపోవు అను పదముక్రింద '(ఉబ్బరము+పోవు) 1. ఆశ్చర్యపడు...2. బాధపడు' అను నర్థములు గలవు. వేసవిలోని వేఁడికి, 'ఉక్కపోయుట' అను నర్థములో వాడఁబడుచున్నది. వా.ని.లో ఆశ్చర్యపడు అను నర్థముక్రింద 'ఆదిమమైన యందమున యందుదయించెను గూబపుల్గు సూర్యోదయవేళ ముజ్జగము నుబ్బరపోవగ...కాశీ' అని ప్రయోగము కలదు.

17. ఊసులు: బహువచనాంత ప్రయోగమే యున్నది. అక్షిమల మర్థము.

18. ఎటమటము: అస్తవ్యస్తము. 'పని ఎటమట మయిపోయినది' 'వాఁడు ఎటమటం మనిషి' అని ప్రయోగములు.

19. ఎట్టి: వానపాము. ఈ యర్థము శ.ర., వా.వి.లోనూ గలదు.

20. ఓదప్పలు: బియ్యపుపిండితో (దీనికి వరిపిండి యని వాడుక) చేసిన రొట్టెల కీ పేరున్నది.

21. కరమ: కొఱత, శేష మని శ. ర; వా. వి.; రెండవ యర్థములో వాడుక యున్నది.

22. కాచండి: సామాన్యము వప్పు నుడికించుటకు. దృఢముగాను, మూతి చిన్నగానున్న పాత్ర. కాచు + అండి కాచండి అయియుండును. అండి అను దానికి శ.ర, వా.వి.లలో లోహపాత్రవిశేషమని గలదు.

23. కుమ్ము: ఇది 'కూడు'తో కలిపి వాడబడుచుండును. 'కూడు లేక కుమ్ములేక ఎక్కడికి పోయినావు' అని వ్యవహారము. శ.ర.లో కుమ్మి పదమునకు 'కుమికి మొదటి రూపము' అని గలదు. కుమి యనగా కుసూల విశేషమని యున్నది. వీటికిఁగల సంబంధము విచార్యము.

24. కైకిలి: ఈ రూపము శ. ర. వా. వి. లలో లేదు. వా. వి. లో మాత్రము 'కై కూలి-దేని. ఏ నాఁటిపని కానాఁ డిచ్చెడు కూలి' అని గలదు. కైకిలి సంపూర్ణముగా నీ యర్థములోనే గలదు. కై కూలి కై కిలిగా మారియుండును.

25. కొప్పెర: వెడల్పు ముఖముగల పెద్ద పాత్రము. అని శ. ర. ఇట్టిపాత్రకే వ్యవహారమున్నది. నీళ్లు కాచుటకు వాడబడు నీపాత్ర విశేషము.

26. కొయ్య: చిలుకకొయ్య అను నర్థములో వ్యవహారము.

27. కొలువు: సేవ యని శ. ర. ఉద్యోగ మను నర్థములో నున్నది.

28. గడిమంచ: వడ్లుకొనుబట్టలు, వలువులు మున్నగునవి ఉంచుటకు కోలలతో చేసిన యొక పరికరము.

29. గదువ: ఇది వా.వి.లో లేదు. శ.ర.లో గడ్డము అను నర్థమున్నది. కాని యిది తప్పు. గదువ యనగా గడ్డమువచ్చు ప్రదేశము. చిబుకము. సర్కారు ప్రాంతములో గదువ అను నర్థములోఁగూడ గడ్డమనే వాడుదురు. ఆ వ్యవహారమునుఁజూచి వ్రాసిన యర్థము. వస్తుతః గడ్డమనఁగా వెంట్రుకలకే.

30. గవాళము: విలువైన వస్తువు లుంచుటకు, ముఖ్యముగా ప్రయాణములందు తీసికొనిపోయెడి సాలగ్రామాదులు, తదర్చనావశ్యకములగు వస్తువులు నుంచుకొనెడి చిన్నపెట్టె, లేక అజినాదులతో చేయఁబడిన సంచి.

31. గిల్లుమను: వికృత ధ్వనులవల్ల శ్రోత్రములకు కలిగెడి యసహ్య భావము. 'చెవులు గిల్లుమనునట్లు శబ్దమయినది!

32. గులగుల: దురద. ఎక్కువగా చక్కిలిగింతలకు వాడఁబడును.

33. గులుగు: గొణుగు. 'లోలో'పల నేమో గులుగుచున్నావు ?

34. గువ్వము: గుజ్జు అని యర్థము చెప్పవచ్చును. ముక్కలు గలిగిన వంటకములలోని రస ద్రవ్యము, ఆవకాయ మున్నగు వానిలోని 'పిండి.'

35. చకిలము ముకులము: పద్మాసనములో వలె కాళ్లు ముడుచుకొని కూర్చుండుట. కొన్ని ప్రాంతములలో 'వానుపీట' (వ్యాసపీఠమన్నదానికి వికృతి యేమో) అని యందురు.

36. చేఁదు: (బావిలోనుండి) నీళ్లుతోడుట. నీళ్లుచేదుట యనియే ఈ ప్రాంతమున వ్యవహారము గలదు. శ.ర.లో లేదు. వా.వి.లో వివరముగా గలదు. 1. లాగు—'చెవ్వనివని నీళ్లు చేఁదెదననిపోవు; శుక; 2. ఉద్ధరించు, ద్వి. చేఁదుకో చేఁదుకో సిరిగిరి నాథ, చేఁదుకో మల్లయ్య చేఁదుకొమ్మనుచు; పండి. 3. ప్రయోగించు. 4. కూల్చు......పాడుబావులం జేఁదియు' అని గలదు. వీనిలో నీ పదమునకు అడుగుననున్న నీటిని పైకి లాఁదు మున్నగువాని సాహ్యము న్నన తెచ్చులే ముఖ్యముగా గోచరించుచున్నది. 1 లో నీళ్లు చేఁదెదనని స్పష్టముగనే యున్నది. 2 లో పాతాళగంగనుండి పైకివచ్చెడి భక్తుల మాట. నీళ్లనువలె పైకిఁ జేర్చుమనే యర్థముకాని ఉద్ధరించుమన్నంత భావమున్నట్లు తోఁచదు. 4 లో కూడ కూల్చు అన్న అర్థముచితమని భావింపను.

37. చేపొయ్యి : చేబదులను నర్థము చేయి యందు పోయు, చేపోయు అనున దీవిధముగా మారి యుండును.

38. జాంబు : సంధ్యావందనాదులయందు వాడెడి చిన్నపాత్ర, అందును తామ్రపాత్ర. జాంబూ పదముతో సంబంధ మున్నదేమో!

39. ఝలారు : వంటయిల్లు మున్నగువాటిలో గంజివార్చుటకు, నీళ్లుపోయుటకు మొదలగువాటి కేర్పాటయిన ప్రదేశము. ఇక్కడినుండి నీళ్లు బయటకు వెడలును. కావున 'జాలువాఱు' అనున దిట్లు మారినదగును.

40. టిష్టి : దృష్టి (దోషము) కపభ్రంశము.

41. టిబిలి : కర్ణమలము.

42. టోకు : (తానులో) తూచు.

43. తలుపుగూడు : గోడలో నమర్చబడిన 'అలమారు' లేక 'బీరువా'. తలుపులుగల గూడు కావున తలుపుగూ డనఁబడును.

44. తలిగ : భోజనపాత్రము, కంచము. ఇది శ.ర.లో లేదుగాని వా.వి.లో పేర్కొనఁబడినది.

45 తాంబాణము: తాంబాళమునకు రూపాంతరము. పెద్దపళ్ళెమని యర్థము.

46. తావు : స్థానము.

47. తిప్ప(లు) : బహువచనాంత ప్రయోగము. బాధ లను నర్థములో నున్నది. వా.వి.లోఁ గలదు. శ.ర.లో లేదు.

48. తెమడ : శైత్యముచే, గరిగెడు శ్లేష్మము. వ్యవహారములో నున్నది.

49. తొప్లె : శ.ర.లో నిది తొట్టియయొక్క రూపాంతరముగాఁ జెప్పఁబడినది. కాని యది తొట్లియ యొక్క రూపాంతరమన్నచో సరిపోవును.

తొట్ల, తొట్లియ అనునవి బిడ్డలు పండుకొను ఉయ్యాలకు వాచకములు. తొట్టియ యను నర్థములో తొప్లె శబ్దముయొక్క వ్యవహారం మెచ్చట నైన నున్నదేమో తెలియదు. తొట్లియ, తొట్టెయఁగా నపముద్రితమగు నవకాశమును గలదు.

50. తోలుకొను : ఇది తోడుకొను అన్న దాని రూపాంతరము. సర్కారుజిల్లాలవారు తెలియక తెలంగాణావారు మనుష్యులకు నీ ప్రయోగమును వాడు నప్పు డపహాస్యము చేయుదురు. పశురథాదులకు వాడినప్పు డీపదము 'కొను' లేకయు ప్రయోగింపబడును. తెలంగాణమునందు మనుష్యులకు వాడబడినప్పుడు 'కొను' సహితముగనే యుండును. కావున తోలు-కొను అనునది చేర్చఁబడవలయును.

51. దుగ్గాళం : 'దుగ్గాళముమీద కూర్చొనుట' అనగా పాదములపై అనుకొని (మూత్రవిసర్జనాదులయందువలె) కూర్చుండుట.

52. ధామంతము : విచారము, భయము. 'నేనుండగలను. నీ కేమి ధామంతము వద్దు.'

53. నజ్జినజ్జి : నలిగిపోవు, చూర్ణమగు నను నర్థమునఁ గలదు. 'తలుపు సందున వ్రేలుపడి నజ్జు నజ్జు అయినది!. నజ్జు నలుజు రూపాంతరమని శ.ర.న పేర్కొనఁబడినది. అదియే దీనికి మూలము. ఇదే యర్థమున నజ్జుశబ్దమునకు ప్రయోగము లున్నవి.

54. నసుకు : శ.ర.న, వా.వి.న అసత్యపు మాట, అసత్యమని గలదు. బహువచనాంతముగ నిదే యర్థమునఁ బ్రయోగింపఁబడును.

55. నెఱి, నెఱియా : పూర్ణమను నర్థమున వ్యవహరింపఁబడుచున్నది. నెఱవు నెఱ అనునవి మూలము. 'వాడు నెఱీ చెడిపోవుచున్నాడు?

56. పంచపాత్ర(ము) : శ.ర.న కుండలీ కరణములో వాడుకయుండు లోహపాత్ర విశేషమని గలదు. సంధ్యావందనాదులం దుపయోగించెడి గ్లాసు వంటి పాత్రకు వ్యవహారము గలదు.

57. పలుగఱ్ఱ : శ.ర.న పలుగఱి గలదు. పలు+కఱి అనగా పండ్లపొడి. ఈ యర్థము చింత్యము. వ్యవహారములో 'పలుఁగఱ్ఱ'యని గలదు. దంతకాష్ఠమనే యర్థము. పండ్లపొడికి వాడుకలేదు. పలుగఱి యనునది పలుగఱ్ఱ రూపాంతరమయి యుండును.

58. **పొతాఁగడిగ(య)** : బావిలో త్రాడు, బొక్కెన(చేద) పడినప్పుడు తీయుట కుపయోగించు సాధనము.

59. **పోళము** : పాయసముయొక్క అపభ్రంశము.

60. **పిచ్చకుంట్ల** : అప్రధానము, చిన్నవిష యము. 'ఈ పిచ్చకుంట్లపనికి నేను రావలయునా?' 'ఏమి కోపము, పిచ్చకుఁట్ల కోపము'. దీనికి పిచ్చి కుంట, పిచ్చుకకుంటు, పిచ్చికకుంటు అను వాటితో సంబంధ మున్నదేమో ?

61. **పిరియము** : వెల యెక్కువది. ప్రియ మునకు వికృతి.

62. **పులకరము** : జ్వరమునకు పర్యాయము. శ.ర.న గలదు.

63. **పెంఠ** : పేఁడయొక్క రూపాంతరము.

64. **పొక్క** : రంధ్రము, బిలము నను నర్థము. కొన్నిప్రాంతములలో బొక్కయని సరళాదిగా గలదు. అది రెండవ రూపమగును.

65. **పొక్కిలి** : గుంట యనుటకు శ.ర.లో మన్నట్లు వాడఁబడుచున్నది.

66. **బంకు** : దీనికి శ.ర.న సందువీథియని గలదు. వ్యవహారమున గృహమునందు ద్వారసమీప మున నెవరితోనైన కూర్చొని మాట్లాడుట కను వగు ప్రదేశము. ద్వారము, ఒకవైపు గోడలేని గది యాకారముండును.

67. **బరిగె** : ఉపాధ్యాయులు మున్నగువా రుపయోగించెడి బెత్తము. శ.ర.న బరికె గలదు. గల కులుగల యెండిన తాటిమట్ట. తద్వికృతియై యుండును.

68. **బరిబత్తల** : నగ్నముగా నుండుటకు వాడుదురు. 'వాడు బరిబత్తల మన్నాడు.' అనగా నగ్న ముగా నున్నాడని యర్థము. బరిగి యనఁగా శవాన్యము, బత్తల యనునది వస్త్రశబ్దవికృతియై ఈ రెంటి కలయికవల్ల నీ శబ్ద ముత్పన్నమై యుండును. బరి మేను (దిగంబర దేహము) అను ప్రయోగము లున్నవి.

69. **బాండ్లి** : శ.ర.న అనింద్యగ్రామ్యముగ, వంటచేయుటయందు వాడుకొను లోహపాత్రయని గలదు. ఇది బూరెలమూకుడని ఇతర ప్రాంతములలో వాడబడును.

70. **బాగాలు** : శ.ర. మన్నట్లే వ్యవహార మునఁ గలదు.

71. **బాటు** : (**బాట్లు**) : త్రాసునందు తూఁచుట కుపయోగించు కొలఁతరాళ్ళు.

72. **బీజిపోవు** : 'ఆశ్చర్యపోవు'అని యర్థము. బీఱపోవు, బీఱవోవు అనునవి శ.ర.న గలవు. వాటి యర్థము వేఱుగా నున్నది.

73. **బుక్క** : బుక్కు : బుక్క యనఁగా నోటినిండనగు తినుబండారపు ముద్ద. బుక్కుట క్రియ. బొక్కయనునది శ.ర.న గలదు. దానికి 'నోరు నిండిన పాడియగు తిమబండము' అని వ్రాసి 'వాడు అడుకులు రెండు బొక్కలు బొక్కిపోయినాడు' అను ఉదాహరణ మిచ్చినారు.

'వాడు అటుకులు రెండు బుక్కలు బుక్కి పోయినా' డనియే ఇచ్చట వ్యవహారమున్నది. బొక్క యనున దెక్కడైన వ్యవహారములో నున్నదా? లేనిచో చింత్యము. 'నోటిమీది బుక్క ఎత్తగొట్టకూడదు'

74. **బుగులు** : గుబులు రూ. అని శ.ర. భయమని యర్థము. 'నాకేమి బుగులు కాదు!

75. **బుచ్చెడ** : కొప్పు. వెంట్రుక లొకచోట ముడిగా వేసిన బంధము.

76. **బేడెము** : ప్రాచీనపు ద్వారములకు, గొళ్ళెమునకు మాఱుగా అడ్డముగా నుండెడి బలమైన దారువు.

77. **బొండిగ** : ఈనె మొదలు, తొడిమ యని శ. ర. 'బొండుగ'కు కంఠనాళమని కలదు. ఈ యర్థమునను, లేక కంఠమను నర్థమునను వ్యవ హరింపఁబడు చున్నది. 'నీ బొండిగ పిసికి వేసెదను' 'బొండిగలో ప్రాణమున్నంతవఱకు.'

78. **బొక్క** : పైన బుక్కు క్రిందమాడుడు. కాని యిక్కడ వ్యవహారమున ఎముకయను నర్థ మున్నది.

79. మస్తు : చాలును; అధికము.

80. మాగికాలము : అనఁగా పగలు తక్కువగానుండు కాలము.

81. మెత్త : పఱుపు అని శ.ర. దిండు (తలగడ) అను నర్థమున నున్నది.

82. మెయి : ఇది ప్రసిద్ధమైనదే గ్రంథములయందు. కాని వ్యవహారమున నిక్కడనే చూచినాను. దీని కపభ్రంశముగా పెయి, పెయ్యి అనునవి గలవు. మెయిసబ్బు అనగా ఒంటిసబ్బు. మెయిమీద 'ఈఁగ వ్రాలనీయఁడు.' నా మెయి బాగలేదు!

83. మొల : శ.ర.న నున్నట్లే చీల, మేకు అనుటకు వ్యవహారము.

84. లష్టెనిగ : పూరీలు. రొట్టెలు మున్నగునవి ఒత్తెడు కట్టె.

85. లెంకు : వెదకు.

86. లొంత : గుంటయని యర్థము.

87. లొల్లి : దీనికి శ.ర.న తలమునుకము, అను నర్థములు గలవు. అల్లరియను నర్థమున వ్యవహారము. 'పిల్లలలొల్లి ఎక్కువైనది!

88. వయ్య : పుస్తకము.

89. వరకట్టు : లోహనిర్మిత దేవతా విగ్రహములను, ఆభరణములను కడు గుటకుపయోగించెడు బ్రష్‌వంటి సాధనము. ఇది అడవిపంది వెంట్రుకలతో చేయఁబడును.

90. వరాతము : అట్లకాడ యను వర్థము గలది.

91. సాలె : సాల శబ్దమునకు రూపాంతరము. బడి యని యర్థము.

92. సైను : ఆగుమని యర్థము. శ.ర.న ఓర్పను నర్థముగల సైఁపునకు సయిను మొదటి రూపమని యివ్వబడినది. 'ఎక్కడికి బోయెదవు. సైను.'

93. సోయి : స్పృహ. 'మెయిమీద సోయి లేకుండ ఏమిటా నిద్ర? తెలివి యనియు.

అనుబంధము :

94. అమడాలు : కవలపిల్లలని యర్థము. ఇదే యర్థమున అమదలను శబ్దము శ.ర.న గలదు.

95. గగ్గోడు : హస్తముపైగాని, పాదములపైగాని నేదేని కురుపు మున్నగునవి కలిగినప్పుడు చంకలోను, గజ్జలోను వచ్చెడి చిన్నవాపు. ఈ పదము శ.ర.ను, వా.వి.వను లేదు.



# ఒక్క జీవితం మిగుల్చు

శ్రీ పి. కుమారస్వామి

1

లేదు లేదు
ఒక్క పువ్వుకూడా వికసించలేదు
నిఖిల నీల గగనంలో
ఒక్క చుక్కకూడా ప్రకాశించలేదు
ఉత్తరాన విరిసిన మల్లెపువ్వు భ్రాంతి
దక్షిణాన మెరిసిన నక్షత్రం భ్రాంతి
నిరంత రేతదాశా సంలగ్న చిత్తవృత్తికి ఇది భ్రాంతి
ఓ అదృశ్యసుఖస్వప్నహోగమనాధ్వనీనా!
ఇది మహాభ్రాంతి బృహన్మాయ!

ఆశయం ఏ నాడో
లౌకికత విదిలించుకుని ఊహల్లో కలిసిపోయింది
వాస్తవం ఆ నాడే
భూగర్భం అట్టడుగున దీర్ఘనిద్ర పొందింది

ఇంక పూలు విరియవు
చుక్కలు మెరవ్వు.
నువ్వు ఎడాపెడా విసిరివేయబడిన
ధృవాలను దగ్గరకు చేర్చలేదు
చంద్రుణ్ణి కందుకంగా ఆడుకోనూ లేదు
హిమనగాన్ని బొంగరంలా త్రిప్పలేదు
అనంతవిశ్వంలోని భిన్నగోళాలను
అనూన ప్రసూన మాలగా గ్రుచ్చనూ లేదు
ఎమ్మని బొమ్మగా భావించావు

ఈ బ్రదుకులు, ఈ చింతలు
ఈ హద్దులు, ఈ గొడవలు
క్షణికమనుకున్నావు
భువనమోహనమూర్తి ఎవరో
దివినుండి దిగి సాక్షాత్కరిస్తుందనుకున్నావు

ఇంక పూలమీద చుక్కలమీద
ఆశపడకు
అంతీంద్రియ భాగవతం మృగతృష్ణ
వెంటబడకు.

## 2

నీ దారిలో అనంతంగా
పాతివున్న ఇనుపముళ్లన్నీ పెకలించేందుకు
నీ ఆయువు చాలదు.
అయినా
కొన్ని యుగాల తరువాతనైనా
నీ దారికి తిరిగే వాళ్లకు
ఆదర్శంగా సత్తువనంతా వినియోగించి
ఒక్క కంటకం వదుల్చి చెయ్యి
ఒక్క జీవితం మిగుల్చు.

---



# "రాధాకృష్ణ విలాసము"

శ్రీ మేడిచర్ల నాగరాజు

"దేశభాషలందుఁ దెలుగులెస్స" అని శ్రీ కృష్ణదేవరాయలుఁను, 'జనని సంస్కృతంబు సకల భాషలకును, దేశభాషలందుఁ దెలుగులెస్స' యని కవిసార్వభౌమ శ్రీనాథుఁడును చాటిరి. అట్టి తేనె లొలుకు భాషయందు పెక్కండ్రు కవులు వెలసి పెక్కు కావ్యముల వెలయింపఁజేసిరి. కాని మన దురదృష్టవశాత్తు అనేక కావ్యములు కేవలనామావశిష్టములై శిథిలములై - కాలగర్భమున గలసినవి. అట్టివాటిలో 'రాధాకృష్ణ విలాస' మొకటి[1].

'రాధాకృష్ణ విలాసము' అను యీ ప్రబంధము శృంగార కావ్యము. ఏతద్గ్రంథకర్త 'సంబరాజు—తిరుమలరామకవి'. దీని తాళపత్ర ప్రతియొకటి ప్రథమముగ '15–4–1946 సం॥న తాళపత్ర గ్రంథ పరిశోధనాలయము– కర్నూలు, గౌరవరపుల రామకృష్ణ సీతారామ సోదరకవులు – శతావధానులు' వారిచే సంపాదింపబడి నకలు కాపీయెత్తి వ్రాసికొనిరి. ఈ తాళపత్ర ప్రతి మిక్కిలి శిథిలమై ప్రథమాశ్వాసమున అనేక పద్యములు ఒండు, రెండు పాదముల ప్రకారము లభ్యమయినవి. పై సంపాదకుల చేత యియ్యది మూఁడాశ్వాసముల ప్రబంధముగా గుర్తింపబడినది. కానీ తృతీయాశ్వాసము సంపూర్ణముగ లేదు. ఆశ్వాసారంభ పద్యము మాత్రము లిఖించబడినది. ఈ తృతీయాశ్వాసము పూర్తిగా వ్రాయకుండుటకు కారణము - తృతీయాశ్వాస తాళపత్రములు శిథిలములై యుండుటయో; లేక పరిశోధనాలయమును దీసివేసి యుండుటయో జరిగియుండును. నేఁడీ పరిశోధనాలయము కర్నూలునందు లేదు. కావ్యమును లభ్యమైనంతవఱకు: జదివి చూడ మూఁడాశ్వాసములకు మించియే యుండునని తలంచితిని.

దీని ప్రతి మరి యెచటనైనను గలదాయని విచారించః అనేక తాళపత్ర గ్రంథ సంపాదకులగు 'శ్రీ హస్నాబాదు నాగలింగశివయోగి'గారియొద్ద యున్న దనియు; అదియు మిక్కిలి శిథిలముగానుండి 4 ఆశ్వాసములు మొదలు 7 ఆశ్వాసములవఱకు గలదని దెలిసికొంటిని. కానీ నాకా ప్రతిని పరిశీలించుటకు అవకాశము దొరకలేదు.

సంబరాజు తిరుమల రామకవి తనను గూర్చి—

సీ. [2]..............................

............శిష్యముద్ర

మహి సంబరాజ, తిమ్మాంబ, వెంకటరామ

వరతనూభవుఁడ; శ్రీ వైష్ణవుఁడను

శ్రీ కృష్ణకథల కాస్తికుఁడ; గోవిందార్య

పౌత్రుఁడః హరివ...........

....................లబ్ధకావ్యుఁడ

వేంకటేశ్వరుఁ డిలవేల్పు తమకు

గీ. మఱియు శ్రీరామకృష్ణులు మాకుఁ ప్రియులు

గాన నీ మువ్వురిని మనోకాంక్ష కొలది

నను దినము......................

.........సంబరాజు తిరుమల రాముఁడిలను—

(1 - 4)

అని మడువుకొన్నాఁడు. ఈతని వంశనామమును కవి యొచ్చటను ప్రత్యేకముగ పేర్కొనలేదు. ఆశ్వాసాంత గద్య యిట్లున్నది –

---

1. రాధాకృష్ణ విలాసమను కావ్యము తెలుఁగు వాఙ్మయమున మఱియొకటిఁ గలదు. దానికర్త 'కృష్ణదాసకవి'. చూడు—ఆంధ్రకవి సప్తశతి—పుట 38.

2. ఈ చుక్కలు గ్రంథ శిథిలమునకు గుర్తు.

'ఇది శ్రీ తిరుమలనాథ నిర్హేతుక కృపాకటాక్ష వీక్షణ వరప్రసాదలబ్ధ కవితావిభవ శ్రీమత్తిరుమల శ్రీనివాస గురుచరణారవిందసేవక సంబరాజు గోవింద పౌత్ర వేంకటరామ తనూభవ తిరుమల రామదాస ప్రణీతంబైన రాధాకృష్ణ విలాసంబునందు ద్వితీయాశ్వాసము శ్రీ శ్రీ శ్రీ' అని యున్నది. సామాన్యముగ వంశమూల పురుషులతోను, గ్రామ నామములతోను వంశనామము లేర్పడుట సహజము. తండ్రి పేరు సంబరాజు—వెంకటరామయ్య, కవిపేరు సంబరాజు—తిరుమల రామకవి. కాన వీరి వంశమునకు మూలపురుషుఁడు సంబరాజై యుండును. ఆ నామమే వీరి వంశ నామమై యుండును.

దీనియందలి ప్రథమ ద్వితీయాశ్వాసాంత గద్య లొకటియే యైనను; కొద్ది వర్ణముల తేడా కనబడు చున్నది. 'శ్రీమత్తిరుమల; నిర్హేతుక కటాక్ష; తిరుమల రామదాస' అని ప్రథమాశ్వాసాంత గద్యయందలి భేదము.

ఈతఁడు తన గురుపరంపరను యీ విధముగ వివరించెను.

సీ. వరతిరుమల తిరు—వంశాబ్ధి పూర్ణ సు
ధాకర రాఘవాచార్య లనఁగఁ
దత్పుత్రు లుభయవేదాంత.........
...................లనఁగఁ
దత్సూను లతులితౌదార్య సౌందర్య గాం
భీర్యులు శ్రీనివాసార్య లనఁగఁ
దత్తనూభవు లమితప్రశాంత క్షమా
వైభవులకు గురువర్యు లనఁగ
గీ. ............................
నవని శ్రీపిళ్లరంగార్య లట్టిఘనుల
శిష్యుఁడను; వారి కరుణా విశేషమునను
వరుస వినుతింతు శ్రీవరువైభవమును.
[(1—3)

అని ఒక్క పద్యమునందె చెప్పివేసెను.

ఈతఁడు తన కావ్యమున కవిస్తుతిగాని, కుకవి నిందనుగాని, షష్ఠ్యంతములుగాని చేయలేదు.

ఉ. ............శేషఖగేంద్రుల
కర్థి మ్రొక్కి; యా
ళ్వారుల సంస్తుతించి;
గురువర్గము నాత్మ భజించి; ప్రేమతో
నారద శౌనకాది మునినాథులఁ
బేర్కొని; ని...............
.............................
చేసి యంతటన్. (1—2)

అని దేవతలను, మునులను, ఆళ్వారులను మాత్రమే స్తుతించినాఁడు. దీనియందు కావ్యారంభము మొదలు కథా ప్రారంభము వఱకు కవిని, గ్రంథమును, గురుపరంపరను, స్వప్నవృత్తాంతమును మొదలగు విషయముల నన్నిటినిగూర్చి 10 పద్యములలో చెప్పబడినది. అందుచేత ఈతని కాలమునుగాని, నివాసస్థలమునుగాని నిర్ణయించుటకట్టి యాస్కారమును లభింపకున్నది. శృంగార ప్రబంధములు మిక్కుటముగ 17, 18 వ శతాబ్దులయందు నిర్మింపబడినవి. అందుచే యీతని కవిత్వ శైలినిబట్టియు, శృంగారగ్రంథమగుటం జేసియు; ఈ కవి 17, 18 వ శతాబ్దులయందుండ నచ్చునని తలంచుచున్నాను. విజ్ఞులు పరిశోధింతురు గాక!

ఈ కవికి వేంకటేశ్వరుఁడు; శ్రీ రామకృష్ణులు ప్రియులగుటచేత ప్రతిదినము కాంక్షకొలది పూజించు చుండెనట. 'సనకాది మునిజనములకు; వనజాసన రుద్ర వాసవ ప్రముఖులకున్; మునితతుల కభిలము నకున్; ఘనదైవంబైన కృష్ణకథ విరచింతున్' (1—5) అని మఱల 'నే నీ కరముల వ్రాయుటయె గాని కరమేమెఱుఁగన్' (1-6) అనిపై 'నిమ్ము వ్వుటిలో నెవ్వరి చరితంబు రచింతునో' యని మనంబున కోరికఁ గలవాఁడనై యుండుతఱి యొకనాటి రాత్రి స్వప్నంబున శ్రీ వేంకటాచల నాథుండొక శ్రీ వైష్ణవాకారంబుగా వేంచేసి సమందహాసాలోకనంబు...........రచింతువని నిందు; నందులో నొక పద్యంబు చదువుమనిన' (1—7) 'విని తత్పఠితం బప్పటి కనువుగ నేఁదెల్పఁబూనిన' (1–8).

చ. అది విని సంతసించి; నిజ
హస్తములందగు పద్యముల్ లిఖిం
చి; దయ నొసంగి; నీ విటు ర

చింపుటకుం దగునన్న జేసదిన్
జదువ........................
........................
................నవుడె
బోరున బద్యములయ్యె నింపుగన్' (1–9)

'ఇట్లు స్వప్నోక్త ప్రకారంబును కృతనిశ్చయుండనై రాధాకృష్ణ విలాసంబు...పరాధ...పణంబు గావించుట వలయు తత్కథారంభం బేరీతి దనిన' (1–10) అని కథా ప్రారంభముఁ జేసినాఁడు.

ఇట్లు యీతఁడు పూర్వకవుల ఆచారముల నుండి స్వప్నఆచారమును మాత్రము కావ్యమున ప్రవేశ పెట్టినాఁడు. స్వప్నకథయుం దెప్పుటను గ్రంథాంకిత మును గూర్చి చెప్పలేదు. కాని ఆశ్వాసాంతమునందు 'భూధరధీర! భక్తజనపోషక! వర్ణగిరీశ! వేంకటా!' అని వేంకటేశ్వరుని సంబోధించుచూ చెప్పెను.

ఈ కావ్యమున —

| | | |
|---|---|---|
| ప్రథమాశ్వాసమున | 172 | గద్య–పద్య |
| ద్వితీయా ,, | 140 | ,, ,, |
| తృతీయా ,, | 1 | ,, ,, |
| | 313 | |

కలవు. దీనియందు కవి యుపయోగించిన వృత్తములు:

| | | | |
|---|---|---|---|
| కందము | 105 | శార్దూ | 8 |
| ఉత్పల | 40 | మత్త | 6 |
| చంపక | 41 | మత్తకో | 2 |
| సీస | 40 | తరల | 1 |
| వచనము | 34 | ఉత్సాహ | 1 |
| తే. గీ. | 33 | మాలిని | 2 |
| | | | 313 |

ఈ కావ్యమునందలి కథ పూర్వము సూతుండు చెప్పగా శుకుఁడు విని పరీక్షిన్నరవరునకు జెప్పునటుల ప్రారంభింపబడినది. దీనియందు ద్వితీయాశ్వాసాంతము వఱకుగల కథ సంక్షిప్తముగ యిది:—

'వ్రేపల్లెయందున్న రాధ కృష్ణునియందుమనస్సు కలిగియుండి; బాలుఁడైన కృష్ణుని యశోదకుఁ దెలి యక తన యింటియందు పెంచుచు; బువ్వ గుడి పించుచు; కన్నయ్య అమాయకుఁడని తలచి, రతి క్రియలు తెలియనివాఁడని యెంచి, తానేరుపుచు, వాతనికి రతిక్రీడలు నేరుపు నేరుపున క్రియలచే తాఁదృప్తిని బొందుచుండును. రాధ యింటనున్న కృష్ణుఁడు మఱియొకవైపు గోపికలతో రతిజేయుచు, వెన్న దొంగలించుచుండును. అంత గోపికలు యశోద కడ మొఱఁబెట్టుకొనుట; దీనిని విన్న రాధ కోపముఁ జెంది కృష్ణుఁడెన్నడు నా యెదుట రతిక్రియఁ దెలి యనివానివలె నటించుచు, తానై రతిక్రీడ నన్ను దేల్పక గోపీజనముతో క్రీడించుచుండె గదా! అని దైన్యతఁ జెంది కృష్ణుని దూరుటయు, అంత కృష్ణుఁడు ఆ మాటలన్నియు బూటకములు, నీనుండి దూరముఁజేయుటకై వారట్లు చెప్పిరని నుడివి; రాధకు తన పైగల దురభిప్రాయమును మాన్పువానివలె నటించి, రాధను నవరసముల క్రీడింపజేయుచు, క్రమముగఁ బెద్దవాడయ్యెను.'

ఇయ్యది శృంగారగ్రంథమేయైనను యీ కవి మిక్కిలి హద్దుమీరి పచ్చిశృంగారవర్ణన జేయలేదు. ఈతని రచన అతిమృదుమధురము. అచ్చతెనుఁగు పద ముల నెచ్చటను వాడలేదు. అన్నియు తత్సమ శబ్ద ములే. అవియును ప్రచారములో నుండునవి - సులభ గ్రాహ్యములు. ఈ రెండాశ్వాసములయందును నాతిదీర్ఘ సమాసంబైనను నెచ్చట గాన్పించదు. కావ్యమంతయు వాకేశైలియందు నడచినది. శ్లేషార్థశబ్దములు లేవు. నానార్థనిఘంటువులనుగాని, శబ్దార్థకోశములనుగాని ముందుంచుకొని జదువవలసిన కవిత్వము కాదు. అనగా మిక్కిలి ద్రాక్షాపాకమున నడచిన రచన.

సీ. హరి తాను సముభూషణాద్యలంకారులై
కర మొప్పువేళ శృంగార రసము;
మురవైరియును తాను ముద్దుగా జతగూడి
నరి నటించెడి వేళ శాంత రసము;
అలనందమానుఁ జేడని యున్యులడుగుచో
విమపించు నవ్వేళ వీర రసము;
సురరక్షకుని జారచోరుఁ డంచని పరుల్
రణ మొనర్చెడివేళ రౌద్ర రసము;
శౌరితో సరసత శయ్యాగ్రహంబున
భాషించువేళ బీభత్స రసము;
దనుజారి దివ్యసౌందర్యాదు లతివేడ్క
మతి మతించువేళ నద్భుత రసంబు;

గోవిందు ముద్దుపల్కులకు లోఁజిరునవ్వు
నవ్వువేళలఁ గరుణారసంబు;
వనజేక్షణుని వీఁపెర్కుఁడంచని దర్ప
ణావలోకనవేళ హాస్య రసము;

గీ. కృష్ణ కృష్ణ యని యశోద కేరి పిలుచు
పలుకుఁ జెవిసోకు నప్పేళ భయ రసంబు;
గాఁగ నీరీతి రాధికా కమలనేత్రి
రమణి క్రీడించు నవరసాలంకృతముగ.
(2-135)

పై పద్యమున కవిప్రతిభ, శబ్ద శయ్య, అర్థసంఘటన, అయానంఘటనలయందు దానికి తగిన రసమును పోషించుట అప్రతిమానములు నిజమున కీ రసములన్నియు ఈ కావ్యమున మిళితములై యున్నవి. ఇటులనే రాధా బాలకృష్ణుల సంభాషణము—

చ. అలఁదినదేమి? గంధము;
ం.........కదేమి? మౌక్తికం;
బల నెఱవేణి నేమి? విరుల్; లైతె
కరంబుల నేమి? పొకటుల్;
గళమున నేమి? హారముల్; లేకన్;
వనజాయతనేత్రి! పైఁటలో
పలఁ గలనేమటన్నఁ బసిబాలుఁడ
విశ్లేషిగింపరాదనున్. (2-56)

పై పద్యమున సహజతకు సన్నిహితముగ బాలకృష్ణుని ప్రశ్నలు—రాధ సమాధానములు చక్కగ చిత్రించ బడినవి. ముఖ్యముగ 'పసిబాలుఁడ విశ్లేషిఁగింప రాదనున్' అని రసాభాసను చేయక, రసోత్పత్తిఁ జేసిన కవిప్రతిభ శ్లాఘ్యము. 'గూఢముగనున్న ఘూర్జరీ దేశ స్త్రీల కుచములవలె గాక, ద్రావిడ యువతుల స్తనములవలెఁ దేటగాక, ఆంధ్ర వధూటి యరవాటకు చనుగవవలెనున్న ఉత్తమ కవిత్వ మనిపించుకొనునని బైచరాజు వేంకటకవి' చెప్పినటుల మన కవి, రసాభాసమునకు తావీయలేదు. మఱియొక కవియై యుండిన వాటిని ప్రత్యక్షముచేసి స్వారస్యము చెడగొట్టి యుండును.

పాత్రలను యుక్తిగా వర్ణించుపట్టున ఈ కవి చేమకూర వేంకటకవితో సమానముగ జెప్పదలచినవాఁడు.

గీ. అతివమధ్యంబు, మధ్యమమని కవీంద్రు
లాడుకొన విని; యుత్తమంబనని కతనఁ
జారిపోయెనా? లేకున్న బయలుపడదె!
బయలుపడుదురె సిగ్గున బ్రతుకువారు?
(1-40)

ఈ విధముగ రాధను వర్ణించుపట్టున నిజముగ రాధకు యెక్కడలేని విశిష్టతఁ దెచ్చిపెట్టినాఁడీ కవి.

ఇటులనే రాధ కృష్ణుని విరహమున్న సందర్భమః—

కం. రాగము విహరఁగు నందెలు
మూఁగలు ఘలుఘల్లు మనెడి ముద్దుఁ బాలున్
రాగ విభేదంబులతో
జోగలఁ బాడుచును మిగులఁ జోకొట్టుదయున్.
(1-55)

ఈ విధముగనే ఇంకాతని కవితయందిట్టి సహజ వర్ణనలు కోకొల్లలు. గోపికలు కృష్ణుని చిలిపి చేష్టలు యశోదకు చెప్పుచు—

చ. మఱియొక బోఁటిగాంచి
కుచమధ్యను చీమచరించు దాని నీ
వరసికొనంగ నేరవపహాస్యము గాదనినన్;
పయంట బిత్తఱి
తొలగించి చూచుతఱి,
దాని పయింబడి మోవి నొక్కి న
వ్వెఱుఁగవె? చిన్ననాటి మగఁ డితఁ
డటంచు మనంబు లోపలన్. (1-74)

ఇట్టి శ్రీకృష్ణుని చిలిపిపనులు మిక్కిలి హాస్యమును గూడి యానందమును గూర్చును. ఈ బాల కృష్ణుఁడు 'గోపికలను నరపత్య మేర్పడ వరింపక పోవుటఁ బౌరుషంబు గాదని మడినెంచి వచ్చిన మృగాక్షుల కందఱి కన్నిరూపులై అనమాకృతిఁ గొక్కొకశాస్త్రసమ్మతి సమరసిజకేళిఁ దేల్చె'నట.

కావ్యమునందంతటను స్వతంత్ర రచన జేసినను ఒండు, రెండు పద్యంబులందప్ప నెచ్చటను పూర్వకవుల ననుకరించలేదు. భాగవతమునందలి—

కం. లేమా దనుజుల గెలువఁగ

శేమా నీవేల కడఁగి లేచితి విటురా
లే మాను మాపవేనిన్
శేమా విల్లందికొనుము శిలంగేలన్.
(భాగ—దశ—ఉత్త—172)

అను పద్యమును దృష్టియందుంచుకొని—

కం. శేమా! పరనిందలఁ దవి
శేమా! నీ కెఱుక సేయలేమా? మదిఁ దా
శేమా! యిఁక దొరికిన వద
శేమా! తగు శిక్ష సేయలేమా? శౌరిన్
(1—162)

అని రచించెను. ఇటులనే భాగవతమునందలి 'శ్రీకృష్ణుని చిలిపిచేష్టలు గోపికలు యశోదతోఁ జెప్పుట' అను సందర్భమునందలి భావములను యే మాత్రము గ్రహింపలేదు. సూక్ష్మముగఁ బరిశీలించిన, నొకటి గనబడుచున్నది.

కం॥ తెఱవ యొకతె నిద్రింపఁగ
నెఱిఁగట్టిన వలువ వీడ్చి నేటగు తేలుం



గఱపించిన నీ కుమారుఁడు
వెఱచుచు నది వలువ నగియె, విహితమె, సాధ్వీ!
(భాగ—దశ—పూర్వ—324)

దీనిలోని భావమును గ్రహించి—

గీ॥ వృశ్చికమును దెచ్చి వెలది నిద్రింపుచో
వలువ విడిచి యుచటనైన, నదియుఁ
దెలిసి లంతుఁ గొనుచుఁ దిరుగఁగా మంత్రించి
యపుడె దాని లతుల నలతుఁజేసె (1—143)

అని భావమునకు మెఱుగు పెట్టెను. మూలకారకుఁడయిన పోతనను దృష్టియందిడుకొనుట చోద్యము గానేరదు.

సీ॥ నేనేమి చెప్పుదు నీవు జేసెడి పనుల్
తెలుపరా దెరికిఁ దెలియరాదు;
నేనేమి సేయుదు నీ విటు సేయఁగా
నూరకుండంగరా దోర్వరాదు;
నే నెంతకని యోర్తు, నీవను మాటలు
నమ్మకపోరాదు నమ్మరాదు;
నే నెట్లు వేగింతు నీ దయాదులు జూచి
వేగిరింపఁగరాదు వేగరాదు;

గీ॥ గోలవసరాదు, మరుకేళిఁ గూడరాదు
కూర్మివిడరాదు, వేసట గొనఁగరాదు
చలమువసిగాదు, కోపంబు సతముగాదు
తాళఁగారాదు, నిను దిద్దఁ దరముగాదు (2—8)

ఈ విధముగ ప్రాసనొంపును వెలయించి పోతనవలె పద్దెములకు హొరువును జేకూర్చినాఁడు.

ఈ కవి ఘంటమున కృష్ణుని పాత్ర మిక్కిలి రమణీయముగ చిత్రింపబడినది.

గీ॥ ఇంతి వలెనె వచ్చి, యింతులతో గూడి
నవ్వళించి, మగనివను లొనర్చు
మగలు వచ్చువేళ మమ్ముల నదలించు!
జీరలూడ గుంజఁ జిక్కుకురుకు. (1—131)

ఇట్టి వేర్పరియైన మాయావికి రాధయేమియు నెఱుఁగనివాఁడని తానిట్లు నేర్పినదట—

చ. మగువలయుం దొనర్పఁగల
మక్కువ లీవరకైన నేరవా?

# సంస్కారి

శ్రీమతి ఐ. వి. యస్. అచ్యుతవల్లి

అరుగుమీద నించున్న 'రామరాజు' సిగరెట్టు ఆఖరి దమ్ము గట్టిగా పీల్చి, విసుగ్గా, ఆ మిగిలిన సిగరెట్టు పీకని రోడ్డు క్రిందకి గిరాటేశాడు. అరుగువార కాస్తంత తడిగా వున్నచోట పడిన సరిగ్గా ఆరని ఆ సిగరెట్టుపీక 'సుయ్'మంటూ, 'బుడగ'లోంచి గాలి పోతూవున్నప్పుడుచేసే సవ్వడిలాంటిది చేస్తూ, 'తుది విశ్వాస' సన్నని పొగ గాలిలోకి వదిలి ఆరిపోయింది. ఆ రోజు ఉదయంనించీ సూర్యుడు కనపడలేదు. అల్లా అని పెద్దవర్షం కొట్టి కురిసిందీ లేదు. గంటకీ, అరగంటకీ ఏదో జ్ఞాపకం వచ్చిందానిలా, తుప్పుతుప్పుమంటూ ఒక సన్నని జల్లు మొదలయి మళ్ళీ అంతలోనే ఆగిపోతోంది. వాన వచ్చి వెలిసిన సూచనగా చెట్ల ఆకులమీంచి, అక్కడో చినుకూ, అక్కడో చినుకూ చిటుకు చిటుకుమంటూ క్రిందపడుతోంది. రామరాజు ఇంటికి తాళంవేసి మెట్లు దిగాడు. రామరాజు వుండే ఇల్లు మెయిన్ రోడ్డుకి చివరగా వుంది. కాంపౌండువాల్ లేదు. ఎత్తయిన అరుగులుకల పాతకాలపు పెంకుటిల్లు. అరుగుకు ఆరు గజాల దూరంలో మూడు గజాల చుట్టుకొలతల మ్రానుకట్టిన నిద్రగన్నేరుచెట్టు ఒకటే వుంది. రామరాజు ఆఖరిమెట్టు దిగబోతూండగానే, జనార్దనం వచ్చేడు. జనార్దనం రాజుకి కొలీగ్. రామరాజులానే బ్రహ్మచారి ఉద్యోగస్థుడు! జనార్దనం వస్తూనే—

'అరె నీ! వూరంతా ఇంత చీదర బొదరగావున్నా, నీ టీటుకి నువ్వు బయలుదేరాల్సిందేనట్రా!' అన్నాడు.

'వెధవది. ఏమీ తోచి చావటంలేదురా!' అన్నాడు రాజు.

'ఎల్లా తోస్తుందిరా చెప్పు! కాస్త చీకూ చింతా లేనివాడవికదా, అని ఆఫీసువర్కైనా ఓవరుగా చేస్తావా! ఠంచన్‌గా, అయిదూ కొట్టేసరికల్లా, బూట్లలో కాలు దూర్చేస్తావు! ఇంటిదగ్గర నలుగురు పెళ్ళాలూ, అయిదుగురు పిల్లలూ ఎదురు చూస్తున్నట్లు ఉరకలు పరుగులతో ఇంటికివచ్చి పడతావ్! పోనీ ఏ తత్వశాస్త్రమన్నా చదివి జ్ఞాని వవుతావంటే, అల్లాటప్పా సినిమా పత్రికలూ, పంద్రెండు రాజుల కథలూ, తప్ప, వేరే గ్రంథాలు తమకు రుచించవాయె! హాయిగా పెళ్ళిచేసుకుంటే ఈ నాటికి నలుగురు పిల్లల తండ్రినై, 'గృహమేకదా స్వర్గసీమా' అంటూ, పాడుకుంటూ కూర్చుందువు! నీకు ఈ ఏకాకితనమూ; కాకితనమూ తప్పేది!' అన్నాడు, జనార్దనం.

'నామాట వదిలెయ్! తమరు చేస్తోన్న పనేమిటో చెబ్దా గురూ!' అన్నాడు, రాజు. నడుస్తూ, ఇద్దరూ రోడ్డెక్కారు.

'నాకు పేరుకి పెళ్ళి కాలేదన్న మాటేకాని, అంతకు రెట్టింపు సంసారం భరాయించాల్సి వుంది. పెళ్ళికెదిగిన చెల్లెళ్ళూ, మెడిసిన్ చదువుతున్న తమ్ముడూ, పేకాటమానని పితృపాదులూ, పురుటిమంచం దిగని మాతృమూర్తి వీళ్ళందరితో పాటు, మెడకో డోలుకూడా కట్టుకుని నా సంసారం ఈతి భాధలు డప్పు వాయించుకోనా! నీలా బేపూచీ మనిషినయితే ఈ పాటికి ఒక పెళ్ళేం ఖర్మ! నాలుగు పెళ్ళిళ్ళు చేసుకునేవాణ్ణి!' అన్నాడు,

'వెధవాయా! నాలుగు పెళ్ళిళ్ళంటున్నావు! నువ్వేడుస్తున్నది గవర్నమెంటు జాబ్ అని మర్చిపోయేవా!' అన్నాడు రాజు.

ఇద్దరూ వాళ్ళకి అలవాటు అయినచోటు అయిన బస్టాండుకి వొచ్చారు. బస్టాండు రాజు ఇంటికి ఫర్లాంగు దూరంలో ఎగువకి వుంది. బస్టాండు

కేవలం, ఒక సంగరావిచెట్టు వుంది. దానిక్రింద పెద్దబండరాయి వుంది. దానిమీద, ఆ ఇద్దరు మిత్రులూ, రాత్రి ఎనిమిది గంటలదాకా, కబుర్లు చెప్పుకుంటూ కూర్చుంటారు. వచ్చేప్పుడూ, వెళ్లేప్పుడూ, ఆగే బస్సుల్లోంచి దిగుతూన్న జనాన్నీ ఎక్కుతోన్న సామాన్లనీ, చూస్తూ, వాళ్ల అందచందాల గురించీ, చీరె సారెల గురించీ, మాట్లాడుకుంటూ కూర్చుంటారు. ఆ చెట్టు కొమ్మల రెమ్మల నీడలకి చివరగా, రేకులతో అమర్చుకున్న చిన్న కిళ్లీకొట్టు వుంది. దానికి కాస్తంత ఎడంగా నాలుగు రేకులు కప్పివున్న షెడ్డు ఒకటి వుంది. బస్సుంకోసం వెయిటుచేసే స్త్రీలూ, పిల్లలూ, ఆ షెడ్డులో, పెట్టెలూ గోనెసంచీ మూటలూ, వడేసుకుని, కూర్చుంటారు. ఆ షెడ్డు అంతా వేరుశనగతొక్కలూ, అరటిపళ్ల తొక్కలూ, ఫలహారాలుచేసి పారేసిన ఎంగిలి ఆకుముక్కలూ, చిన్నపిల్లలు పోసిన ఉచ్చలతో, చితచితలాడుతూ కుళ్లుకంపులు కొడుతూ వుంటుంది. పెద్ద పెద్ద గాలి దుమారాలు వచ్చినప్పుడు ఆ షెడ్డులోని గత్తరంతా దానికదే ఎగిరి బయటకి పోవాల్సిందే తప్ప, ఆ షెడ్డులో, చీపురు వేసి తుడిచే పనివాళ్లు ఎవరూ వుండరు. మెయిన్ రోడ్డు కిరుప్రక్కలా పంటచేలు వున్నాయి. ఎండాకాలము నాలుగు నెలలూ తప్పించి, మిగతా కాలమంతా, పచ్చగా ఆకుపచ్చగా, కంటికి నిండుగా, చల్లగా కన్పడుతుంది అక్కడి ధరిత్రి! పెద్దపట్టణమూ కాక, పల్లెపట్టూ కాక, త్రిశంకు స్వర్గముగా వుంటుంది, ఆ వూరు! మెయిన్ రోడ్డుమటుకు తారురోడ్డు!

రాజా ఇంటివద్దనించి బస్టాండువరకూ ఇళ్లు లేవు! రోడ్డు కిరుప్రక్కలా పొలాలువున్నాయి. బస్సు దిగిన వాళ్లు వూళ్లోకి రావాలంటే 'రాజా' ఇల్లు దాటి రావాలి. వూరికి మైలురాయిలా వుంటుంది. రాజా ఇల్లు. ఆ ఇల్లు దాటినాక, గొల్లల ఇళ్లు వున్నాయి. ఆవుల్నీ గేదెల్నీ మేపుకుని, వూరి ఖామందులకి, పాలు, పెరుగూ, నెయ్యీ. అమ్ముకునే, గొల్లల ఇళ్లు. అయిదారు వందల గడపదాకా వున్నాయి. అందుకే, ఆ ఏరియాని, గొల్లగూడెం అంటారు. గొల్లగూడెం శివార్లలో 'హోటలు నిర్మలా' వుంది. భోజన ఫలహారాలేకాక, లాడ్జింగ్ సౌకర్యంలో కూడా, నీటుగావుండే హోటలు అదొక్కటే! బస్సులోంచి, నీటుగా మస్తాబయినవాళ్లు దిగి, రిక్షావాళ్లని ఏదయినా హోటలుకి పోనిమ్మంటే, రిక్షావాళ్లు షూర్‌గా వాళ్లని 'నిర్మలా'కే తీసుకువస్తారు. 'నిర్మలా' నించి వూరుపొడుగ్గా గతుకుల రోడ్డుతో, అస్తవ్యస్తంగా ముందు వెనకలుగా వున్న ఇళ్లతో, చాలాదూరం, జరాభారంతో, నడవలేని, జర్జరీ భూతమయిన, శరీరంలా, ప్రయాసపడుతూ, పరివ్యాప్తమయింది. రాజా, జనార్దనం, వచ్చి కూర్చున్న అరగంటకే, ఒక బస్సు వచ్చింది. హడావిడిగా, షెడ్డులో నిల్చుకొనివున్న ప్రయాణీకులు ఎక్కారు. ఆ షెడ్డు అంతా ఖాళీ అయింది. బస్సులోంచి ఒక్క అమ్మాయి దిగింది. చిన్న బెడ్డింగూ, ఒక ట్రంకుపెట్టే, ఒక గోనెసంచీ మూటా, కంచు మరచెంబూ, క్రిందకి దింపి, ఆ సామాను తనచుట్టూ పేర్చుకుని అటూ ఇటూ చూస్తూ, నిలబడింది. బయ్ బయ్ మంటూ రెండుసార్లు, బస్ హారన్ మ్రోగించి, దూరాన్నించి ఇంకెవరూ పెట్టెలూ, మూటలూ పట్టుకుని రావటంలేదని, నిర్ధారణ చేసుకున్నాక బస్‌ని పోనిచ్చాడు బస్ డ్రైవరు! ఆ అమ్మాయి బస్సు వెళ్లిన అర్ధగంటవరకూ, అల్లా రోడ్డుమీదకు చూస్తూ నించుంది. ఆ అమ్మాయిని చూస్తూ కూర్చున్నారు మిత్రులిద్దరూ! ఆ చుట్టుప్రక్కల కనుచూపు మేరలో ఎక్కడా రిక్షాలు వస్తూన్న సూచనలు లేవు! కాటుక పులుముకుంటూన్నట్లు, ఆకాశం నాలుగు వెంపులనించీ, చిక్కటి, చీకట్లు ముసురుకుంటున్నది! రోడ్డుమీద వానకి తడిసి నించున్న ఎలక్ట్రిక్ దీపాలు, దిగాలుగా వెంగలేక వెలుగుతున్నాయి. సన్నగా, చాలా సన్నగా చినుకులుకూడా రాలటం ప్రారంభించేయి! రాజా ఒక్కసారి నిటారుగా లేచి నిలబడి, ఒళ్లు విరుచుకుని ఆవలించాడు. జనార్దనం కూడా లేచి నిలబడి, రాజాకేసి చూసి,

'ఇంకా ఆరన్నా కాలేదురా! అప్పుడే ఇంత చీకటడిపోయిందే! వెధవది మబ్బువల్ల కాబోల్సు!' అంటూ నసిగాడు.

'వూఁ!' అంటూ పరధ్యానంగా ఆ అమ్మాయి వెంపు చూస్తూ నడిచాడు. జనార్దనం గుండె ఝల్లుమంది! ఎడమకన్ను అదిరింది! రాజా పద్ధతి జనార్దనంకి బాగా తెలుసును! వంటిగావున్న అమ్మాయిలతో పరిచయాలు సంపాదించటం, ఇంటికి

పట్టుకరావటం, ఆ తర్వాత వ్యవహారాలు, మరీ ముదిరితే, ఏదో వరకో పారేసి వదిలించుకోవటం రాజా నడిపే తతంగం అంతా, జనార్దనంకి ఈవరకే కొట్టినపిండి అయింది!

'పాపం! ఎవరో ఆ అమ్మాయి! చిక్కులో ఇరుక్కుంది!' జాలిగా అనుకున్నాడు! జనార్దనం!

ఆ అమ్మాయి దూరానికి ఒంటిగా జాలిగా, దిగాలుగా నించున్నట్లు కన్పించింది. దగ్గరగా వెళ్ళి చూస్తే, నిబ్బరంగానే కన్పించింది జనార్దనానికి. సాధారణమయిన నేత చీర కట్టుకుంది. రెండు చేతులకి రెండేసి ఎర్రని గాజు గాజులున్నయ్! మెడలో సన్నటి పొడుగాటి చెయిన్ వుంది. కోలముఖమూ, సన్నగా చీలికగావున్న నల్లటి కళ్ళు, నుదురు మీదకు వుంగరాలుగా తిరిగిపోయే నొక్కునొక్కుల చిన్నజెడ, సన్నగా, నాజూకుగా, శేలగా, తెల్లని శరీరమూ రాజా కంటినిండా చూసాడు.

'ఎక్కడికి వెళ్ళాలండి!' చనువుగా అడిగాడు. రాజా. ఆ అమ్మాయి కంగారు పడిపోతుంది. అనుకున్నాడు జనార్దనం. ఆ అమ్మాయి కళ్ళు విప్పుకుని చూసింది. రాజావేపు.

'వూళ్ళోకేనండి! రిక్షాలు ఒక్కటీ కనపడటం లేదా!' ఎన్నాళ్ళబట్టో తెలుసున్నంత ఫ్రీగా అంది.

'ఇదే ఆఖరు బస్సు! పైగా చలిగా వానగా వుంది! అంచేత రిక్షా వాళ్ళు ఇటు వుండటం లేదు. స్టేషను దగ్గర వుంటారు. స్టేషను రెండు మూడు ఫర్లాంగులు వుంటుంది ఇక్కడికి! పోనీ పిల్చుకొని వద్దామన్నా మావద్ద సైకిళ్ళు లేవు! చీకటి పడిపోయిందికదా! మేము మా ఇంటికి పోతాము! మీరు ఒంటరిగా నిలబడ్డారని పలకరించాను! ఏమీ అనుకోకండి!' అన్నాడు రాజా.

'అనుకోటానికేముంది ఇందులో! ఏదన్నా ఖాళీ బండి ఇటువెంపు వచ్చేదాకా, కాస్త సాయంవుండకూడదా మీరు?' అంది ఆ అమ్మాయి.

'చలి వేసేస్తోంది! ఇంక కూర్చోలేము! మీ రెక్కడికి వెళ్ళాలో చెప్పండి! ఇద్దరం వున్నాముకదా! మీకు తోడుగా వస్తాము!' అన్నాడు రాజా.

'నా కీవూరుకొత్త! ఏదయినా హోటలుకి వెళ్ళాలి. మరి చుట్టాలూ, స్నేహితులుకూడా లేరు.' తనలోతనుగా, అనుకుంది. రాజా కనుబొమ్మలు పైకెగిరాయి. జనార్దనం వింతగా చూసాడు, ఆమె వెంపు! చీకటి మూలంగా, ఈ యువకుల ముఖభంగిమల్ని ఆమె కనిపెట్టగల సావకాశం లేకుండగా పోయింది. వీళ్ళతో మాట్లాడుతూనే రోడ్డువెంపు ఆశగా చూస్తోందాయువతి! రిక్షాలు వస్తాయనే ఆశ గగన కుసుమమే అయ్యింది!

'మీకు తెలిసున్న వాళ్ళు లేరా? అయితే ఏ హోటలుకి వెడదామనుకుంటున్నారు?' అన్నాడు సానుభూతి గుమ్మరిస్తూ రాజా.

'నాకు తెలుసున్నవాళ్ళు ఎవ్వరూ లేరండి! నాకీ వూరుకొత్త! ఏ హోటలు మంచిదో నాకెలా తెలుస్తుంది? మీకు ఏది మంచి ప్రాంతమని తెలుస్తే ఆ హోటలుకే దారిచూపండి ఈ పూటకి హోటలులోవుండి తెల్లవారి, నింపాదిగా, వుండటానికేదైనా పోర్షన్ వెతుక్కుంటాను!' అంది ఆ అమ్మాయి.

'దొరికావ్ బిడ్డా!' అనుకున్నాడు, జనార్దనం. ఎగిరి గంతేయబోయి, తమాయించుకున్నాడు రాజా.

'చూడండి! మీ కీవూరు అంతా కొత్త అంటున్నారు. ఇప్పుడా రాత్రి కావస్తోంది! చూస్తూ చూస్తూ ఆడపిల్ల ఒంటరిగా హోటలులో దిగటం, అందులోనూ అర్ధరాత్రి పూటా, వుండటం, ఏమంత మంచిదిగా వుండదు. మీరు చదువుకున్న వాళ్ళలా కనుపించుతున్నారు. అనవసరంగా, సంకోచాలు పెట్టుకోనట్లయితే, మీ కభ్యంతరం లేనట్లయితే, ...' ఆగాడు రాజా.

'లేనట్లయితే?' అంది ఆ అమ్మాయి.

'ఇక్కడికి దగ్గరే మా ఇల్లు! ఆమాటకొస్తే, మా ఇల్లు దాటిపోతేనేగాని, వూరు రాదు. ఈ పూటకి మా ఇంట్లోవుండండి, తెల్లవారినాక మీతిప్పలేవో మీరుపడండి!' అన్నాడు రాజా.

'నా కలాంటి సంకోచాలూ, బిడియాలూ లేవునండి! వుద్యోగాలు చేసుకుంటున్నవాళ్ళం అలాంటి శషభిషలు పెట్టుకుంటే, రోజులు దొర్లటం ఎలాగండి! పదండి. వానకూడా వచ్చేట్టుంది!' అన్నది.

'మా వాడి ఇల్లు చాలా పెద్దదిలెండి. ఇహిహి!' అని నవ్వాడు జనార్దనం. రాజా గుడ్లురిమి చూసాడు. కాని ఆ చీకటిలో జనార్దనానికి రాజా ముఖం కన్పించలేదు. ఆ అమ్మాయి గోనెసంచీమూటా, మరచెంబూ తీసుకుంది. ఇద్దరు మిత్రులూ, ట్రంక్ ఒకరూ, బెడ్డింగు ఒకరూ తీసుకున్నారు. రాజా మౌనంగా, తను ఒక అపరిచితురాలి బెడ్డింగు మోయవలసి రావటం జనార్దనంకి మావెడ్డ విసుగు కలిగింది. 'దొంగవెధవ! అమర్చటం నా వంతూ, అరగింపు—వాడే దీనూ! ఏం చేయను? నాకా ధైర్యం లేదు' అనుకున్నాడు జనార్దనం. ఆ కబురూ ఈ కబురూ చెప్పుకుంటూ రాజా ఇల్లు చేరాడు. ఆ అమ్మాయి పేరు నాగమణి అనీ, మిడిలుస్కూల్లో టీచరుగా వచ్చిందనీ తెలుసుకున్నారు, మిత్రులిద్దరూ! వీధి గదితలుపు తీసి లైటువేసాడు రాజా. దీపంకాంతిలో ఆ అమ్మాయి తడిసీతడవని దుస్తుల్లో, విరిసీవిరియని సన్నజాజిలా వుంది! ఆ పెద్దగదిలో నాగమణి, తన మూటనీ, చెంబునీ, బెడ్డింగునీ, ట్రంకుపెట్టెనీ ఒక వారగా పెట్టి నించుంది, సామాన్లు లోపల పెట్టేక.

'ఇక వస్తారా!' అంటూ జనార్దనం వెళ్లబోయాడు.

'వుండరా! ఏమండీ మీరు భోజనానికి హోటలుకి వెళ్లరూ!' అన్నాడు రాజా.

'వద్దులెండి! ఈ చీకటిలో చలిలో భోజనానికి హోటలు వెతుక్కుంటూ పోలేను. ఈ పూటకి కాలక్షేపం చేసేస్తాను. తెల్లారినాక చూసుకోవచ్చును, అన్నపానాల సంగతి!' అంది నాగమణి.

'అయితే నేను పోతాను. అక్కడికి వెడవాలి. ఒక్కణ్ణీనూ! అరే రాజా! వస్తారా! విష్‌యూగుడ్‌లక్!' అంటూ వెళ్లిపోయాడు జనార్దనం.

'లోపలికి రండి!' అన్నాడు రాజా. రాజా గది, ప్రక్కగదిలో లైటువేసి.

'ఇందులో మీ సామాన్లు పెట్టుకోండి!' అన్నాడు. నాగమణి ఒకొక్క సామానే తెచ్చి, రాజాగది ప్రక్కనున్న గదిలో పెట్టుకుంది. బెడ్డింగు విప్పుకుని ఒక సాదాచీర, జాకెట్టూ తీసుకుని తలుపు జేరవేసుకుని, బట్టలు మార్చుకుంది. రాజా ఇల్లంతా చూపించాడు. నాగమణికి! రామరాజా వుంటోన్న ఇల్లు పాతకాలపు మండువా ఇల్లు! మధ్యన హాలూ, నాలుగు వేపులా పెద్దపెద్ద గదులూ, వీధివెంపూ, పెరటివెంపూ, పెద్ద పెద్ద ఎత్తయిన అరుగులూ వున్నయ్. ఎడమవేపు గదులు తాళాలు వేసివున్నయ్! అందులో ఇంటివారి సామాన్లు వున్నాయట. కుడివెంపునున్న రెండు గదులూ, రాజా వాడుకుంటున్నాడు. అందులో ఒకగదిలో నాగమణి తన సామాను పెట్టుకుంది. పెరటివెంపునున్న రెండుగదులూ జారిపడిన పెంకుముక్కలతో గత్తరగావున్నయి. పెరటిలోనికి వెళ్లాలంటే, ఈ గదుల్లో దేనిలోంచో వకదానిలోంచి వెళ్లవచ్చును. రెండు గదులలోంచీ, పెరట్లోకి గుమ్మాలున్నయి. పెంకులు జారిపోయి, ఆ గదుల గుమ్మాలూ, తలుపులూ, కదలిపోతూ, నేలకి తగులుతూ వుంటాయి. వీధివెంపు పొడుగ్గా పెద్దగదీ దానిలోంచి వీధిలోకి ద్వారమూ, ఎత్తయిన అరుగులూ, వున్నయి. పెరటివెంపు వున్న గదుల్లోని ఒకగదిలో నాలుగు రాళ్లపెట్టి ఒకపొయ్యి, దానిమీద పెద్దకుండా, దానిమీదకి, కుండమూకుడూ, మూలా, వున్నయి. రాజా అందులో నీళ్ల కాచుకుంటూ వుంటాడు.

పెరట్లో అరుగుకి కాస్త ఎడంగా మంచినీటి బావిచుట్టూ, సిమెంటు చేసిన చప్టాతో వుంది. పెరడుచుట్టూవున్న ప్రహారీగోడ పడిపోయిన చిహ్నంగా ఇటుకలూ మట్టీ, కుప్ప కుప్పలుగా పడి వున్నాయి పెరట్లో అక్కడక్కడ దారక్కపచెట్లూ, ముళ్లగోరింటచెట్లూ, తుప్ప తుప్పలుగా వున్నాయి. రెండు మూడు కొబ్బరిచెట్లు సన్నగా నిటారుగా ఆకాశంలోనికి చొచ్చుకుపోయేట్లు నిలబడి వున్నాయి. ఆ ఇంటికివలెనే ఆ కొబ్బరిచెట్లకికూడా వార్ధక్యదశ వచ్చినట్లుంది. ఎండిపోయిన చిన్నచిన్న మట్టలతో వున్నాయి అవి. ఇల్లంతా గచ్చు పగుళ్లిచ్చింది. గోడలకి పెచ్చులూడిపోయాయి. రాజావుండే గదులు మటుకు పరిశుభ్రంగావుండి నీలిరంగు వేయబడి వున్నాయి. రాజాపడుక్కునే గదిలో, సీలింగ్‌ఫానూ, దోమతెర మంచం, టేబులు మీద, మంచి ట్రాన్సిస్టరు రేడియో వున్నాయి. అలమారలో, ఖరీదయిన సెంటుబాటిల్సూ, పౌడరూ, స్నో, క్యూటెకూ, మొదలయిన సామాన్లు అన్నీ చెల్లాచెదరుగా వున్నాయి

ఒక వెంపు మూడు అడుగులున్న చిన్న గ్రాడెజ్ బీరువా వుంది ఇల్లంతాచూసి వచ్చాక,

'చాలా పెద్ద ఇల్లు! అద్దె ఎంత ఇస్తున్నారు?' అంది నాగమణి.

'కరెంటుకాక నలభయి రూపాయలు!' అన్నాడు రాజా.

'ఇంత పెద్ద ఇల్లు మీకా కవసరమే! మీరుండేది ఒక్కరేకదా! ఎందుకు ఇంత ఇల్లు తీసుకున్నారు?' అంది మణి.

'రూం తీసుకుని వుండొచ్చుమకానీ, నాకు పదిమందిలో గలగల్లాడుతూ వుండటం ఇష్టంలేదు. ఇక్కడ పరిసరాలు ప్రశాంతంగా ఏకాంతంగా వుంటాయి. అంచేత అద్దె ఎక్కువయినా ఈ ఇల్లు తీసుకున్నాను.

ఇందులో కూడా మాకో గది ఇయ్యి అంటే, మాకో గది ఇయ్యి అంటూ కొందరు విద్యార్థులు తయారయ్యారు. నేను ఇవ్వదల్చుకోలేదు. వుండేది ఒకళ్లు ఇద్దరూ కుర్రాళ్లు అయినా వాళ్లకోసం వచ్చే సిబ్బందితో ఇల్లంతా ఒక పెద్ద ధర్మసత్రం అయిపోతుంది. అంచేత ఇల్లంతా నా క్రిందే వుంచేసుకున్నాను' అన్నాడు రామరాజు. రామరాజుకి నెలకి రెండు మూడు వందలలోపు జీతం వస్తోంది. వాళ్లు అయిదుగురు అన్నతమ్ములు. రామరాజు ఆఖరివాడు. తల్లి తండ్రీ లేరు. రాజు వాళ్లకి బాగా పొలాలు కూడా వున్నాయి. రాజుకి ఏడాదికీ పొలాలుమీద మూడు వేల రూపాయలదాకా వస్తాయి. అన్నగార్లల్లో ఇద్దరు స్వంతవూళ్లో వుండి వ్యవసాయం చూసుకుంటున్నారు. ఇద్దరు దూరప్రాంతాల్లో వుద్యోగాలు చేసుకుంటున్నారు. వాళ్లకి జ్ఞాపకం వచ్చినప్పుడల్లా, 'రామరాజు'ని వివాహం చేసుకొమ్మని, తమ బంధువర్గంలో ఎవరెవరి ఆడపిల్లలు ఎంతెంత చలాకీగా వుండేదీ, ఎవరెవరు ఎంతెంత కట్నాలు ముట్టచెప్పేదీ, పదేసి అరటావు కాగితాల వివరాలు వ్రాస్తూ, వివాహంయొక్క ఆవశ్యకతని నిరూపిస్తూ వ్రాస్తారు. ఆ వుత్తరాలు చదూకొని నవ్వుకొంటాడు రామరాజు.

రామరాజు గదిలో స్టీలుకారియర్ రెండు అరిటాకులూ వున్నాయి. సాయంకాలం ఏడింటికీ కారియర్ తెచ్చి గదిలో పెట్టి వెళ్లిపోతుంది, పనిపిల్ల తాయమ్మ. దగ్గరున్న గొల్లగూడెంలోవుండే గొల్లపిల్ల తాయమ్మకి పద్దెనిమిదేళ్లువుంటాయి. చిక్కని నలుపురంగులో, చక్కని బింకమైన అవయవ సౌష్ఠవంతో వుంటుంది తాయమ్మ. రామరాజు అప్పుడప్పుడూ తాయమ్మతో కూడా సరదాగా, కాలక్షేపం చేస్తూవుంటాడు. తాయమ్మ, భర్తకి రెండుగేదెలూ, నాలుగయిదు, గొర్రెలూ వున్నాయి. తాయమ్మకి రెండేళ్ల కూతురుకూడా వుంది. దగ్గరగా వుంటంవించి, తాయమ్మకి పనిలేనప్పుడల్లా రాజు ఇంటివెంపు వస్తూవుంటుంది.

'మీకు కారియర్ వున్నట్లుంది! భోజనం చేసెయ్యండి. చల్లారిపోతోంది అనవసరంగా!' అంది నాగమణి. రాజు గదిలోనికి వెళ్లాడు. ఎలక్ట్రిక్‌దీపం కాంతిలో, ఇస్త్రీ బట్టలలో రాజు నలగని పువ్వులా వున్నాడు. రాజు బట్టలు మార్చుకుని, బాత్‌రూంలోకి వెళ్లి కాళ్లూ చేతులూ, ముఖం కడుక్కొని వచ్చి తువ్వాలుతో, అద్దంముందు నించుని, తుడుచుకొంటూంటే, చేతులో, ఎవ్వర్‌సిల్వర్ పళ్లెం పట్టుకుని, నించున్న, నాగమణి కన్పించింది. వెనుతిరిగి,

'ఏమండీ?' అన్నాడు.

'ఏంలేదు. కొద్దిగా ఫలహారం తెచ్చాను. తీసుకొండి!' అన్నది.

'ఇంకా భోజనం చెయ్యాలికదండీ!' అన్నాడు. మొగమాటపడుతూ.

'ఎంతోలేదు కొద్దిగా ఇచ్చాను. తీసుకొండి! ఈ రాత్రిపూటా, ఈ వూళ్లో, తెలియనిచోట్ల, నానా అగచాట్లూ పడకుండగా దేముడల్లే కనిపించారు. మీకు, నే నెల్లా కృతజ్ఞత చూపగలనో తెలీటంలేదు. నాకు!' అంది నాగమణి. రాజు మణికేసి చూస్తూ, 'దానిదేముంది! నాకు చేతయిన సాయం చేసాను.' అంటూ నవ్వాడు.

'మీరు భోజనం ఎక్కడ చేస్తారు?' అంది,

'ఎక్కడో అక్కడ! ఇక్కడే తింటాను.' అన్నాడు,

'పదండి! నాగది ఖాళీగా వుంది కదా! అక్కడ

చేద్దురుకాని! ఈ గది పడకగదిలా వుంది ఇక్కడ, మళ్లీ అంటుచేయటమెందుకు?' అంది మణి.

'నా కలాంటి పట్టింపులు లేవు! ఎక్కడో అక్కడ విస్తరి వేసుకుని తింటాను. కాస్సేపు పోయిం తర్వాత పని పిల్లది వస్తుంది. అంతా బాగుచేసి పోతుంది' అన్నాడు.

'అయితే హాలులో వేస్తాను పదండి! అంది. గుమ్మానికివల నీళ్లుజల్లి శుభ్రంచేసి, అరిటాకు పరిచింది.

'నేను వడ్డించనా! మీకు మొగమాట మెక్కువలాగుంది!' అంది.

'వడ్డించండి!' అన్నాడు.

తన మరచెంబుతో రాజా పడకగదిలోనున్న కూజాలోంచి నీళ్లువంపి తెచ్చి, ప్రక్కగా పెట్టింది. నాగమణి పదార్థాలన్నీ ఒక్కటొక్కటే, అడుగుతూ చక్కగా ఎత్తి ఎత్తి వేసింది. నాగమణి, తనుకూడా తెచ్చుకున్న, ఫలహారాలు జంతికలు, బెల్లంపాకం పట్టిన, వేరుశనగపప్పు వుండలు, చేగోడీలు, రెండు రెండు, వేసింది. రాజా కారియర్‌లో సగం అన్నంకూడా తినలేకపోయాడు. తనచేత బలిమాలించుకోకుండా భయపెట్టించుకోకుండా నాగమణి ఇంత చనువుగా, ఇంట్లో ఎప్పటినుంచో అలవాటు అయిన మనిషిలా ప్రవర్తించటం రాజాకి కొండెక్కినట్లు అనిపించింది. రాజా పరిచయాల్లోకి వచ్చిన స్త్రీలు, ముందు అతి వినయాలు నవ్వులాలూ ప్రదర్శించటం, తర్వాత తర్వాత, ఏడ్పు రాగాలు పెటి పెద్ద మొత్తాలుగా డబ్బు గుంజుకుపోయి. పత్తాలేకుండగా పారిపోవటం! అంతే కాని ఇంట్లో బంధువులా పరిచయం అయిన అర్థ గంటలో మారిపోవటం రాజాకి, అంతా కొత్తగా వింతగా వుంది నాగమణి ప్రవర్తన.

'అయ్యో! మీరు అసలు ఏమీ తినలేక పోయారు. కారియర్ సగానికిపైగా మిగిలిపోయింది. నేను వడ్డించటంమూలాన్నా?' అంటూ నొచ్చుకుంది నాగమణి.

'రోజూ నేనంతే! నాకేం బిడియంలేదు!' అన్నాడు రాజా.

'రాజా బాబూ!' అంటూ బయట గదిలోంచి అడగొంతు వినిపించింది.

'అదుగో తాయి' వచ్చింది. ఆ కారియర్ అదీ కడిగేసి శుభ్రం చేస్తుంది. మీరా లోపలికి రండి!' అన్నాడు.

'కాస్త నిలుచుకోమనండి! నేను కూడా భోజనం చేస్తాను!' అంది నాగమణి.

'అయితే ఆ కారియర్ కడిగేయించి మళ్లీ తెప్పిస్తాను. 'తొమ్మిది' అయిపోతోంది మళ్లీ హోటళ్లలో భోజనం అయిపోతుంది కూడా!' అన్నాడు రాజా.

'మళ్లీ కొత్త కారియర్ తెప్పిస్తారా! ఎందుకు? అందులో నాకుకాక, నలుగురికి సరిపడా అన్నం వుంది. ఇంత అన్నం వేస్టు చేయట మెందుకనే నేను భోజనం చేద్దామనుకున్నది!' అంది నాగమణి.

రాజాకి సంతోషంతో ఊపిరి తిరగటంలేదు. తనకి విస్తట్లో అన్నం వడ్డించటం, తను తినగా మిగిలిన అన్నం తినటం ఏమిటి ఈ స్త్రీ? అతనికి అక్కచెల్లెళ్లు లేరు! ఇంత ఆప్యాయతగా మాట్లాడిన స్త్రీలు, అతని జీవితయానంలో తటస్థపడలేదు ఇంతవరకూ? వదినగార్లు వున్నారు. వాళ్లు తనకి వడ్డించి, తలుపుచాటుకు తప్పుకుని ఏమేమి కావాలో కనుక్కునేవారు. కుశలప్రశ్నలు, పూరివిశేషాలూ, ఏమి కబుర్లు చెప్పినా తలుపుని చూస్తూ వినవలసిందే! తలుపుని చూస్తూనే అడగవలసిందే! రాజాకి పదిహేనేళ్లు వచ్చింతర్వాత వదినల ముఖాలు ఎలా వుంటాయో చూచి ఎరుగడు. రాజాకి సంతోషంతో ఊపిరి తిరగటంలేదు. కాళ్లు ఒక చోట నిలవక, గదిలోంచి, హాలులోకీ, హాలులోంచి గదిలోకి పచార్లు చేస్తున్నాడు 'తాయి' మంచంమీద ప్రక్కదులిపి, పెట్లోంచి, తెల్లని, ఇస్త్రీదుప్పటి తీసి వేసింది. తనుతెచ్చిన, రెండు 'మిఠాయి' కిళ్లీలూ, టేబులుమీద పెట్టింది. 'తాయి'కి రామరాజా, ఇంటికి, స్త్రీలు రావటం అలవాటేకనుక, మణనిచూసి ఆశ్చర్య పోలేదు. తాయి పాయంకాలాలు చక్కగా వేణ్నీళ్లు పోసుకుని ఉలికి అరవేసిన, లంగా, వోణీ వేసుకుంటుంది. గట్టిగా బిగించివేసిన జడలో, పూలు పెట్టుకుంటుంది.

సాధారణంగా పూలులేవి 'తాయి' జడ ఎవ్వరూ చూడరు. కళ్లనిండుగా, చింతాకు వెడల్పున కాటుక, ఎత్తయిన నుదుట, గుండ్రని తిలకం బొట్టూ, కంఠానికి బిగుతుగా, ఎర్రని పగడాలదండ, ఒక విధమైన జానపద సౌందర్యంతో, కళకళ్లాడుతూ వుంటుంది! ప్రక్కదులిపి వేసేక అద్దంలో తన ముఖం చూసుకుంటూ నించుంది తాయి.

నాగమణి భోజనంచేసి ఇవతలికి వచ్చింది, చీర చెంగుతో చేతులు తుడుచుకుంటూ,

'పనిపిల్లది వుందా! వెళ్ల కారియరు కడిగేయమనండి' అంది. తాయి, కారియర్ చూసి మూతి ముడుచుకుంది.

'ఎంత అత్రకొట్టు తల్లి బాబా! పణ్ణంలోకి సాంబారన్నా మిగల్చలేదు!' అనుకొంటూ కారియరు బాత్‌రూంలోకి తీసుకపోయింది. రాజా గదిలోకివెళ్లి, తనొక కిళ్లీ వేసుకుని, మణికికూడా ఒకటి ఇచ్చాడు.

'నాకు తాంబూలం అలవాటు లేదు!' అంది నాగమణి.

ఆ కిళ్లీకూడా తనే వేసుకున్నాడు. తాయమ్మ కారియరు కడిగి తెచ్చి, రాజా గదిలో పెట్టింది. వాళ్లు అన్నాలుతిన్నచోట విస్తళ్లుతీసి, నీళ్లుజల్లి శుభ్రంగా తుడిచింది. హాలులోకివచ్చి—

'ఇంక నే వెళ్తా రాజబాబా!' అంది.

'ప్రొద్దుటే వచ్చెయ్యి!' అన్నాడు రాజా. తాయమ్మ కళ్లు నవ్వాయి.

'అల్లాగే లెండి!' అంటూ జడ భుజం మీద నించి, ముందుకు వేసుకుని, త్రిప్పుకుంటూ వెళ్లిపోయింది. రామరాజా, నాగమణి వంటిగా మిగిలారు. నాగమణి హాలులో నలువెంపులా చూస్తో నించుంది. రాజాకి, నాగమణి] తీరును చూస్తే, మోటుగా మాట్లాడ బుద్ధికావటంలేదు. అల్లా అని కలిగిన ఈ అవకాశాన్ని, అనుభవించకుండా జారవిడుచుకోవటం, సుతరామూ ఇష్టంలేదు. ఏదోవిధంగా, సంభాషణ ప్రారంభించాలి! క్రమ క్రమంగా తన మార్గంలోనికి నాగమణిని లాక్కురావాలి! అంతవరకూ రాజా కంటిమీదకు, కూర్కురాదు!

'చాలా పెద్ద ఇల్లు! ఇంత ఇంటిలో ఒక్కరూ ఎల్లా వుంటారండి!' అంది మణి.

'అమ్మయ్యా!' సంభాషణ దానంతటదే సాగిపోతుంది ఇంక.

'చెప్పానుగా! నాకు ఏకాంతవాసం ఇష్టమని?' అన్నాడు రాజా నర్మగర్భంగా.

'అనవసరంగా నలభయి రూపాయిల ఇల్లు వేస్టు కావటంలేదూ! ఎంతలేదన్నా కరెంటుకి అయిదారు రూపాయిలు అవుతాయి! ఏమంటారు?' అంది మణి.

'పది పదిహేను రూపాయిల్లో వచ్చే ఇరుకు గదుల్లో, ఉక్కిరిబిక్కిరి అవుతూ నేను జీవితం గడపలేను సుమండి! విశాలంగా, హాయిగా, ఏకాంతంగా, రేడియోలో సినిమాసంగీతం వింటూ, ప్రశాంతంగా గడిపేస్తాను. నామీద ఆధారపడి బ్రతకాల్సిన బాదరాయణులు ఎవ్వరూ లేరు. నెలకీ మూడువందలదాకా జీతం వస్తుంది. ఏ నెల జీతం ఆ నెల చుస్తాగా ఖర్చు చేసుకున్నా, ఏడాదికి రెండు మూడువేల రూపాయలదాకా పొలం శిస్తులవల్లవచ్చి, బాంకులో ప్రసవ వేదన పడుతూనే వున్నాయి! వేసినవాళ్లే వెండి కాగడాలా జీవితాన్ని ఆనందంగా అనుభవించక, ఇరుకు మురికి జీవితాన్ని గడుపుతూ రూపాయిలన్నీ మూటలు గట్టి, ఎవరి నెత్తికో ఎత్తాలన్న ఆకాంక్ష నాకు లేదు!' అన్నాడు దర్పంగా రాజా. రాజా మాటలకి కాస్సేపు మౌనం వహించింది మణి.

'నేనొకటి ఆలోచిస్తున్నాను రాజాగారూ!' అంది.

'ఏమిటి?' అన్నాడు రాజా.

'నే నెటూ ఈ వూళ్లో వుండటానికి ఒక అద్దె ఇల్లు వెతుక్కోవలసి వుంది, తెల్లారినాక. ఇంక చాంద్రాయణం ప్రారంభించాలి. మీ ఇల్లు చాలా పెద్దగా వుంది. నాకా, కావలిసినది ఒక గది! నేను ఇంట్లోవున్నా లేనంత నిశ్శబ్దంగానే వుండగలను. నాకు సంగీతం రాదు— కూనిరాగాలతో మీ ఏకాంతవాసం, కాస్తయినా భంగపరచటానికి మీరు 'బాతురూం'గా వాడుకుంటున్న ప్రక్కగదిలో ఒక పూట వండుకు వడేసుకుంటాను. మీకు పీం

యితే, ఇప్పుడు నా సామాన్లు వేసుకున్న గది నా గదిగా వుంటుంది. బాతురూం ప్రక్కనున్న గది తలుపులు గట్టిగా తోస్తే పడిపోయేలా వున్నాయి. అంచేత రాత్రుళ్ళు గిన్నె, చెంబూ, నా సామాను పుచ్చుకున్న గదిలో పడేసుకుంటాను. ఉదయం తొమ్మిదింటికి స్కూలుకిపోతే, తిరిగి సాయంకాలం అయిదుగంటలందాకా రాను. కరెంటుబిల్లు అంటారా— మీరెంత ఇమ్మంటే అంత ఇస్తాను. బయట ఎక్కడికి వెళ్ళినా, ఇరవయి రూపాయ లియ్యందే ఈ మాత్రం ఇల్లు దొరకదు కదా! ఈ ఇల్లు విశాలంగా వుంది. మీరూ వంటరి మనుష్యులు. ఏమంటారు?' అంది మణి.

ఏమంటాడు రాజా! రాజా బుర్ర పని చెయ్యటం మానేసింది. శరీరం అంతా పన్నీటిలో స్నానంచేసినంత మధురిమ అలముకొనిపోతోంది.

'మీ ఇష్టం! కాని, నాకోసం అప్పుడప్పుడు నా స్నేహితులు వస్తారు. వాళ్ళు మిమ్మల్ని ఏదయినా కొంటెమాటలు అంటారేమో! దానికి మీరు మనసు కష్టపెట్టుకోకూడదు మరి!' పెద్దమనిషిలా అన్నాడు రాజా.

'ఆ! క్షురముఖాలు ఏదో అనుకుంటారు. అంతమాత్రానికే బెదిరిపోనులెండి.' ఆరిందాలా అంది నాగమణి.

'అయితే ఫర్వాలేదు! చూడండి. మీరేదో చిన్న స్కూల్లో టీచరుగా వర్కు చేస్తున్నారు. మీకు వచ్చే జీతం చాలా తక్కువ అనుకుంటాను. అందులో నాకు ఇరవయి రూపాయలు ఇచ్చేస్తే మీకు మిగిలేది ఇంకా తక్కువ అవుతుంది. అంచేత మీరు నాకు ఇంటద్దె క్రింద ఏమీ ఇవ్వనక్కర్లేదు. మరేమీ అనుకోకండి. ఏదో నా చేతనయిన సాయం మీకు చేద్దామని అనిపించింది' అన్నాడు.

'నేనేమీ అనుకోను! ఇలాంటి ఉదారం మాకూ అలవాటే లెండి! మా వూళ్ళో మాకు పెంకుటిల్లుకాక, తాటాకుల ఇల్లు కూడా వుంది. ఆ ఇల్లు వూరికే వుండటం ఎందుకని కొత్తగా పెట్టిన ఎలిమెంటరీ స్కూలుకి ఇచ్చేసారు మా నాన్న!

'పల్లెటూళ్ళల్లో అద్దెలు ఇచ్చే దెవ్వరు? అందరూ ఉద్యోగాలవంకని పట్నాలకి ఎగబాకుతోంటేను! ఖాళీగా పడివున్న కొంపల్లో, దీపంపెడితే చాల్పు, అనుకుంటూ వూరికేనే ఇచ్చేస్తారు' అంది మణి.

'మీ నాన్నగారు పల్లెటూళ్ళో ఏంచేస్తున్నారు?' అన్నాడు రాజా.

'మాకు స్వంతపొలం ఏమీ లేదు. ఎవరిదో నాలు గెకరాలు కౌలుకి తీసుకున్నారు నాన్న. నాపైన ముగ్గురు అక్కలున్నారు! వాళ్ళకీ పెళ్ళిళ్ళు అయినాయి. నా తర్వాత ఇద్దరు చెల్లెళ్ళూ, ఇద్దరు తమ్ముళ్ళూ వున్నారు. నేను యస్. యస్. యల్. సి. పాసయ్యాను. సెకండరీగ్రేడ్ ట్రయినింగ్ అయినాను. ఇక్కడే మొదటిసారిగా ఉద్యోగం వచ్చింది' అన్నది నాగమణి.

'అన్నట్లు ఏ స్కూల్లో మీరు వర్కు చేయబోయేదీ' అన్నాడు రామరాజు.

'రాజంపేటలోట! శివ కామేశ్వరీ గరల్సు మిడిల్ స్కూలట!' అన్నది నాగమణి.

'రాజంపేటా! అవ్వ—ఆ కొసాన వుంది! మన జనార్దనంగాడి ఇల్లు అక్కడే! మైలూ, మైలున్నర దాకా వుంటుంది! అంత దూరం మీరు రోజూ వెళ్ళి రాగలరా! రిక్షాలయితే బోలెడు డబ్బు అడుగుతారు' అన్నాడు.

'ఫరవాలేదు. నేను రోజూ నాలుగుమైళ్ళు నడిచి, ప్రక్క వూళ్ళో స్కూల్‌కి వెళ్ళేదాన్ని! నాకు నడక అలవాటే' అంది.

'అయితే ఫరవాలేదు. మీకు స్కూలుకి దగ్గరగా మకాం, కావాలంటే జనార్దనం చూసి పెడతాడు ఇల్లు!' అన్నాడు.

'అక్కర్లేదంటున్నాగా! నేను వుండటంవల్ల మీకేం ఇబ్బంది కలగనియ్యనులెండి!' అంటూ తన గదిలోకివెళ్ళి, బెడ్డింగు విప్పి పక్క సర్దుకోసాగింది. రాజా వెనకాతలవెళ్ళి గుమ్మంపై కమ్మి పట్టుకుని నించున్నాడు. మణి ప్రతి కదలికనూ అత్యంత శ్రద్ధాసక్తులతో పరిశీలించుతున్నాడు. నాగమణి లైటార్పి పడుకోబోతూ రాజాని చూసి లేచి—

'ఏమిటి నిలబడ్డారు? ఇంకా నిద్ర రావటం ?' అంది.

'ఏం లేదు, ఏం లేదు. మీ రేలా సర్దుతున్నారో చూస్తున్నాను' అన్నాడు.

'అదా! నాకేం వుంది సర్దుకోవటానికి? వంటసామాన్లున్నాయి. రేపుదయం సర్దుకొంటాను. గుడ్ నైట్!' అంది.

'గుడ్ నైట్!' అంటూ వెనుతిరిగాడు రాజా. రాజా తన గదిలోనికి చేరుకునేలోగా, తన గది తలుపు నెమ్మదిగా చప్పుడుకాకుండా వేసి గడియ పెట్టివచ్చి పడుక్కొంది నాగమణి. నడుం వాల్చీవాల్చకుండానే అలసిన ఆమె కన్నులమీదకి నిద్రాదేవి వచ్చి కూర్చుంది. రాజా వచ్చి తన మంచంమీద కూర్చున్నాడు. కళ్లు మండుతున్నాయి, 'ఎంత నిశ్చింతగా పడుక్కుంది మణి! ప్రతీ స్త్రీలూ, ఇంత కలిసి కట్టుగా వుండరెంచేత! పలకరిస్తేనే చాలు సిగ్గుతో ముడుచుకుపోతారు! భయంతో వణకిపోతారు! ఆ భయాలూ, సిగ్గులూ చూస్తే చేతుల్లోకి తీసుకునేదాకా వదల బుద్ధవదు! మణి తీరు తానెరుగున్న స్త్రీలకంటె విభిన్నంగా వుంది! తనవల్ల పెద్ద ప్రమాదం ఏమీ జరగదన్నంత నమ్మకం ఆమెకి ఎందుకు కలిగింది? కళ్లు వాల్చేయటం, నవ్వులని బిగించటం, పమిట చెంగులు సర్దుకోవటం — ఈ లక్షణా లేమీ లేవు ఈమెలో! ఛత్! వుట్టి జడ్డివెధవనయిపోయాను ఇవ్వాళ! ఆమె ఏదో ప్రత్యేకపు తరహా వ్యక్తి అని నాకు నేనే తలుస్తున్నాను. వెళ్లి ఈమట్టున ఆమెని గట్టిగా నా హృదయానికి హత్తుకుంటే ఏంచేస్తుంది? ఇష్టంవున్నా లేకపోయినా, కాస్సేపు గింజుకునయినా లొంగిపోక తప్పదు. లొం పోయినాక—

'మీరూ ఇల్లాంటివారేనా!' అంటుంది. అంటే ఏం? నేను మామూలు మనిషినే! నాకు, నాకు లేనిపోని మర్యాద ముసుగు నువ్వే, వూహించుకున్నావు! అనేస్తాను.

'కాదు! మామూలు మనిషికారు! పశువుతో సమానం మీరు!' అంటుంది ఏడుస్తో. అరే! మణి ఏడవటం ఎందుకు? ఏడవకేం చేస్తుంది! మర్యాద రామన్నలా నీడకి పిలిచి, ఆమె సర్వస్వం కొల్లగొట్టితే, ఆమె ఏడవక ఏం చేస్తుంది! తప్పు! ఆమెని ఏడిపించకూడదు. ఆమె నమ్మకాన్ని వమ్ము చేయకూడదు.

'ఛత్! ఏమయింది నాకివ్వాళ! చేతుల్లో వున్న ఫలితాన్ని అనుభవించకుండా ఇన్ని వెధవాలోచన లడ్డుపడుతున్నా యేమిటి! మును పెప్పుడన్నా ఇల్లా జరిగిందా! ఎంచేత నేను అశక్తుణ్ణి అవుతున్నాను? ఇంక జాగుచేసే కొద్దీ ఇంకా పాడు ఆలోచనల్లు ముసురుకుంటున్నాయి! వెంటనే వెళ్లి మణిని చేతుల్లోనికి తీసుకుని, గాఢంగా ఒక్కసారి హృదయానికి హత్తుకొని, ఆ లేత చెక్కిళ్లని తనివి తీరా ముద్దు పెట్టుకుంటే—తర్వాత—తర్వాత...అంతా మామూలే అయిపోతుంది! దృఢ నిశ్చయం చేసుకుని గబాగబా మణిగదివైపు నడిచాడు. నుదుటికి తలుపు గట్టిగా తగిలేదాకా మణి తలుపు వేసుకుందని రామరాజకి తెలీలేదు.

'అబ్బ! చచ్చేట్లు దెబ్బకొట్టింది! తలుపు వేసుకుందన్నమాట! జాగ్రత్తకలదే! అయినా ఎక్కడికి పోతుంది? వంటింటి కుందేలు అయిపోయింది. ఇవ్వాళ కాకపోతే రేపు!' హాలులో అర్ధరాత్రిదాకా ఇటూ అటూ పచార్లుచేస్తూ యమయాతనపడ్డాడు నిద్రరాక రాజా!

తెల్లవారి, 'తాయి' వచ్చేసరికే నాగమణి లేచి, నూతిదగ్గర స్నానంచేసి, బట్టలుతికి ఆరవేసుకుంది. తాయమ్మ నాగమణిని చూసి విస్మయపడింది. రాజకోసం వచ్చిన స్త్రీలు తూర్పు తెల్లవారుతోనే ఇంత పరిశుభ్రంగా స్నానం అదీచేసి, 'ఉత్తమా ఇల్లాలు'లా వుంటం అది ఎరుగదు. తాయి వచ్చి లేపితేకాని, ఆ స్త్రీలు లేచేవారుకాదు. వాళ్లకి బాల్చీలో నీళ్లు తోడి పెట్టి, టూత్ పేస్టు, బ్రష్షు, సోపు, టవలూ, 'బాత్ రూం'లో పెట్టి, ఫ్లాస్కు పుచ్చుకుని హోటలుకి పరిగెత్తి కాఫీ ఫలహారాలు తెచ్చేది. వాళ్లు నిక్క నీలుగుతూ, ముఖప్రక్షాళనం అయిందనిపించి, ముఖమన్నా సరిగ్గా తుడుచుకోకుండా తాయమ్మ తెచ్చిన కాఫీ టిఫెన్లూ ఊదేసేవారు. దానికి పావలో, అర్ధో బక్షీసు డబ్బులు పడేసి, తమదారిన తాము పోయేవారు! నాగమణి అల్లాకాదు, చక్కగా, తలదువ్వుకుంది! ఆ చిన్నజెడలో, చిన్న మునుగోరింట పూదండ పెట్టుకుంది. నుదుట దోసగింజంత బొట్టు పెట్టుకుంది! ఆకుపచ్చ, ఎరుపు, కలనేతనేసిన ఎర్రంచుచీర కట్టుకుంది. 'బాత్ రూం' ప్రక్కనున్న గది శుభ్రంగా

దులిపి కడిగి ముగ్గు పెట్టివుంది. అందులోవున్న అలమారులో, గోనెసంచీ మూటలోంచి, రకరకాల సైజుల డబ్బాలూ, సీసాలూ, సర్దుతూ కన్పించింది నాగమణి.

'కాఫీకి వెళ్లనా అమ్మాయిగారూ?' అంది తాయి.

'ఎవరికి?' అంది మణి.

'మీకేనండీ! రాజాబాబు ఒటేల్లో తాగుతారు!' అంది తాయి.

'నాకా! నాకు కాఫీ అలవాటులేదే పిల్లా! ముందు వీధి అరుగులు శుభ్రంగా కడిగి గుమ్మంలూడ్చి ముగ్గు వెయ్యి! ఇవ్వాళ మంగళవారం కూడానూ!' అంది నాగమణి.

'కిరాయికి వచ్చిన బాపతు కాదల్లే వుంది! రాజాబాబుకి దూరంబంధువు ఎవరో అయివుంటుంది! ఈ శుభ్రం అదీ ఆ 'సానిసాప'లకి రమ్మంటే వస్తుందీ! ఎంతసేపూ పాతగోడలకి వెల్లవేసినట్లు ముఖాలకి పౌడర్లు, రంగులూ పూసుకుని తిరగమంటే తిరుగుతారు. గుంటముండలు! అనుకుంటూ తాయమ్మ అరుగులు కడిగి, గుమ్మం వూడ్చి కళ్లాపి చల్లి, చక్కగా తీర్చిదిద్ది ముగ్గులు పెట్టింది. లోపలికివచ్చి 'బాత్‌రూం'లోని కుండలు కడిగి, నీళ్లు చేది తెచ్చిపోసి ఇల్లంతా శుభ్రంగా వూడ్చింది. నాగమణి వచ్చి 'పిల్లా, నీ పేరేమిటి?' అంది.

'తాయారు అండి!' అంది.

'రాజా బాబు నీకేమిస్తారు?' అని అడిగింది.

'నెలకి అయిదు రూపాయలు ఇస్తారమ్మా!' అంది.

'నేను కూడా రెండు రూపాయి లిస్తాను. పుదయంపూట నా గిన్నెలు కూడా తోమి పెట్టుతూండు!' అంది నాగమణి. తాయారు కళ్లు విప్పుకుని చూసి–

'మీరు రాజాబాబు చుట్టపోరు కారాండి!' అంది.

'ఆయన దే కులమో కూడా నాకు తెలీదు! నే నీ వూళ్లో పంతులమ్మ వుద్యోగానికి వచ్చేను. ఈ ఇంట్లో అద్దెకి వచ్చాను' అంది మణి.

'రాజాబాబు బ్రాహ్మలే అయివుంటారులెండి! మెళ్లో జంజెం వున్నది' అంది తాయారు.

'సర్లె! ఆయన దే కులం అయితే నాకేం? సీవుమటుకు నాకు కూడా పనిచేసిపోతూండు' అంది నాగమణి.

'అల్లాగేనండి! మీరింతగా చెప్పాల్నా! అయితే నాకు తెలీక అడుగుతాను. మీరూ, రాజాబాబూ ఒక బళ్లో చదూకున్నారామ్మా!' అంది తాయి.

'అవును కానీ, ఇక్కడికి బొగ్గుల దుకాణం దగ్గరా, దూరమా!' అంది నాగమణి.

'అంతదూరం కాదులెండి!' అంది తాయి.

'అయితే ఒక రూపాయి బొగ్గులు వేయించుకొనిరా! మార్కెట్టుకి వెళ్లి, నాలుగు అరటికాయలు పట్టుకొనిరా' అని డబ్బులు ఇచ్చింది నాగమణి. తాయి బజారుకి వెళ్లింది.

రాత్రి తెల్లవార్లూ నిద్దరాక కొట్టుకలాడి కొట్టుకలాడి తెల్లవారుఝామున వెర్రినిద్ర కమ్ముకుపోగా బాగా ఝాము పొద్దెక్కాక లేచాడు రామరాజు. రాత్రి నిద్రలేమి కారణంగా కళ్లు బాగా ఎర్రబారి ఉబ్బివున్నయ్! అతను లేచి హాలులోకి వచ్చేసరికి, ఎక్కడా చెత్తా చెదారమూ లేకుండగా శుభ్రంగా ఊడ్చి వుంది. ముఖం కడుక్కోందుకు వీధి అరుగుమీదకు వెళ్లేసరికి కలకల్లాడుతూ పచ్చగా జల్లిన కళ్లాపుమీద తెల్లనిముగ్గు మురిపించింది. ముఖం కడుక్కుని, తువ్వాలుతో తుడుచుకుంటూ మణివున్న గది దగ్గరకు వచ్చాడు. మణి గుమ్మంవేపు వీపుపెట్టి కూర్చొని దొసకాయ పన్నగా ముక్కలు తరుగుతోంది. ఒక కుంపటిమీద, గిన్నెలో అన్నం, ఇంకో కుంపటిమీద గిన్నెలో పప్పూ తుకతుకలాడుతూ, కమ్మని వాసన వస్తోంది. తలుపుల్లేని అలమారలో చిన్న చిన్న జాడీలూ, సీసాలూ, డబ్బాలూ వరసగా అమర్చి వున్నాయి. ఒక వెంపు మూలగా గోడకిందుగా మేకు కొట్టి 'గోవూ, గోపాల క్రిష్ణుడూ' చిత్రించివున్న కాలెండరు వ్రేలాడగట్టి వుంది. గోడకి దిగువన చిన్న బెజ్జంలో రెండు వూదొత్తులు వెలిగించబడి సన్నని సువాసన గది అంతటా వ్యాపించుతోంది.

నిశ్శబ్దంగా పొందిగ్గా కూర్చుని తనపని తాను, ఏకాగ్ర చిత్తంతో చేసుకుంటూన్న నాగిమణిని చూసేసరికి ఎక్కడలేని పూజ్యభావమూ కలిగింది రాజాకి. నిన్నటి దాకా దుమ్మూ ధూళీ పేరుకుపోయిన ఆ గది ఆ అమ్మాయి చేతిస్పర్శతో ఈ రోజు ఒక పవిత్ర దేవాలయపు రూపు సంతరించుకోవటం చూస్తే, రాజాకి స్త్రీలలో ఒక 'దైవత్వమయిన సౌందర్య దృష్టి' వుంటుం దనిపించింది. ఆ నిర్మల కమనీయ మూర్తిని నివ్వెరపాటుడై చూస్తూ, అల్లానే నిలబడిపోయేడు రామరాజా.

క్షణం గడిచాక, ఏదో మాపులవేడి, తన వీపుకి గుచ్చుకున్న స్ఫురణరాగా వెనుతిరిగి చూసింది.

'లేచారా? ముఖం కడుక్కున్నారా?' ఎంతో సహజంగా ప్రశ్నించింది. రాజాకి సిగ్గువేసింది. రాత్రి అంతా ఆమెగురించి ఆలోచించిన ఆలోచనలూ, అవి అన్నీ ఆమెకి తెలిసిపోయినట్లు బాధపడ్డాడు రాజా! తెల్లవారి ఒకే పరిసరాల్లో ఎన్నాళ్లనించో కలిసిమెలిసి మసలుతూన్న ఆత్మీయుణ్ని పలకరించినట్లు పలకరించింది మణి.

ఏమి మాట్లాడలో తెలీక—

'తాయి వెళ్లిపోయిందా?' అన్నాడు.

'లేదు. ఒక అణా పెరుగు పోయించుకుని రమ్మని పంపాను. కాఫీకి ఆలస్యం అయిపోతూందా ?' అంది మణి.

'లేదు! హోటలుకిపోయి ఏకంగా ఫలహారం కూడా చేసి ఆఫీసుకిపోతాను. మీరు త్వరగా తెములండి! వంటా, పెంటా అంటూ కూర్చుంటే, పది అయిపోతుంది?' అంటూ, బాత్‌రూం వెంపు వెళ్లాడు రాజా. వెళ్లినవాడు మళ్లీవచ్చి, 'అన్నట్లు మీరు కాఫీ తీసుకున్నారా?' అన్నాడు.

'నాకు కాఫీలూ, టీలూ అలవాటు లేవు! మా ఇంటిదగ్గర 'తరవాణి' అన్నం వుండేది. అందరితో బాటు అదే తినేదాన్ని!

'ఇక్కడ ఒక్కదానికి ఏం తరవాణి పెట్టుకుంటాను? అంచేత పెందరాళే వండుకుని తినేస్తాను. అన్నట్లు సాయంకాలం మీరు నా దగ్గరే భోజనం చేయాలి! కారియర్ వద్దని చెప్పేస్తాను. ఈ పూట నాకుమటుకే వండుకున్నాను' అంది మణి.

'మీకు కాఫీ అలవాటు లేదా! ఈ కాలంలో స్వతంత్రంగా ఆర్జించుకుంటున్న స్త్రీలు ఇంత నిరాడంబరంగా జీవించటం నేను ఎక్కడా చూడలేదు! మా ఆఫీసులో సెనో వుంది. ఆమెగారు రోజుకి ఆరుసార్లు 'బోర్నివిటా'లు తెప్పించుకుంటుంది. ఆమె హాండ్‌బాగ్‌లో 'సారిడన్'లూ, 'ఆస్ప్రో'లూ లేకుండా ఎప్పుడూ వుండవు! ఆమె హోటలు బిల్లు ఎంత లేదన్నా నెంకి నలభయి—యాభయి రూపాయిలదాకా అవుతూ వుంటుంది!' అన్నాడు రాజా.

'హోటలు బిల్లు అంత అయిందంటే, అంతకి రెట్టింపు డాక్టరు బిల్లూ అవుతుందన్నమాటే! నేను ఆమెగారంత, లక్జరీగా జీవించటానికి వీలుమిన్నచాలవులెండి' అంది మణి.

రాజా స్నానంచేసి బట్టలు వేసుకునేసరికి మణి భోజనంచేసి రెడీ అయ్యింది. తినగా మిగిలిన అన్నం ఒక పళ్లెంలో పెట్టి, గిన్నె బోర్లించి, తలుపుకి గొళ్లెంపెట్టి, తన గదిలోంచి పుస్తకాలూ, తాయి వింగు ఆర్డరు కాగితం పుచ్చుకుని హాలులోనికి వచ్చి నించుంది. రాజా ట్రిమ్‌గా ముస్తాబయ్యాడు. రాజా తన గదికి తాళం వేస్తుంటే—

'బాబూ, కారియర్ ఇవతలదెయ్యండి!' అంటూ తాయి వచ్చింది.

'చప్పున తీసుకో' అన్నాడు రాజా.

'నేనాక పొరపాటు చేసాను' అంది మణి.

ఏమిటన్నట్లు ప్రశ్నార్థకం కనుబొమ్మలు పైకెత్తి చూసాడు.

'ఇల్లు అద్దెకి తీసుకోవాలనుకున్నానా? ఒక్క తాళం కూడా తెచ్చుకోలేదు! ఈ పూటకి మీ తాళం ఇస్తారా? నా గదికి వేసుకుంటాను' అంది.

'తీసుకోండి! సాయంకాలం ఒక తాళం కొందాం లెండి!' అన్నాడు.

మణి తాళం తీసుకుని గదికి తాళంవేసి, తాళం చెవి, చేతిరుమాలుకి కట్టుకుని వచ్చింది.

'మీకు ఎల్లాగయినా జాగ్రత్త ఎక్కువ!' నడుస్తూ అన్నాడు రాజా.

'జాగ్రత్తగా వుండకపోతే ఎల్లా? ఆ గదిలో నాకు నెల్లాళ్ళకి సరిపడా గ్రాసం వుంది. పనివాళ్ళని నమ్మలేంపమ్మండీ! వాళ్ళకి ఇల్లు అప్పగిస్తే ఆ సామాను వారంరోజుల్లో వూడేస్తారు! ఈ కరువురోజుల్లో ఏ సామాను అయిపోయినా కొనుక్కోవటం కష్టం!' అంది.

ఇద్దరూ రోడ్డుమలుపు తిరిగారు. జనార్దనం వాళ్ళకి ఎదురువస్తూనే—

'హల్లో రాజా! ఏమిటి విశేషాలూ? ఏమండీ మణిగారూ? రాత్రి బాగా నిద్రపట్టిందా?' అంటూ కొంటెగా నవ్వుతూ పలకరించాడు. రాజా ముఖం ముడుచుకున్నాడు. మణిమటుకు తెల్లకలువలా నవ్వుతూ —

'గుండెలమీద చేతులువేసుకుని నిద్రపోయానండీ' హాయిగా! నేను ఈ వూరు రాగానే, మీ మిత్రులు తటస్థపడటం నా అదృష్టం అనుకోండి! ఆయన ఇచ్చిన చనువుకొద్దీ ఈ వూళ్ళో వున్నన్నాళ్ళ ఆయన ఇంట్లోనే మకాం పెట్టేయదల్చుకున్నాను కూడా! ఇంత చప్పున నాకు ఇల్లు దొరుకుతుంది అనుకోలేదు,' అంది.

'ఆహా! అల్లాగా! అయితే రాజా ఇంట్లో భాగస్వాములై పోయారన్న మాట! యూ ఆర్ లక్కీ!' అన్నాడు జనార్దనం. రాజా ముఖం పొగాకుకాడలా ముడుచుకు పోయింది. నాగమణిని స్కూలుదగ్గర విడిచిపెట్టాక—

'ఏరాభైయ్యా? తైరు 'రాంబా' కొట్టోంది! పెళ్లికూడా చేసుకుంటానని వాగ్దానం జేసావా ఏమిటి కొంపదీసి?' అన్నాడు జనార్దనం.

'ఇష్టం వచ్చినట్లు మాట్లాడకురా! మరీ వాలుకని అంత స్వేచ్ఛగా వదిలెయ్యటం అన్నివేళలా మంచిదికాదు!' కోపంగా అన్నాడు రాజా.

'ఏమయిందిరా నీకు? వచనం విరసం అయ్యిందేమిటి?' అన్నాడు జనార్దనం.

'నేనూ మనిషినేరా జనా!' అన్నాడు ముఖం దీనంగా పెట్టి.

'ఓరి! నువ్వు మనిషివి కాదన్న దెవరు? అసలు ఏం జరిగిందో చెప్పకూడదా! ఇన్నాళ్ళనించీ, నీ కష్టసుఖాల్లో పాలుపంచుకుంటున్న వాణ్నేకదా! నా చెవి నో ముక్క వేయకూడదురా!' అన్నాడు ఓదార్పుగా జనార్దనం.

'మరి కప్పించిన స్త్రీనల్లా, నేను అనమానించుతానన్న వూహ నీ కెందుకు కలిగింది? నేను అందరిపట్లా అంత నీచంగా ప్రవర్తించుతా ననుకున్నావా?' అన్నాడు రాజా.

'ఇంతలో నీ కింత జ్ఞానోదయం కలుగుతుందనుకున్నాట్రా! మనం ఎప్పుడు అమ్మాయిలని తీసుకొచ్చినా అందుకేగదా పాపం! ఈ ఇల్లాలు ఏదో తన ఇబ్బందుల్ని బాగా వర్ణించి నీనించి బోలెడంత సానుభూతి లాగివుంటుంది. ఏదో మన పాత అలవాటు కొద్దీ అడిగాను కాని, నువ్వు మనిషివి కావన్నానా? ఇంకనన్నా నీవు నిజంగా 'ఏకాంత ప్రియుడవైతే' సంతోషించే వాళ్లల్లో నేనే మొదటి వాణ్ణని జ్ఞాపకం వుంచుకో!' అన్నాడు జనార్దనం.

రాజా మాట్లాడ లేదు. ఆఫీసులో అంతా కూడా, మూగగా నిర్వేదంగా తన పని తను చేసుకుంటూ కూర్చున్నాడు. ఆఫీసు వదిలిం తర్వాత—

'ఏరా?' అంటూ కూడా వచ్చాడు జనార్దనం.

'మొత్తానికి భలే ఆవిడలే! సరిగ్గా ఇల్లాంటి ఆవిడ నీకు భార్యఅయితే, నీకు మునుపున్న ఆడపిచ్చి అంతా నిమిషంలో వదిలించేసుండేది! ఒకే కప్పుకింద పద్నాలుగు గంటలు నీతో గడిపికూడా నిన్ను దూరంగా మేనేజ్ చేయగల్గిందీ అంటే, మైగాడ్! మణి నిజంగా దేవతయినా వుండాలి! కాకపోతే, దేవతకి వికృతి స్వరూపమయినా అయివుండాలి!' అన్నాడు.

'మరీ అంత అశ్లీలంగా మాట్లాడకు భాయి!' అన్నాడు రాజా.

'పడ్డావులే ప్రేమలో!' అన్నాడు జనార్దనం.

'నీ ముఖం! ఏనుగ్గ' అన్నాడు.

'మరీ అంత తేలిగ్గా అనెయ్యకు భాయి! నీకు ఆమెఅంటే, భయమూ, భక్తీ కుదిరాయని నాకు తెలుస్తూనే వుంది. మీ అన్నయ్యకి వ్రాసేస్తాను. సలక్షణంగా మూడుముళ్లూ వేసి ఒకింటివాడవై వన్ను

అప్పుడప్పుడూ భోజనానికి పిలుస్తూండు వాళ్ళు!' అన్నాడు.

'నువ్వేం వ్రాయక్కర్లేదు' అన్నాడు రాజా.

'అరే! అప్పుడే వ్రాశేసావా? ఎంత సూక్ష్మ బుద్ధివిరా' అన్నాడు.

'ఆఫీసు కొస్తూనే వ్రాసాను! నిజంగా ఎందేతో నాకు నాగమణిని చూస్తే, చాలా ఇదిగా వుంది. మున పటి జీవితం అంతా బురదలో కూరుకుపోయినట్లు అనిపించింది. ముందుగా నాకు నేనే ఆవిడని ఇల్లాంటి మాటలు అడి కష్టపెట్టలేను. పెద్దన్నయ్యకి వ్రాసాను. ఆయన రాగానే మణి వూరుకి పంపించి, వాళ్ళ నాన్నగారితో సంప్రతించ మంటాను. పెద్ద వాళ్ళద్వారా సంభాషణలు జరిగితే బాగుంటుంది. ముందు, నాకు నేనే ఇల్లాంటి మాటలు మాట్లాడి ఆమెముందు నన్ను నేను హీనపరుచుకో లేను' అన్నాడు రాజా.

'ఓర్నీ! నాకు చెప్పకుండా ఇంత ఆలోచన దాచుకున్నావురా? చాలా సంతోషంరా!' అన్నాడు జనార్దనం. ఇద్దరూ ఇంటికి వచ్చారు. ఇంటిముందున్న ముగ్గూ అదీ చూడగానే—

'చూసావురా జనా! ఆమె చేతి స్పర్శతో ఇంటికి ఎంత కళ వచ్చిందో! సమర్థురాలైన స్త్రీ ఆవిడ!' అన్నాడు సంతోషంగా రాజా.

'అవును. అవును.' అన్నాడు జనార్దనం. మణి ఇంట్లో హడావిడిగా తిరుగుతోంది. ఆ గదిలోంచి ఈ గదిలోకి, ఈ గదిలోంచి ఆ గదిలోకి తిరుగుతోంది.

'ఏమిటండీ హడావిడి!' అన్నాడు జనార్దనం.

'వచ్చారా! మీ సంగతే అనుకుంటున్నాను. రాజాగారు ఈ పూట ఇక్కడే భోజనం చేస్తారు. మీరు కూడా భోజనానికి వుండండి!' అంది మణి.

'వూరికే వచ్చే భోజనాన్ని నేను వదులుకోను లెండి! కాస్త కూరలూ అదీ దండిగా చేయండి! కందిపొడీ, ఆవకాయా తినీతినీ జిహ్వ చచ్చిపోయింది!' అన్నాడు.

'చలాకీగా మాట్లాడుతారు మీరు!' అంటూ మెచ్చుకుంది మణి.

'మీ రాజాకం టేనా?' అన్నాడు జనార్దనం.

'ఎల్లాగయినా మీ రిద్దరూ చాలా సంస్కార వంతులు! ఈ రోజుల్లో కూడా స్త్రీని గౌరవంగా చూడకలిగే మీ సంస్కారం నిజంగా ఎంతో ఉన్నత మైనది! ఉద్యోగాలుచేసే స్త్రీలు ఇంట్లో, ఆఫీసుల్లో కూడా, ఎన్నో అవమానాలపాలు కావలసివస్తోంది. మీలాంటి సంస్కారవంతులు మాటికి పదిమంది వున్నా చాలును—స్త్రీలు ధైర్యంగా తమ పనులు తాము చేసుకోగలరు' అంది మణి.

'ఏమిటండోయ్! ఉపన్యాసం ఇచ్చేస్తున్నారు!' అంటూ రాజా బట్టలు మార్చుకుని హుషారుగా వచ్చేడు.

'నీ మంచితనాన్ని వేనోళ్ల పొగడుతున్నారు మణిగారు!' అన్నాడు జనార్దనం.

'ఆదా! ఏదో మనుష్యులం! తోటి మనుష్యులకి కలిగిన దానిలో ఆ మాత్రం ఉపకారంచేస్తే ఏమయి పోతాం?' తేలిగ్గా అన్నాడు రాజా.

'అంతా మనుష్యులేనండీ! కాని కొంతమంది మనుష్యులు, అవకాశం ఇచ్చిన అలుసు చూచుకొని, పశువులకన్నా హీనంగా ప్రవర్తించటం నేను చాలా చోట్ల విన్నాను. విద్య. ధనం, బలంవున్న మీలాంటి యువకులు ఇంత సంస్కారం, ఇంత ఉదారతా ప్రద ర్శించటం చూస్తే ఇంకా మనదేశంలో ఏమూలో మన ధార్మిక నైతిక సూత్రాలు తలెత్తే వున్నాయనిపించు తోంది! నిజంగా మీలాంటి పచ్ఛీలంగల యువకులే జాతీయ ఐక్యతని నిలబెట్టగలరని నా నమ్మకం!' వివశంగా అంది మణి.

రాజా గాఢంగా నిట్టూర్చాడు!

'మా రాజాగాడికి పది మణుగుల బంగారం టోపీ పెట్టేరు' అన్నాడు జనార్దనం. 'తాయమ్మ' చేతులో గుప్పెడు కరివేపాకుతో వచ్చింది.

వస్తూనే—

'రాజాబాబూ, అనసూయమ్మగారు కనపడ్డారు. మీరు వూళ్ళో వున్నారా అని అడిగారు' అంది.

'సరే! వెళ్ళు.' గాబరాగా నసిగాడు రాజా. తాయి ముసి ముసిగా నవ్వుకొంటూ.—

'మణమ్మా! ఇదిగో కరేపాకు!' అంటూ గుమ్మంలో పడేసి వెళ్ళిపోయింది.

మణి చాలా వంట చేసింది. గెస్ట్‌లకోసం పెరుగు వడలు, పులిహోర చేసింది. తను చక్కగా స్నానం చేసి, శుభ్రమయిన చీర, జాకెట్టు ధరించింది. అరుగు మీదకు వచ్చి వించుంది. ఇంకో అరుగుమీద ఈజీ చెయిర్స్ వేసుకుని, రాజా, జనార్దనం కూర్చున్నారు. ఇవ్వాళ వాళ్ల పాత అలవాట్లు చాలా మార్చుకున్నారు. బస్సుస్టాండుకి కాలక్షేపంకోసం వెళ్లటం మానివేసారు. మణి అనే ఉత్తమ స్నేహితురాలితో కబుర్లు చెప్పుకుంటే చాల్ను – వాళ్లకి కావల్సినంత కాలక్షేపం!

'కూర్చున్నారేం? ఇవ్వాళ బస్టాండుకి వెళ్లరా?' నవ్వుతూ అంది మణి.

'నిన్న అంటే మీరు వస్తారని వచ్చాం. ఇవ్వాళ ఎందుకు వెళ్లతాం?' అన్నాడు జనార్దనం.

'నేను వస్తానని ఎలా తెలుసు?' అంది.

'మా రాజాగారికి కల వచ్చిందిట. అందులో ఒంటరిగా ఒక అమ్మాయి వస్తుంది' ఆ అమ్మాయికి ఆతిథ్యం ఇవ్వాల్సిన పూచీ నీదే!' అని ఒక దేముడు చెప్పాడుట. అందుకని వానయినా చలియినా మీరు వచ్చేదాకా కాపువేసాడు!' అన్నాడు.

'భలేగా మాట్లాడుతారు!' అంది నవ్వుతూ. రాజా మణికేసి చూస్తూ మాట్లాడటంలేదు. ఆమె నిల్చున్న తీరు, మాట్లాడుతూన్న తీరు అంతా అతనికి ఎంతో ముచ్చటగా వుంది. ఈ మణి తనకి అపురూపంగా దొరికిన బంగారు బొమ్మ! ఈ బొమ్మని తను జాగ్రత్తగా తన హృదయ మందిరంలో ప్రతిష్ట చేసుకున్నాడు. ఇంక కొద్దిరోజుల్లో ఈ మణీ తానూ చేయీ, చేయీ కలుపుకుని, నూతన జీవితం ప్రారంభిస్తారు!

'వివాహం' అనే పవిత్రబంధంయొక్క విలువ తనకి, మణిని చూసేక కలిగింది! తాను మారిపోయేడు! మణి దృష్టిలో తను ఉత్తమ సంస్కారి అయినాడు. బురదలోంచి కమలం ఉద్భవించినట్లుగా తనలోంచి, తన దుర్గుణాలలోంచి సంస్కార లక్షణాలు ప్రభవిల్లుతున్నాయి. తను మనిషి! మంచిమనిషి! సంస్కారి! ఉత్తమసంస్కారి! పారవశ్యంగా కళ్లు మూసుకున్నాడు రాజా.

వినురుగా 'రికా' ఆగిన చప్పుడయింది! అందులోంచి బక్కగా పొడుగ్గా దిగిన యువకుడు, బెడ్డింగు చేత్తో పుచ్చుకుని నిలబడ్డాడు.

'రండి. రండి. నిలబడ్డారేం?' అంటూ మెట్లు దిగి అతని చేతిలోని బెడ్డింగుని పుచ్చుకుంది మణి.

'మీ స్కూలుకి వెళ్లాను. మీ హెడ్ మిస్ట్రెస్ 'బస్టాండ్‌కి వెళ్లే దోవలో చివరి ఇంట్లో వున్నారట?' అని చెప్పారు. ఇది అవునా కాదా! అని ఆలోచిస్తున్నాను' అన్నాడు అతను.

'స్కూలుకి చాలాదూరం! అయినా అద్దె లేకుండా ఇల్లు దొరికిందికదా అని ఇక్కడే వుందామనుకుంటున్నాను!' అంటూ అతన్ని లోపలికి తీసుకవెళ్లింది. జనార్దనం ఆశ్చర్యంగా చూసేడు. రాజా కళ్లు విప్పలేదు! కలల్లో తేలుతున్నాడు. ఆ కలల్లో రాజా మణీ మేఘాలలో విహరిస్తున్నట్లు చిత్రాలు కన్పడుతున్నాయి. అరగంట గడిచాక, మణీ, అతనూ బయటకు వచ్చేరు.

'వీరే ప్రస్తుతం ఈ ఇంటి యజమాని రాజా గారు! ఈయన వారి మిత్రులు సహోద్యోగి జనార్దనం గారు!' అంటూ పరిచయం చేసింది వాగమణి.

'నమస్కారం! మణి అంతా చెప్పింది! మీరు చూపిన ఉదారత మమ్మల్నెంతో ముగ్ధుణ్ని చేసిందండీ రాజాగారూ!' అన్నాడు అతను.

'ఆ! దానికేముంది లేండి!' తేలిగ్గా అన్నాడు రాజా.

'ఈ వూరికి ట్రాన్స్‌ఫరు చేయించుకునే సరికి నాతలప్రాణం తోకకి వచ్చిందంటే నమ్మండి! తిరిగీ తిరిగీ, ప్రాణం విసిగెత్తిపోయింది. ఈ అధికార్లు బాబూ మాలాంటి వాళ్లగోడు విన్పించుకోరు.' అన్నాడు అతను.

'మీరేం చేస్తున్నారు?' అన్నాడు రాజా.

'జె. పి. హైస్కూల్లో టీచరుగా వర్కు చేస్తున్నాను. ఈవూరు వేయమంటే ఎంత పుడుక్కుని చచ్చారనుకున్నారు?' అన్నాడు అతను.

'ఎందుకు మీరీ వూరు కోరుకున్నారు? ఇక్కడి హైస్కూలు పిల్లలు రావణాసురులు!' అన్నాడు జనార్దనం.

# సాంఘిక నవల - సమాజము

## శ్రీ కొలకలూరి ఇనాక్

మానవుడు సంఘజీవి. కళాకారుడు తన సృష్టిలో సమాజమును సాక్షాత్కరించుకొనును. బాహ్య ప్రకృతి మానవాంతఃప్రకృతిని మహిమాన్వితమొనర్చును. కళాకారుని కోమల హృదయము ద్వివిధ ప్రకృతుల మూలమున స్పందించును. సమాజమునకు దూరముగా కళాతపస్వి మనుగడలేదు. అందుచేత కళా సృష్టిలో ప్రయత్న పూర్వకముగనో, అప్రయత్నముగనో తరతమ భేదములతో ఆ కళాకారుని కన్నతల్లి సమాజము ప్రతిబింబించును.

చతుష్షష్టి కళలలో లలితకళలు ప్రసిద్ధములు. సాహిత్యము సర్వోత్కృష్టముగా భావితము. ప్రభాభాసురము. ఇతరేతర సాహితీ ప్రక్రియలలో నవలస్థానము సముచితమయినది. నవలాకారుడు తన నవలయందు ప్రదర్శించినంత సమకాలీన సమాజము మరి ఏ ఇతర ప్రక్రియాదక్షుడును ప్రపంచించుట కష్టము. జాగరూకతగల నవలా రచయిత యావత్సమాజమును దిఙ్మాత్రముగా చూపి, తల లూపింపగలడు.

ఆంధ్ర జీవితమును చూడ యత్నించు సాహితీ విద్యార్థి భారతీయేతర భాషలనుండికాని, ఇతరేతర దేశ భాషలనుండికాని అనూదితములయిన నవలలు వలన సాఫల్యము పొందలేడు. ఆ నవలలలో తెలుగువారల తీరుతెన్నులు తెలియవు. ఆ కారణముగా ఆంధ్రనవలల యందు మాత్రమే తెలుగుజాతి జీవితము, తెలుగు సమాజము సందర్శనీయములు.

ఇచ్చట ఒక యవరోధమున్నది. నవలలయందే వివిధ రచనా విధానమున్నది. తెలుగువారు స్వతంత్రముగా రచించిన రచనము లన్నింటిలో ఆంధ్ర సమాజము అవగతము కాదు. అందుకు సాంఘికములు కాని నవలలు సమర్థములు కావు. ఆధునికులు వ్రాయు చారిత్రాత్మక నవలలు కాని, అపరాధ పరిశోధక నవలలుకాని ఆంధ్ర సమాజమును ప్రదర్శించు అవకాశము లేవు.

మరియొక ఆటంకము. ఆధునికులు ప్రసిద్ధులు అయిన రచయితలు, రచయిత్రులు ఇతర వాఙ్మయముల నవలలవలన ప్రభావితులై విరచించిన పెక్కు రచనములలో తెలుగు జీవితము దృగ్గోచరముకాదు. అందువలన తెలుగులో తెలుగువారు వ్రాసిన నవలా సాహిత్యములో కొన్ని నవలలు, సమాజ సందర్శన దృష్టితో పరిహార్యములు. బెంగాలీ హిందీ రచనల ప్రభావముతో ఆంధ్రమందు సృజింపబడిన నవలలు కొన్నింటిలో తెలుగుదనము మృగ్యము.

ఈ ప్రక్రియయందు సమాజ జీవితమును ఒక సంపూర్ణ వ్యవస్థను, స్థూలముగా చిత్రించు అవకాశము, అధికతరము. పరిమిత కాలమును స్వీకరించి, ఆ సమయములో సమాజమును— ప్రజల జీవితము, వారి మనస్తత్త్వములు, సుఖదుఃఖములు, ఆహార విహారములు, ఆచార వ్యవహారములు, సంభాషణా సంవిధానము, సన్నివేశ సామర్థ్యము, పాత్రల రూపరేఖలు, మనోభావములు, మానసిక సంఘర్షణములు ఆశలు ఆకాంక్షలు; ఒకదశనుండి మరొక దశకు, ఒక స్థితినుండి మరొక స్థితికి మనుజుడు, వ్యవస్థ, దేశము పొందుచున్న పరిణామమును, ప్రాత సంప్రదాయముల పరిచ్యుతి, క్రొత్త సిద్ధాంతముల స్వీకృతి,—చిత్రింపవచ్చును. పరిణామ శీలియయిన మానవుడు అనూహ్య భావి లోపలకు నిరంతరము చేయు ప్రయాణము, అట్టివారితో కూడియున్న వ్యవస్థ ఆది భవిష్యత్తుపై చిత్రింపగల ముద్ర సాకల్యముగా చర్చించి విరచింప వీలగు సాహితీ ప్రక్రియ నవల.

ఒక వ్యవస్థను ప్రదర్శింపగల నవలలు తెనుగు సాహిత్యములో 'వేయి పడగలు' 'మాలపల్లి' మొదలగునవి. ఆధునిక జీవిత ప్రభావముతో వెనుకబడిపోవుచున్న నిష్కల్మషమైన ఆంధ్ర జీవిత విధానమును చిత్రించి, గత సంస్కృతి శిథిలాంశపైన పుష్పించి

నిలచిన కళాచిహ్నము 'వేయి పడగలు'. వర్ణవ్యవస్థ వలన అవర్ణనమయిన మానవ జీవితము సమాజగత పరిణామ ప్రవర్తకమై పొందు పరివర్తనము ప్రస్తావించి సాహితీ పరిమళము ఆంధ్ర సమాజమునకు సమర్పించిన నవల 'మాలపల్లి'.

ఇటువంటి నవలలను వ్రేళ్లపై లెక్కింప వచ్చును. ఇంతకాలముగా నవలారచనము ప్రారంభమయి, ఇంత సముజ్జ్వలముగా జరుగుచున్న ఇంత కాలములోను, రావలసియున్నంత నవలా సాహిత్యము — వ్యవస్థ చిత్రీకరణ దృక్పథముతో— వెలువడలేదని చెప్పవలసియే యున్నది.

పరిణామము జీవద్వస్తువులకు సహజగుణము. సంచలనము, అస్థిరత పరిణామ ప్రదర్శకములు. సమస్యలు పరిణామ కారణములు. ఆధునిక సమాజమున సమస్యలు బహువిధములు, బహుధా ప్రవర్తితములు. సమస్యలు పరిష్కార వాంఛితములు. పరిష్కారము క్రియాత్మకము. వాగ్రూపము. వాగ్రూపములలో నవల ఒక ప్రక్రియ.

అంటరానితనము పూర్వము నాలుగు పాదాల వర్తిల్లిన అధర్మము. అనంతరము ఒకటియో రెండునో పైదొలగిపోయిన అర్థధర్మము. తత్పరిష్కారము సాహితీవేత్తల సదభిప్రాయ మెటులున్నను రాజకీయవేత్తలు, సంఘసంస్కర్తలు, దయచేసిన సమన్వయ మార్గము. కులాంతర, వర్ణాంతర, మతాంతర వివాహ విధానము. అది ఎందరో రచయితల రచయిత్రుల నవలా రచనమునకు ప్రేరకము. ఆ నవలలు అనేకములు అయినను సాధించిన సాఫల్యము ప్రశ్నాత్మకము.

ఒక సమస్యా పరిష్కార ప్రాణములయిన నవలల యందు ఆదర్శవాదనము త్రదతి మిక్కుటము కాని జీవితము, సమాజ సందర్శనము అత్యల్పము. నవల సమస్యలను పరిష్కరింపలేక పోయినను చింతలేదు కాని, సమాజమునకు సమీపస్థము కాలేక పోయిన బాధ. సాహిత్యము సమస్యను ప్రకటించును, పరిష్కార మార్గమును చూపించును కాని, పరిష్కరింపలేదు.

'తెలుగు నవలయందు ప్రపంచితమయినది ముఖ్యముగా హైందవ జీవితము. మహమ్మదీయ, క్రైస్తవ మతముల మాటలేదు. హరిజనుల జీవితము చిత్రితమయినది. పంచములపై రచయితల కున్న జాలి, దయ తదితరులపై తక్కువగానున్నవి. కొన్ని పాత్రలు, కొన్ని సంఘటనలు అల్పముగా పైవారల గూర్చి నవలలలో గోచరించును కాని, పూర్తి నవల మృగ్యము. సమాజములోని సమష్టి జీవితము చిత్రింప గలిగినప్పుడు సాహిత్యము ప్రయోజనాత్మకము, విశిష్టము కాగలదు. ఏవంవిధ రచనము, రచనా వ్యవసాయములో ఆరితేరిన రచయితలకు ఘంటాపథము. కల్పనలకు, కవితాత్మకు దూరముగా, జీవితము జీవితముగనే దర్శింపగల ఋషితుల్యుడయిన రచయితకు అది సుపథము.

వర్తమానమున దేశరక్షణము విచిత్ర సమస్య. ఈ సమస్యకు పరిష్కారమార్గము తెలుగు నవలలు చూపలేదు. ఇతరేతర విదేశ భాషలలో సైన్యజీవితము చిత్రించిన రచయితలు తెలుగుదేశము లేకపోవుట అందుకు కారణము కావచ్చును. నిన్న మొన్నటి యుద్ధములను పురస్కరించుకొని వెలువడిన రచనలు సాహితీ జీవితమును పొందలేక పోయినవి.

తెలుగువాట హాస్యమెంత ఆమోదకరమో, శృంగారమెంత రసరమ్యమో, అంతగా సర్వజన సంబంధి అయినది ఆహారము. అది సమస్య అయినప్పుడు, తత్పరిష్కార మార్గము ఇతివృత్తముగా ఎన్నినవలలు వెలువడినవన్న ఆలోచనీయమే కాని వచనీయము కాదు. భావితరాలు బానిసలు కాకుండ జీవింపవలెనన్న జాగరుకులై మెలగవలసిన ఆంధ్రులకు జనాభా పెరుగుదలపై వెలువడిన నవలలు ఏవియున్న సమాధానము శూన్యము.

ఆధునిక సమాజమున ఎటు చూచినను సమస్యలు. వీనిపై రచనలు లేకున్నచో సాహిత్యములో సమాజము ప్రతిబింబించుట ఎట్లు? తెలుగు రచయితలు సమకాలీన సమస్యలపై సమగ్రముగా ఆలోచించుట లేదన్న అనుమానము అస్మదీయము. అపవాద అపేక్షితము. నలుగురు నడచిన బాటలో అంగలు పంగలు వేయుచు అడ్డమాకలులేక సాగిపోవుట చింత లేనిపని, శ్రమలేని పద్ధతి. రచయితలు పాతబాటలలో సాగిపోవుచున్నారు. రచనలు పాత వాసనతో ప్రభవించుచున్నవి. ఎప్పటికప్పుడు వినూత్నత వెల్లివిరియుట లేదు.

పురాణేతిహాస ప్రసిద్ధమైన ఇతివృత్తము కాని, ఉన్నత వ్యక్తి జీవితచరిత్ర కాని మాత్రమే వస్తువుగా స్వీకరింపవలెనన్న నియమము ఏమియును నవలా రచయితలకు లేదు. ఉన్నత వ్యక్తిత్వము ఏవ్యక్తి జీవితము నయినను చిత్రించు నవకాశము నవలా కారులకున్నది. అదియును హద్దులతో, అవధులతో కూడినది కాదు. ఏవ్యక్తిని అయినను, ఎటువంటి జీవితము కలవాని నయినను, మంచి చెడ్డల ప్రసక్తి లేకుండ నవలాపాత్రగా, అవ్యక్తి జీవితము నవలేతివృత్తముగా స్వీకరణార్హము.

ఈ విషయము తెలుగు రచయితలకున్న ముందడుగు ప్రశంసాపాత్రము. సమకాలీన భారతీయేతర సాహిత్యములలో చోటులేని పాత్రలు, పాత్రల జీవితములు తెలుగు నవలయందు చోటు చూచికొన్నవని విజ్ఞుల యభిప్రాయము. ఈ నవలలు జీవిత వైవిధ్యము దర్శించినవి. పసివాని జీవితమునుండి వృద్ధుని బ్రతుకువరకు, గుమాస్తా దైన్యమునుండి కలెక్టరు సంతుష్టివరకు, బడిపంతులు మొదలుకొని విశ్వవిద్యాలయాచార్యునిదాక, విద్యార్థుల ప్రేమకలాపాల మొదలిడుకొని, వృద్ధుల తుది ఘడియల విలాపాల దాక మధ్యస్థమయిన అందరి బ్రతుకులలోని అన్ని దశలు వస్తువులుగా, వస్త్వంతర్భాగములుగా రూపములు దిద్దుకొన్నవి.

ఆంధ్ర రచయితలు పరిమిత పరిధినుండి పరిశీలనచేసి, రచనలు సాగించుచున్నారా అనిపించక పోదు. అల్ప పరిశోధనకు బదులు అనల్ప పరిశోధన, సంకుచిత సమస్యకు బదులు విశాల సమస్య, వ్యక్తిగత భావనమునకు బదులు దేశగత భావనము ఆంధ్ర రచయితలు పెంపొందించుకొనవలసి యున్నదనవచ్చును.

పెండ్లి, పెండ్లికాని పిల్లలు, కట్నములు, పెండ్లిచూపులు, తల్లిదండ్రుల కష్టములు, కన్నీరు ఇత్యాది సమస్యాసహిత నవలా సామ్రాజ్యము ఆంధ్ర సాహిత్యములో విస్తృతముగా వ్యాపించినది. ఇవి సమస్యలు కావని కాదు. కావచ్చును. ఒక కోణమునకు సమస్యగా గోచరించినది, వేరొక దృక్కోణమునకు సమస్య కాకపోవచ్చును. పరిశీలనానంతరము పెక్కు సమస్యలకు మూలకారణము ఏ ఒక్కటియో గోచరించు అవకాశము లేకపోలేదు. ఆ సమస్యను స్వీకరించి రచన చేసిన వ్యక్తి విశాలపరిధినుండి జీవితము పరిశీలించిన ద్రష్ట కాగలడు ఆ వ్యక్తియే ఉత్తమ స్రష్ట కాగలడు. కీ॥ శే॥ బుచ్చిబాబు, కీ॥ శే॥ అడవి బాపిరాజు, 'చివరకు మిగిలేది' 'నారాయణరావు'లయందు విశాలదృక్పథము ప్రదర్శించిన ద్రష్టలు. స్రష్టలు! సార్వకాలికము, సార్వజనీనము అయిన వస్తువును రూపొందింపలేకపోయినను, బహుకాలికము బహుజనీనము అయిన వస్తువునయిన తీర్చిదిద్ద అవకాశము రచయితలకు విశాలదృష్టిలో జీవితము పరిశీలించిన అనంతరము సంప్రాప్తమగును. ఏవంవిధ రచనా పద్ధతికి ఈ మధ్య కొందరు రచయితలు ప్రయత్నించుచున్నారు.

ఈ ప్రక్రియయందు కృషిచేయువారిలో సముచితస్థానము రచయిత్రుల కున్నది. గృహప్రాంగణము నుండి దేశప్రాంగణమునకు అవతరించిన స్త్రీమూర్తి జీవిత దశాపరిణామములో రచనా జీవితము కాంతిమంతము. బహుకాలముగా అవ్యక్తమయిన స్త్రీ హృదయము ఈ ప్రక్రియవలన వ్యక్తమగుచున్నది. చీకటి కోణమునుండి వెలుపలకు రాక క్రుంగిపోవు సత్య సమూహము వెలుగులు సోకి దేదీప్యమానముగా ప్రకాశించు దశ, అమూల్యముగా స్త్రీ స్వరూప స్వభావములు, దద్విశిష్టత ప్రతిబింబించు స్థితి నవల యనుగ్రహించినది.

స్త్రీ పురుషులు తమ రచనములయందు వ్యష్టిగా దర్శించి చిత్రించిన జీవితము, పరిశీలనానంతరము సమష్టిగా సమాజమును, పరిపూర్ణ వ్యవస్థను ద్వివిధ జీవితమును, చూడగలస్థితి రచయిత్రులు ప్రసాదించినట్లు భావించుకొనవచ్చును. ఆ ప్రయత్నమునకు ఆధునికాంధ్ర సాహిత్యము ఉదాహరణప్రాయము.

నవలేతివృత్తము సమాజగతము, సమాజ సమారాధితము. నవలయందు సమాజమును ఉన్నది యున్నట్లుగా చిత్రించుట శ్రమాయత్తము, విఫలము, రసహీనము కాని నవలయందు గోచరమగు ద్వివిధ ప్రకృతి సమాజమునకు ప్రతిబింబము కావచ్చును. సమాజగతమయిన సమస్తము నవలయందు

అవర్ణ్యము. వర్ణించు పట్టుదల వీలుకానివని, కూడని ప్రయత్నము. నవలయందు వర్ణించుటకు తగిన 'అంశ' సమాజమందుండును. సమాజమంతయు నవలయందు ప్రతిబింబితము కాదు. కాని నవలయందున్న సమాజమంతయు వాస్తవ సమాజమునకు ప్రతిబింబము. ప్రతిబింబము వేరు. వాస్తవము వేరు. అందుచేత, నవలలో సమాజముండును. ఎంత యధికముగనున్న అంత ఉచితము. కాని, సమాజములో నవల యుండదు నవలాంశ యుండును. నవలయే యున్నట్లు తోచినది పతనదశ! ప్రవర్తిల్లు సమాజములోనుండి అమూర్తమయిన నవల జనిర్మించి, సమాజమును చిత్రించి, సమాజమునకు దర్పణముగా దశాంతరములో మూర్తిమంతమగునది నవల.

పాత్రలు సజీవములుగా నుండవలెనని విమర్శకుల అభిప్రాయము. ఆ పాత్రలవలన నవలలో సమాజము సందర్శనీయమగునని అభిమతము. అది స్వీకార్యమే. అయిన, సజీవములుగా నుండుట అనగానేమి? జీవరహితములుగా పాత్రలుండునా? అది పరిశీలనార్హము.

ఎదుగు బొదుగు లేక, ఎక్కడుంటివె నల్లరాయి అన్నచో వేసినచోటనే అనునట్లున్న వ్యక్తులు సమాజములో జీవించినవారే అయినను, నవలలో నిర్జీవపాత్రలు! త్రికాలాబాధితమయి, మార్పులేని, పరిణామము చెందని, హృదయధ్వని వినిపించని, ఆశలు ఆకాంక్షలు లేని మత్తత మూర్తీభవించినట్లున్న, నిరుపయోగముగా నున్న, కదలికలేని, సంచలనము లేని, మన్నుదిన్న పెంజేరులవంటి మనుష్యులు—ఎదుటివారికి ఎటువంటి స్పందన కలిగింపలేనివారు, సమాజములో సజీవవ్యక్తులే అయినను, నవలలో పాత్రలుగా నిర్జీవములు. తద్భిన్నముగా ప్రవర్తించు మనుష్యులు, సమాజమున అజా *పజా లేనివారే అయినను నవలలో చిత్రితమయిన* ఆ పాత్రలు సజీవములు.

దరిద్రుడు ధనవంతుడుగా, కలవాడు నిరుపేదగా, మూర్ఖుడు ఉత్తముడుగా, ఉత్తముడు మూర్ఖుడుగా, యమునివంటివ్యక్తికి తను చంపిన ప్రాణుల గూర్చి కన్నీరు ప్రవహించువాడుగా, దేవునివంటి మనుష్యునికి తన సృష్టిపట్ల అసహ్యము కలిగినవాడుగా, యంత్రాలయమున పనిచేయువాడు కళాకారుడుగా, కళాకారుడు ఫ్యాక్టరీకూలీగా పరిణామము చెందినట్లయితే, వారివారి జీవితము సమాజములో ఏతీరుగా నున్నను, ఏయే కారణములచేత పీడితులు తాడితులు అయినను, సంచలనముచేత, హృదయధ్వని వల్ల, జీవిత గమనములో కుదుపులవల్ల ఆ వ్యక్తులు నవలలో పాత్రలుగా సజీవములు.

పూర్వాచార పరాయణులు, ఆధునికులు, ఎటు మారినను, కేపిటలిష్టులు సోషలిష్టులు ఎటు పరిణమించినను, మంచిచెడ్డల ప్రసక్తి అటుంచి ఆ వ్యక్తులు నవలలో పాత్రలయినప్పుడు. ఆ పాత్రలు సజీవములు.

ప్రతిదినము కళాశాలకు పోవుచు వచ్చుచున్న విద్యార్థిలో ఏమి మార్పు లేకపోయినచో, ఆ పాత్ర నవలలో నిర్జీవము. ఏ మాత్రము మార్పు వచ్చినను ఆ పాత్ర సజీవము. మార్పు, పరిణామము నిర్జీవ పాత్రకు సజీవత ప్రసాదించును. ఒక దశనుండి మరొక దశకు, ఒక స్థితినిదాటి వేరొక స్థితికి చేరుకొన్నప్పుడు పాత్రలు సజీవములగును. సమాజగతమయిన సర్వులు నవలలయందు పాత్రలు కాలేరు. పాత్రలయిన వ్యక్తులు సమాజమునుండిమాత్రమే రాగలరు. ఏ రచయిత అయినను, ఏ వ్యక్తిని అయినను పాత్రగా స్వీకరించి చిత్రించి ఆ పాత్రవంటి అనేక వ్యక్తులను తలపింప గలిగినచో ఆ పాత్ర సజీవము. రచయిత శక్తి సామర్థ్యములనుబట్టి పాత్రల సజీవత, నిర్జీవత వ్యక్తమగును.

ఆధునిక నవలయందు రచయితలు చాలవరకు సజీవపాత్ర సృష్టి చేయగలుగుచున్నారు. రచయిత్రుల మాటవేరు. స్వభావ దూరముగా, కల్పనామయముగా, జీవితమునకు భిన్నముగా, ఏదేని మంచి గుణమునో, చెడ్డగుణమునో వ్యక్తీకరించుటకో అనునట్లు పాత్ర *సృష్టి చేయుచున్నారు.*

సమాజమున పూర్ణ సత్పురుషుడు కాని, (గాంధీజీయందు లోపములు చూపినవారు లేకపోలేదు) పూర్తి దుష్కర్ముడు కాని (హంతకునియందును గుణముగా చూపిన వారున్నారు) లేరనుట వివాదాంశము కనుపోవచ్చును. ద్వంద్వాతీతులు లేరు. ద్వంద్వముల కలయికలో మాత్రమే మనుజాల మనుగడ. ఎక్కువ

మంచివాడు, ఎక్కువ చెడ్డవాడు సమాజములో నుందురుకాని పూర్తి సత్పురుషుడు, పూర్ణదుష్టుడు సమాజమందుండుటకు అవకాశము తక్కువ. సమాజమునలేని వ్యక్తులను పాత్రలుగా సృష్టించుట సమాజ చిత్రీకరణము కాదు.

భాష మృతము, అమృతము అయియుండును. మృతభాషకాని మృతావస్థయందున్న భాషకాని నవలా రచనమునకు స్వీకరించిన సమాజ వ్యక్తీకరణము సాధ్యముకాదు. మృత్యు సమీపస్థుడైన వృద్ధునకు నూత్నయౌవనారంభ దశయందున్న యువతిని యిచ్చి పెండ్లిచేయుట ఎంత తగనిదిగా భావింపబడునో, అటులనే మృతావస్థయందున్న భాషలో నవల వ్రాయు యత్నము సముచితము కాదు. ఇప్పుడు సామాన్యీకరణముపొంది సర్వులచేత కంగీకరింపబడనగు వ్యావహారికములోనే నవల వ్రాయుట ఉచితము. అదియే రచయితలందరును స్వీకరించుచుండిరి. తద్భిన్నులయిన కొందరి ప్రసక్తి ఇటనప్రస్తుతముకదా!

వ్యావహారికములో.— విశాఖపట్టణము శ్రీకాకుళము ప్రాంతపు మాండలికము, ఉభయ గోదావరుల మాండలికము, గుంటూరు–విజయవాడల భాషా పద్ధతి, తెలంగాణా భాష, రాయలసీమ భాష,— ఐదు ధోరణులు స్థూలముగా గోచరించును. అందరి మాతృభాష ఆంధ్రమే అయినప్పటికి మాండలికములు సామాన్యులయిన అందరికిని అందుబాటులో లేవు. అర్థముకావు. ఒకమాండలికమునందు నవలవ్రాయుట, ఆ మాండలికమును వెలుగులోనికి తెచ్చు ప్రయత్నమునందు ఉచితమేకాని, నవలాప్రయోజనము దృష్టితో ఆలోచించిన ఎడల అనుచిత మనిపింపక తప్పదు.

స్వీకృతేతివృత్తము కారణముగా, ఒకప్రాంతపు మాండలికమును ప్రయోగించు రచయిత ప్రశంసాపాత్రుడు. రచయిత తనంత తానుగా మాండలికమును ప్రయోగింపక, పాత్రలవలన మాండలిక ప్రభేదము చూపించుట యుచితము. ఐదుప్రాంతముల మనుష్యులు ఐదుగురు ఒక్కచోట కూడినప్పుడు, భిన్న మాండలికములు ప్రయోగించుచు, అనగా పాత్రలవలన పలికించుచు, సామాన్యీకరణము పొందిన వ్యావహారికమునందు రచనచేయు రచయిత మిక్కిలి ప్రశంసాపాత్రుడు.

అమృత మాతృభాష ఎప్పుడును హృదయస్పందనమును ప్రతిధ్వనించునదిగా నుండును. మాండలికము మరింత హృదయాకర్షకము. అయినను మాండలికమునందే నవల నంతయును వ్రాయుటచేత ఇతర ప్రాంతమువారల కది అర్థవంతము, పూర్ణభావస్ఫోరకము కాలేకపోవచ్చును. భిన్నమాండలికములు పాత్రల సంభాషణమున ప్రయోగించి, ప్రసిద్ధవ్యావహారికము నవలాభాషగా ఏర్పరచి రచింపబడు నవలల కొరకు ఆంధ్రసాహితీ జగత్తు ఎదురుతెన్నులు చూచునుటలో సందేహములేదు. ఇట్టి రచనలు శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి, శ్రీ పోరంకి దక్షిణామూర్తి తదితరులు వ్రాయగలరని ఆశింపవచ్చును.

సంభాషణలు సమాజమును సందర్శింప సమర్థములు. భాష అమృతమయినప్పుడు సంభాషణము చైతన్యవంతము, నవలాగత సమాజప్రకాశకము.

సంఘమునందు సంభాషణ చతురతతో కూడినది. కొందరు ఒకటి రెండు మాటలతో ఎంతయో విషయమును తెలుపగలరు. మరికొందరు ఎన్నియో మాటలు వ్యర్థముచేసియును హృదయగత విషయమును స్పష్టముగా చెప్పలేరు. ఆంగిక చేష్టలవలన అనంత విషయము నందగించువారు, పదములకు, వాక్యములకు మధ్య పరమార్థము ప్రతిష్ఠింపగలవారు చెప్పిన మాటలకంటే, చెప్పని మాటలలో హృదయగత భావము ఇమిడ్చి పలుకగలవారు ఎందరో కలరు. అటువంటి మనుష్యులమధ్య సంభాషణము వ్రాయగలుగుట నిజముగా ప్రతిభావంతునకుకూడ పరీక్ష. అట్టి సంభాషణములవలన సమాజమును ప్రత్యక్షీకరింపవచ్చును.

భార్యాభర్తలమధ్య సంభాషణములో ప్రత్యల్ప విషయమునకును 'భగవంతుడుకూడా నిన్ను క్షమించడు'వంటి పలుకులు జాగరూకతగల రచయిత పలికింపడు. ఆ పలుకులు సమాజ సాక్షాత్కారము చేయింపలేవు. జీవితము కవిత్వమువలె, కల్పనవలె నుండకపోవచ్చును. ఎక్కడో ప్రయోగింపబడిన ఒండు రెండు పల్కులు సర్వసామాన్యముగా భావించుట తగినది కాదు. సహజముగా మాటలాడుకొనుటలో ప్రయుక్తము కాని విధానము రచనముతో చూపించుట దోషమే యగును.

నవలా రచయితల కొద్దిమంది, రచయిత్రు

లలో మరికొద్దిమంది అసహజముగా నుండు సంభాషణములు నిరాఘాటముగా వ్రాయుచుండుట రసజ్ఞులు ఉచితజ్ఞులు గమనించిన విషయమే! అది పరిహార్యము.

అల్ప వ్యతిక్రమణముల మాటకేమికాని, ఆంధ్ర నవలా ప్రపంచమున అధికముగా సంభాషణా చాతుర్యము శ్రవణపేయము. సమాజమును నేత్రపర్వముగ చూపునంత సముజ్జ్వలము.

సన్నివేశ చిత్రణమువలన సరసుడయిన రచయిత సమాజ చిత్రణము సాధింపగలడు. ఈ విషయమున సన్నివేశస్థలము, విభిన్న మనస్తత్త్వములుగల పాత్రలు ఏకవిషయమును, ఒక విషయమునకు సంబంధించిన ఇతర విషయముల గూర్చి సంభాషణము, భిన్న పాత్రల ఏకస్థలమున సమావేశ మగుటయందలి ఆగత్యమును, అవసరమును కూలంకషము పరిశీలింపగల రచయిత చక్కని సన్నివేశ కల్పనము, సమాజ సహజముగా చేయగలడు. చిత్రింపగలడు.

పూర్వము పల్లెలలో ఇటువంటి సన్నివేశములకు రచ్చబండలు చెట్టునీడలు ఆటపట్టులు. అవి మార్పు చెంది పార్కులో రేడియోయున్న ఇంటి ప్రాంగణములోనికి సన్నివేశస్థలములు మారినవి. పట్టణములలో క్లబ్బులు వినోద స్థలములు అప్పటికి ఇప్పటికి మున్నవి. సన్నివేశ స్థలములు ఎన్నియయినను కల్పింపవచ్చును. ఎన్నియయిన స్వీకరింపవచ్చును.

సన్నివేశములో సంభాషణ సమగ్రముగా పోషింపగల రచయిత ఉత్తముడు. వ్యక్తుల భావ శాబల్యము నిశితముగా పరిశీలింపవలెను. అందరును ఏకవిషయమును పలుకగలిగినను, అనేక విషయముద్రతో అభిషిక్తమయిన మనస్సునుండి బహిర్గతమగు ప్రత్యేక విషయాంతర్గతముగా అంతరముద్ర యుండితీరును. ఆ నేర్పును దక్షుడయిన రచయిత చూపగలడు.

సన్నివేశమునందు సాధారణముగా ప్రసక్తములగు విషయములు, స్థలములు, పాత్రలు వీనికి అనుగుణముగా నుండును. అంతర్వాహినిగా కథ సాగుచున్నను, శృంగార హాస్యములు, లోకాభిరామాయణము, జాతీయాంతర్జాతీయ రాజకీయములకు, ఇప్పుడిప్పుడు సినిమాలగూర్చి ప్రసంగము కలుగవచ్చును.

సక్రమముగా సమాజమును చిత్రింపగల రచయిత కథాగమనము కుంటుపడకుండ సన్నివేశములు కథాకథనమునకు అనుకూలములుగా మార్చుకొని రచన చేయగలడు. నవలా రచనములో ప్రథమ తరమునందలి రచయితలు ఈ విధమయిన సన్నివేశ సత్కారము నవలలకు వాజాకుగా కల్గింపగలిగిరికాని, మలితరము రచయితలలో సన్నివేశ కల్పనమందలి నేర్పు క్రమక్రమముగా అడుగంటుచున్నదని చెప్పక తప్పదు. కాని, అవసరమయిన సన్నివేశములు కల్పించుకొన్న మలితరము నవలా రచయితలు, అవకాశమున్నంతవరకు సమాజ చిత్రీకరణము చేయగల్గిరి.

సన్నివేశములు, సంభాషణలు కొన్నిసాంఘిక నవలలయందే తెలుగుదనము ప్రదర్శింప లేకపోవుచున్నవి. దానికి కారణము ఇతర భారతీయ, భారతీయేతర నవలలలోని ధోరణులు సంతరించుకొనుట. ఆంధ్రసమాజము, ఇతర సమాజముల పద్ధతులు స్వీకరించిన, తనలో విలీనము చేసికొనిన చింతలేదు, తద్భిన్నముగా వ్రాయబడిన బాధ.

భారతీయుల రూపరేఖలలో ఎంతయో వైవిధ్యమున్నది. ఉత్తరప్రాంతము వారికిని, దక్షిణప్రాంతము వారికిని భిన్నత గోచరించును. ఆంధ్రులకు తదితరులకు రూపరేఖా విభేదము స్పష్టము. తెలుగువారు స్థూలముగా ఒక్కతీరునే ఉన్నను సూక్ష్మముగా బహువైవిధ్యము, ప్రాంతము, మతము, కులము కారణముగా, ఆకారములయందు, ముఖనిర్మాణము నందు, శారీరకవర్ణములయందు, కట్టుబొట్టుల యందు ప్రత్యేకముగా నుండునది ఆంధ్రుల సమష్టి వ్యవస్థ.

ఒక తెగ నవలలయందు పాత్రల రూపరేఖలు వర్ణనము పేరునకు మాత్రమే! పాత్ర స్వరూప స్వభావముల తులవోలె నుండదు. ఆ తెగ నవలలలో ఏ ఒక్క నవల చదివినను, తక్కుంగల నవలలను తడవ పనిలేదు. శరత్ నవలా ప్రభావము యువతరముపై మిక్కుటము. కొంతవరకు నది సత్సంగతియే కాని, ఆంధ్రత్వము అడుగునపడు అవకాశము స్పష్టము.

రూపరేఖా వర్ణనమువలన నవలయందు తెలుగుదనము సముపార్జింపవచ్చును. తమాత్మలముగా సమాజ

మును చిత్రింపవచ్చును? మొదటి తరము రచనములలో ఈ విధమయిన సమాజము గోచరించును.

వ్యక్తి పరిణమించుచున్నాడు. వ్యవస్థ మారుచున్నది. దేశము పరిణామము పొందుచున్నది. ఈ యుగధర్మములో మార్పు, వేగము రెండు విశిష్ట గుణములు. దేశాంతర రాజకీయములు దేశాంతర రాజకీయములగుచున్నవి. ఇతర దేశీయ జీవిత విధానము భారతదేశములో ప్రవేశించినది. ప్రాచీన సమాజస్థితి నూత్నరూపము దిద్దుకొన్నది. పల్లె జీవితము పట్టణము వైపు మొగ్గుచున్నది. వ్యవసాయము స్థానములో పరిశ్రమలు అభివృద్ధి చెందుచున్నవి. యుగధర్మమయిన వేగమును ఆధునిక మానవుడు అందుకొను యత్నము చేయుచున్నాడు. ప్రతి వ్యక్తియును సంక్రమిత స్వాతంత్ర్యము సంరక్షించుకొనవలెనని బోధింపబడుచున్నాడు. ఒకవిధమయిన వ్యవస్థనుండి మరొక విధమయిన వ్యవస్థవైపు ఆంధ్రసమాజము ప్రయాణము చేయు దశయందున్నది. ఈ యుగసంధి ఉత్తమ రచనములకు అటపట్టు కావలసియే ఉన్నది. కాని యుగధర్మము, తల్లక్షణములు సమగ్రముగా స్థాపింపగల రచన వెలువడలేదేమో ననిపించుట సహజము. ఈ కాలము ఉత్తమ రచనలు జనిపించితీరును. ఇంతవరకు ఆ సృష్టి జరుగలేదు. ఇక జరుగ వచ్చును.

ఇప్పటి తెలుగు సమాజమును చిత్రించిన నవలలు చాల కలవు. భారతదేశములో ఆంధ్ర నవలా సాహిత్యము సముచితస్థానమున నున్నది. నాల్గవస్థానముండవచ్చును. ప్రథమ స్థానమును ఆర్జింపగల సమర్థులయిన రచయితకు ఆంధ్రదేశమున కొరతలేదు. ప్రపంచమున ప్రసిద్ధ స్థానమును పొందగల నవలా సృష్టి అద్యతన భావిలో ఆవిర్భవింపవచ్చునని ఆశింపవచ్చును.

పరిణామ దశాప్రవర్తితము, ఆందోళనాయుతము సమస్యాసహితము, అంతర తేజమును అంగీకరించునది అయిన సమాజము ఉత్తమరచనలు సృజించు అవకాశము కల్గియుండును. అన్ని అందాల ఆంధ్రత్వము నాకాంక్షించు రచయితలు ఆంధ్రత్వమే మూర్తి దాల్చినట్లున్న నవలలు రచింపెదరని నమ్మవచ్చును. సమర్థుడు, ప్రతిభావంతుడయిన రచయిత తెలుగు సమాజమునే చిత్రింపవలెనను సంకల్పముతో నవలా రచనమునకు పూనుకొన్నచో, ఏ లక్షణము స్వీకరించినను స్వీకరింపకపోయినను, ఉత్తమ నవల సృజింపగలడు.

తెలుగువారల జీవితము, తెలుగు సమాజమును భాషేతరాలవారికి భద్రముగా చూపుటకు, మా నవల ఇది యని ఆంధ్రులు, ఇతర రాష్ట్రాలలో దేశాలలో సగర్వముగా చెప్పుకొనుటకు, తగిన నవల అచిరకాలములో ఆవిర్భూతి చెందునని సాహితీ విద్యార్థుల సమాకాంక్ష!



# గ్రంథ విమర్శలు

## నాకు చచ్చిపోవాలని వుంది...

[కథలు, రచన: ముప్పాళ రంగనాయకమ్మ, ప్రచురణ: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-2. వెల: రు. 3/-పుటలు: 196]

ఇందులో తొమ్మిది కథ లున్నాయి. 'నాకు చచ్చిపోవాలని వుంది...' అనేది ప్రధానమైన కథ. 56 పేజీలు సాగింది. 'చుట్టమై వచ్చాడు', 'సంబంధాలు', 'కమల', 'ఓ రోజు వస్తుంది', 'తల్లి మనసు' అనే కథల్లో చాలీ చాలని సంసారాలూ, సంకుచిత మనస్తత్వాలూ వర్ణిస్తూ, ఈనాడు తెలుగుదేశంలో సామాన్యంగా ఆడవాళ్ల చిత్తసంస్కారం ఏ స్థాయిలో వున్నదో తెలుసుకునేందుకు చక్కని అవకాశం కలిగించారు రచయిత్రి. 'తృప్తి' అనే కథ రచయిత్రి సంఘసంస్కరణపట్ల చూపుతున్న ఉబలాటాన్ని వ్యక్తంచేస్తుంది. రచయిత్రిలోని తీవ్రమైన అసంతృప్తి సంఘ సంస్కరణాభిలాషగా రూపొందుతూ వుండటం మెచ్చుకోతగ్గ విషయమే కాని అది ఒక్కొక్కసారి స్వోత్కర్షగా మారినప్పుడు ఎబ్బెట్టుగా వుంటోంది. 'నా కోరిక' అనే రచన (దీన్ని కథ అనటానికి వీల్లేదు) ఇందుకు ఉదాహరణ. రచయిత్రి సాహిత్యం అంటే తనకున్న అభిప్రాయాలను వివరించటం తప్పుకాదు; ఆ అభిప్రాయాలను రామచంద్రం అనే, ఒకానొక చేతగాని రచయితను 'డమ్మీ'గా' ఎదుటపెట్టుకుని వెలువరించిన ధోరణి ఏమీ అందంగా లేదు! (Not in good taste!). రామచంద్రం వ్రాసిన వాక్యాలను గూర్చి రచయిత్రి చేసిన ఆక్షేపణే ఆమె ప్రవచించిన వాక్యాలకూ అన్వయించే పరిస్థితి వుంది. 'సాహిత్యానికో పవిత్రమైన స్థానం, అపారమైన విలువా వున్నాయన్న సంగతి మర్చిపోకు' అనటంలో 'పవిత్రమైన స్థానం' 'అపారమైన విలువా' ఊకదంపుడు మాటలు కావా? అవేమిటో నిర్దేశించే ప్రయత్నం ఈ రచనలో జరిగిందా? లోతుతెలీని నీళ్లలో దిగటం ప్రమాదకరం.

'నాకు చచ్చిపోవాలని వుంది...' 'వచ్చింది జాబిల్లి' అనే రెండు కథలూ ఒక సమస్యనే ఇతివృత్తంగా తీసుకున్నాయి. ఇది నైతిక సమస్య. వివాహితయైన స్త్రీకి పరపురుషుడిమీద మనస్సుపోవటం. మొదటి కథలోని వరలక్ష్మి, రెండవ కథలోని హేమ, సంస్కారంలో, పరిస్థితుల్లో, పొందుతున్న భర్తృసౌఖ్యంలో భిన్నత్వం కలవారు. వరలక్ష్మి భర్తకు 'సెక్స్' తెలీదు. అతనికి పుంసత్వం ఉన్నదో లేదో స్పష్టంగా కథలో చెప్పకపోవడం లోపం. మగవాళ్లలో ఇంత అమాయకులు వుంటారా? అది అమాయకత్వం అని మాత్రం ఎలా అనుకోవటం? బి. ఏ. చదివిన వ్యక్తికి కనీసపు లోకజ్ఞానం కూడా లేకపోవటం ఏమిటి నా ఖర్మ గాకపోతే' అనే వరలక్ష్మి వాక్యాలనుబట్టీ, 'ఏడెనిమిదేళ్ల దాంపత్య జీవితంలో వరలక్ష్మి అనుభూతులన్నీ నిస్సారమైనవే' అనే రచయిత్రి వాక్యాన్నిబట్టీ వరలక్ష్మి భర్త నపుంసకుడని తేల్చుకోవాలి. వరలక్ష్మి శర్మ అనే పక్కింటి పురుషుణ్ణి సూచనగా ఆహ్వానిస్తుంది. తీరా శర్మ వరలక్ష్మికోసం వచ్చినప్పుడు జరిగిన సంభాషణ పట్టాలుతప్పి, చివరకు వరలక్ష్మి తన కే'కోరికా'లేదనీ, తనకు 'చచ్చిపోవాలని వుందనీ' చెప్పడంతో కథ ముగుస్తుంది. శర్మకూ వరలక్ష్మికీ మధ్య జరిగిన సంభాషణని రెండు మూడు విధాలుగా అర్థం చేసుకునే అవకాశం కల్పించింది రచయిత్రి. 'నీలాంటి దౌర్భాగ్యురాలంటే నిజంగా నాకెంతో జాలి' అని శర్మ అనటం మూలాన్నే, వరలక్ష్మి కోరిక నీళ్లుగారి పోయిందనుకునే అవకాశం ఒకటి. 'ఇప్పుడంతా భ్రమగానే తోస్తుంది. నీతినియమాల సంఘం ఎప్పటికీ నన్ను సమర్థించదు. మీరుకూడా విలువ పోగొట్టుకొన్న నన్ను లక్ష్యపెట్టరు' అని వరలక్ష్మి అనటంవల్ల, వరలక్ష్మిలో సంఘాన్ని గూర్చిన భయం ఆమె కోరికను జయించింది అని అన్వయించుకునే అవకాశం రెండు. సంఘాన్ని గూర్చిన భయంకంటె, వరలక్ష్మిలో సహజమైన ఆత్మాభిమానం జయించింది. శర్మమాపే పట్టి 'జాలి'ని ఆమె అంగీకరించలేకపోయింది, అనే అన్వయానికిగల అవకాశం మూడు.

పోతే చివర రచయిత్రి సూచించిన పరిష్కారం 'ఆత్మహత్య'—హాస్యాస్పదంగా, అర్థం లేకుండా వుంది. సంఘసంస్కర్తలు విడాకుల్ని ఆమోదిస్తారు. చలం వంటి రచయిత స్త్రీ కర్తవ్యం స్పష్టంగా తెల్పి చెబుతాడు. రచయిత్రి ఈ రచనలో కేవలం సమస్యను చిత్రించడమే ధ్యేయంగా పెట్టుకున్నదేమో అంటే చివర ఆమె చేసిన ఆత్మహత్యాసూచన, వ్యక్తపరచిన నిస్పృహ, అందుకు భిన్నంగా వున్నాయి. అందువల్ల ఈ కథ, రచయిత్రి ఆలోచనా వైఫల్యాన్నీ, ఆమెలో సంకోచాన్నీ వ్యక్తంచేస్తూ ఆగిపోయింది. అయినప్పుడు సాధించిన సాహిత్య ప్రయోజనం ఏముంటుందీ!

రెండవ కథలో హేమకు కలిగిన మనశ్చాంచల్యానికి ప్రతిగా ఆమె భర్త ఉదాత్త నైతికప్రవర్తనను గూర్చిన సంఘటన కూర్చబడింది. ఒకానొక దరిద్రురాలు, పతిత, అతణ్ణి తన అవసరంకోసం, డబ్బుకోసం ఆహ్వానిస్తుంది. ఆమె అందగత్తె. కాని హేమ భర్త ఆమె అందానికి చలించడు; ఆమె దీనస్థితిని గ్రహించి, అవసరమున్నడబ్బు యిచ్చి, తను చేసిన మంచిపనిని భార్యకు నివేదిస్తాడు! తత్కారణంగా హేమలో ప్రబోధం కలిగి, ఆమె మనస్సు క్షాళనం పొందుతుంది. ఈ కథలో రచయిత్రి చెప్పదలచుకున్నది:— పురుషుడు మంచివాడైతే స్త్రీ కూడా మంచిదవుతుందని! ఇది కూడా రచయిత్రి తీసుకున్న సమస్యకు పరిష్కారంగా తోచదు! ఏమంటే, పురుషుడు నియమబద్ధుడు కానప్పుడు, స్త్రీ కర్తవ్య మేమిటో సూటిగా చెప్పడానికి నిరాకరించడం, మళ్ళీ రచయిత్రిలోని ఆలోచనాస్తబ్ధత్వాన్ని సంకోచాన్నీ వ్యక్తం చేస్తోంది. ఇలాంటి సమస్యలు 'ఇచ్చిపుచ్చుకునే' 'బేరసారాల' నీతి మీద పరిష్కారం కావు! ఇవి ఆధ్యాత్మికమైన సమస్యలు; వ్యక్తి ఆత్మజ్ఞానంతో, సంస్కారంతో ముడిపడినవి. 'మనస్సు' చలించినంతమాత్రాన మన వివేకం ఏమౌతుంది? నీ సుఖదుఃఖాలు అంచనా వేసుకోలేని హీనస్థితిలో వున్నావని అనుకోను'... సుఖదుఃఖాల్ని ఫలితాల్ని అంచనా వేసుకుని భయపడి; మనస్సుని నిగ్రహించుకోవడం ఎంతవరకు? మనస్సు చలించడమంటే అది 'ఎటువంటి' చాంచల్యమో ఎవరు నిర్ణయించ గలరు? మధ్యతరగతివారి నీతినీ, మర్యాదనూ, చలం, డి. హెచ్. లారెన్స్‌వంటి రచయితలు విమర్శించటంలోగల అంతరార్థ మిదే! ఏ చాంచల్యమైనా అది ఆత్మవిమర్శకూ, వివేచనకూ శ్రీకారం చుట్టి, అక్కడినుంచి వ్యక్తి తన మనోవాక్కాయకర్మలలో [illegible] ప్రాధాన్యంయివ్వగలిగినప్పుడే, వ్యక్తిలో పెరుగుదల వుంటుంది. సూత్రప్రాయమైన ఒకానొక సాంఘిక మర్యాదను, నియమాన్ని ఉల్లంఘించటమా, మానటమా? అనేది అపసవ్యమైన, ఆత్మజ్ఞానశూన్యమైన ప్రశ్న. ఒకానొక సాంఘిక నియమానికీ, వ్యక్తిధర్మానికీ సంఘర్షణ అసలు ఉన్నదా లేదా, ఉంటే దాని స్వరూప మేమిటి? అని విచారించటమే ప్రయోజనకారియైన ప్రశ్న. రచయిత్రి వ్రాసిన పై రెండు కథల్లో, మొదటి కథలోని సరళ తన స్వధర్మ మేమిటో నిశ్చయించుకోలేని అశక్తతతో 'ఆత్మహత్య' చేసుకుంటానని ఏడుస్తుంది. బెదిరిస్తుంది! రెండవ కథలో హేమ తన ధర్మాన్ని, భర్త ప్రవర్తననుచూసి సరిదిద్దుకున్నది! కాని ఈ రెండు కథల్లోనూ రచయిత్రి సమస్యను రూపొందించిన తీరు సంఘపరంగానూ, కేవలం సాంఘికమైన స్త్రీ పురుష ధర్మాల్లో భిన్నత్వాన్ని విమర్శించేదిగానూ వుండి, వైఫల్యానికి దారితీసింది. రచయిత్రి ఆత్మపరంగా ఆలోచించడం ప్రారంభించినప్పుడే, సాహిత్యంలో ఆమె ఆలోచన ఫలిస్తుంది.

—ఆర్. ఎస్.

## గాజు కిటికీ

[కథల సంపుటి. రచన: శ్రీ తాడిగిరి పోతరాజు. ప్రకాశకులు: విశాలాంధ్ర ప్రచురణాలయం, ఏలూరు రోడ్; విజయవాడ—2. వెల: 2-50.

ఈ సంపుటిలో మొత్తం పది కథలున్నాయి. అన్నీ కథలూ ఇతఃపూర్వం ప్రసిద్ధాంధ్ర పత్రికలలో ప్రచురింపబడినవే...

వివిధ పత్రికలలో నేడు విరివిగా వస్తున్న సాహిత్యంలో మంచి అభిరుచులు గల పాఠకులచేత 'ఔను' అనిపించగలిగిన రచనలు కొన్ని వుంటున్నాయి. జీవితాన్ని నిశితంగా పరిశీలించి రచనలో నిగ్రహం చూపిస్తూ చక్కని రచనలు చేయగల రచయితలూ పలువురున్నారు. ఆయా కథలు, ఆయా సంచికలతో పాటుగా మరపున పడిపోకుండా పుస్తకరూపంలో వెలువడటం ఎంతైనా అవసరం. అయితే, ప్రతిభా

వంటివారైన రచయితలు కూడా అన్నీ అత్యుత్తమ రచనలే చేస్తారని ఆశించడం అత్యాశ కాబట్టి, వారి రచనలలో ఉత్తమమైన వాటిని మాత్రమే ఎన్నికచేసి ఒకచోట చేర్చి పుస్తకరూపంలో వెలువరించడం మంచిది. ఇటీవల వెలువడుతున్న కథల సంపుటాలను పరిశీలిస్తే, కొత్త పేరు తెచ్చుకున్న రచయితలూ రచయిత్రులూ తమపేర అచ్చయిన ప్రతి రచనా (చివరకు అషామాషీ ఉత్తరాలను కూడా) పుస్తకరూపంలో వెలువరించాలని కుతూహలపడుతున్నట్లు విదితమవుతుంది. ఆ ధోరణి అట్టే మంచిది కాదని వేరే చెప్పనక్కరలేదు. ఎన్నిక అనేది రచయితలూ, పుస్తక ప్రకాశకులూ కూడా జాగ్రత్తగా పట్టించుకోవలసిన అంశం...

'గాజు కిటికీ' పేరుతో వెలువడిన ఈ సంపుటిలో పైన చెప్పబడిన ఎన్నిక స్పష్టంగా కనిపిస్తున్నది. కేవలం ఉబుసుపోకకు కథారచన సాగించే నేటి పలువురు రచయితలవలె కాక ఈ రచయిత చిత్తశుద్ధితో జీవితాన్ని నిశితంగా పరిశీలించి తనకు కావలసిన వస్తువును ఎన్నుకొని, అనవసరమైన ఉద్రేకాలకు లోనుగాకుండా నిగ్రహంతో కథారూపంలో మలుస్తున్నారని అనిపించి తీరుతుంది.

'గాజు కిటికీ' ఈ సంపుటి మొత్తం మీద ఉత్తమ రచన. ఒక జేబుదొంగ డైరీలో ఒక పేజీ యిది. అతని ఆలోచనలూ, అతడు వేసే ప్రణాళికలూ, అతని పరిశీలనా, చివరకు అతనిలోని మానవత్వపు కదలిక, అందు కతడు చెల్లించవలసివచ్చిన మూల్యమూ...ఇవన్నీ చక్కగా సమపాళ్లలో కుదిరి పాఠకుల హృదయస్పందిగా సాగింది రచన...

'సెలవు' కథలో మేస్త్రీ ఇచ్చిన 'హోంవర్కు' చెయ్యని పిల్లవాడు, మంత్రిగా తిరిగి రావాలనుకున్న ఆ పిల్లవాడి గురించి... కథలో బాల పుస్తకాల్లో నుంచి ఆలోచించాడు, ఆ బాలుని మనస్తత్వం మేస్త్రీకే గాక పాఠకులకు కూడా నవ్వు తెప్పించక మానదు... 'లోయలు' కథలో బీద దాసీపట్ల కనికరం చూపించి అందువల్ల ఆమె మరింత హింసకు గురి కాగా క్షోభించిన మంచి యువకుడి మనస్తత్వాన్ని రచయిత సమర్థంగా నిర్వహించారు...'మయసభ'లో చొరవతో, కొంచెం మోసంతో ప్రవర్తించే శ్రీనివాసులు క్రమంగా పెద్ద పలుకుబడిగల వ్యక్తిగా చెలామణీ కావడం అతని అక్కగారికే కాక మనకూ ఆశ్చర్యకరమైన విషయమే. నేటి కొందరు అవకాశవాదులైన రాజకీయనాయకుల మీద ఈ కథ మంచి వ్యాఖ్యానం... 'ముష్టివాళ్లు' కథలో అధికారంలో ఉన్న వ్యక్తి చేత తమ పనులు తమ కనుకూలంగా పరిష్కారం చేయించుకునేందుకు ఉపగ్రహాలవలె తిరిగే పెద్దల పాట్లూ, వారు వేసే ఎత్తులూ బాగా చిత్రించారు...రచయిత...

జెల్లీళ్లు, గృహోన్ముఖుడు, శిక్ష, వాన, పావులు...కథలు కూడా చక్కని రచనలు. 'వాన' కథ సూర్యుడు "గిన్నె పుండులా ఎర్రగా మండుతున్నాడు" అని ప్రారంభమవుతుంది. ఈ ధోరణి చిత్రం అనిపిస్తుంది.

మొత్తంమీద పది కథలూ రచయిత వ్యక్తిత్వాన్ని, ఆలోచనా ధోరణినీ, రచనా సామర్థ్యాన్నీ తెలియజేసేవిగానే ఉన్నాయి. కథానికా ప్రియులందరూ అవశ్యం చదువవలసిన సంపుటం యిది.

—పి.

---

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras 1.**
**Editor : S. Sambhu Prasad**




# అమృతాంజనం వాడి

## శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారించుకోడానికి లోపలికి మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా కండరాల నొప్పులకు, తల నొప్పికి, బెణుకులకు ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకే కాక సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెంకొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతా కలిసి నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధిపొందిన నమ్మకమైన గృహౌషధం.




అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.

అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు · బొంబాయి · కలకత్తా